

నవలల పోటీలో

ప్రథమ బహుమతి పొందిన నవల



# పొద్దు తిరుగుడు పువ్వు

యామిని

# పొద్దు తిరుగుడు పువ్వు....

"....ఆ పొద్దుతిరుగుడుపువ్వు చూడు! ఎప్పుడూ ఆ సూ
బట్టే అది తిరుగుతూంటుంది. ఆడదాని జీవితం పొద్దుతిరుగుడు
లాంటిదమ్మా! మన సాంప్రదాన్నిబట్టి ఆడపిల్ల చిన్నతనంలో
సంరక్షణలో తండ్రి చెప్పినట్లూ, వయసొచ్చేక భర్త పా
అతను చెప్పినట్లూ ....వృద్ధాప్యంలో కొడుకుల పోషణలో
చెప్పినట్లూ వినాలి!...." తండ్రి తన కిష్టంలేని రెండో
సంబంధం తెచ్చినప్పుడు తాను పెళ్ళి చేసుకోనని ఎదురు
సూర్యకాంతానికి చెప్పిన హితవాక్యం ఇది. కాబోలుననుకొ
వంచింది సూర్యకాంతం.

"....ఆడదాని జీవితం పొద్దుతిరుగుడు పువ్వు లా
కావచ్చు! మగవాడు సూర్యుడంత తేజస్వీ పవిత్రుడూ అయితే
మంచిదే! సూర్యుడికీ ఆ పువ్వుకీ ఉండే బంధం నిరంకుశ
శాసనం కాదు. అది ఒక పవిత్రమైన అనురాగ బంధం! స
బంధం! అంతేకాని మగవాడు నీతిలేనివాడయి ఆడది తనకు
పగా ఉండాలనుకోవడం మగవాడి స్వార్థం, అహంకారం
తుంది...." అంటుంది సూర్యకాంతం కూతురు సరోజ అటు
సందర్భంలోనే."

# పొద్దు తిరుగుడు పువ్వు

అయిదు నిముషాలపాటు ఆడిటోరియం చప్పట్లతో మారుమ్రోగి పోయింది.

రవికుమార్ ప్రేక్షకుల్లోంచి లేచి గ్రీన్‌రూంలోకి వెళ్ళేడు. ఆ ప్రదర్శనలో పాల్గొన్న నటీనటులందరినీ అభినందించేడు.

సరోజ దగ్గరకు వచ్చి రహస్యంగా, "నువ్వు స్టేజిమీదకు వచ్చినప్పుడు నీ సహనటుడి బదులు నేను పాడుతూ వచ్చేద్దామను కున్నాను" అన్నాడు నవ్వుతూ.

"మీ కయితే రిహార్సల్ అక్కర్లేకపోను" అంది సరోజ కూడా నవ్వుతూ.

వేషం చెరుపుకొని సరోజ రవికుమార్‌తో బయటికి వచ్చింది.

రవికుమార్ సరోజకు లేడీస్‌హాస్టల్ వరకూ లిఫ్టుయిచ్చేడు.

స్కూటర్ దిగి రవి కనబడినంతవరకూ నిలబడి చూసి హాస్టల్‌లోకి వెడుతూన్న సరోజకి వార్డెన్ మిసెస్ ఉషామెహతా ఎదురయింది.

"ఎవరతను సరోజా?" అంది ఆవిడ.

"మిస్టర్ రవికుమార్."

"ఏంచేస్తున్నాడు."

"యూనివర్సిటీలోని బ్యాంకు బ్రాంచిలో ఆఫీసరు" అంది.

"ఐసీ!" ఉషామెహతా వెళ్ళిపోయింది.

కళ్ళజోడు ఫ్రేములోని ఆవిడ కళ్ళల్లోంచి కనబడిన మంద హింపు సరోజ పనులన్నీ ముగించుకొని పక్కమీద చేరినా మనసు విడచిపోలేదు.

అప్రయత్నంగా జరిగిన సంఘటనలవైపు మనసు పోయింది.

ఆ రోజు టరమ్‌ఫీజు కట్టవలసిన ఆఖరురోజు. ఫీజు కట్టవలసిన సంగతి సరోజ మరచిపోయింది. మధ్యాహ్నం లంచ్ అయిన తర్వాత క్లాసులోపలకు వెడుతూంటే ఫ్రెండ్సు అనుకొంటూంటే హఠాత్తుగా గుర్తుకొచ్చింది.

పరుగెత్తుకొని బ్యాంకుకు వెళ్ళింది. టైము రెండూముప్పై అయిదయింది. బ్యాంకులో కౌంటరుమీద స్టాఫ్ అందరూ లంచ్‌కి వెళ్ళిపోయారు. ఒక్క రవికుమార్ మాత్రం వున్నాడు. అతను లెడ్జర్స్ మూసి లేవబోతున్నాడు. కౌంటర్‌ముందు సరోజ నిలబడి 'ఎక్స్క్యూజ్‌మి!' అంది.

"యస్ ప్లీజ్!" రవికుమార్ ముందుకొచ్చేడు.

"ఈ ఒక్క చెక్కు తీసుకోండి సార్; డబ్బు అర్జెంటుగా కావాలి ప్లీజ్!" అంది. రవికుమార్ ఓ సారి గోడగడియారం వైపు చూసేడు.

కేష్‌కౌంటర్‌లో కేషియర్ అప్పుడే డ్రాయరుసొరుగు తాళంవేసి బయటకు వస్తున్నాడు.

"మిస్టర్ కులకర్ణీ! వన్ మినిట్!" అని రవికుమార్ కాషియర్‌తో చెప్పి "చెక్ యివ్వండి" అని సరోజవైపు చేయి చాచేడు. సరోజ చెక్ యింకా రాయలేదు. చెక్‌బుక్ బయటపెట్టి పెన్నుకోసం బ్యాగ్‌లో వెతుకుతూంది.

"ఇది తీసుకోండి" రవి తన జేబులో పెన్ తీసి యిచ్చేడు. సరోజ చెక్ పూర్తిచేసి యిచ్చింది.

రవికుమార్ స్వయంగా కౌంటర్‌లో లెడ్జరు తీసి పక్కనే వున్న బాల్‌పెన్నుతో పోస్టింగ్‌చేసి కేషియర్‌కు చెక్ యిచ్చేడు.

సరోజ వెళ్లి డబ్బు తీసుకొని గుమ్మంవరకూ వెళ్లిపోయి రెండడుగులు వెనక్కువచ్చి "థాంక్యూ వెరీమచ్ సర్!" అంది.

"ఇటీజ్ ఆల్‌రైట్!" రవికుమార్ చిరునవ్వు నవ్వేడు.

ఆ రోజు సాయంత్రం రూమ్‌కు వెళ్ళినతర్వాత బ్యాగ్‌లో రవికుమాల్ పెన్నుచూసి ఒక్కక్షణం ఆశ్చర్యపోయింది. "ఆలస్యమైనా చెక్ తీసుకున్నందుకు ఆయనకు పాపం శిక్ష బాగానేవుంది.

మరచిపోకుండా రేపు ఇచ్చెయ్యాలి" అనుకుంది.

మర్నాడు క్లాసులో ఫస్టవర్ అయిపోయిన తర్వాత బ్యాంకు బ్రాంచికి బయలుదేరింది. దారిలో కేంటీన్‌లోకి వెడుతూ రవికుమార్ కనిపించేడు.

తొందరగా అడుగులు వేసుకుంటూ అతన్ని కలిసింది.

"అయామ్ సారీ! నిన్న మీ పెన్ను తీసుకొని యివ్వడం మరచిపోయాను" అంది సరోజ.

"ఇప్పుడిచ్చేరుగా! థాంక్స్!" అన్నాడు రవి. రవి అప్పటికి టీ టోకెన్స్ తీసుకుంటున్నాడు. పెన్ను తీసుకొని "హౌ ఎబౌటు ఎ కప్ ఆఫ్ టీ?" అన్నాడు.

సరోజ కొంచెం తటపటాయించి వద్దని చెప్పబోతూంటే అతను అప్పటికే సరోజకు కూడా టోకెన్ తీసుకున్నాడు. అతను టోకెన్ సర్వరుకిచ్చి "కూర్చోండి. మంచినీళ్ళు తీసుకొని వస్తాను" అని జవాబు కోసం ఎదురుచూడకుండా వెళ్ళిపోయాడు.

సరోజ రెండు టీలు తీసుకొని టేబిల్ దగ్గరకు వెళ్ళింది.

"అరె! నేను వస్తున్నానుగా!" అన్నాడు రవి మంచినీళ్ళ గ్లాసులు టేబిల్‌మీద పెడుతూ.

"ఫరవాలేదు లెండి" సరోజ కూర్చుంది.

"ఏంచేస్తున్నారు మీరు?" అన్నాడు రవి.

"ఎమ్.ఎస్ సి ఫైనల్" అంది సరోజ.

"రెండేళ్ళ క్రితం నేనూ అంతే! పోస్టుగ్రాడ్యుయేషన్‌లో న్యూక్లియర్ ఫిజిక్సు తీసుకొని ఇదిగో ఇప్పుడు బ్యాంక్‌లో ఆఫీసర్‌గా పని చేస్తున్నాను. ఒకటి నుంచి పది వరకూ అంకెలు కూడు తుంటున్నాను ...ఇంకా నేను లక్కీ! ఇదీ లేనివాళ్ళున్నారు నా ఫ్రెండ్స్!....మీరేం చేద్దామనుకుంటున్నారు?" అన్నాడు రవి.

"ఇంకా ఏమీ ఆలోచించుకోలేదు."

"తొందరగా ఆలోచించుకోండి! చివరకి వంట చెయ్యడమే అయితే యీ స్పెషలైజ్‌డ్ కోర్సెస్ అన్నీ అనవసరం."

సరోజ కొంచెం ఆశ్చర్యంతో అతని కళ్ళల్లోకి చూసింది.

రవి అది గమనించకుండానే అన్నాడు. "నాకు యీ యూనివర్సిటీ వాతావరణం అంటే చాలా యిష్టం. నా పోస్టింగ్ కూడా యిక్కడే జరగడం నా అదృష్టం."

ఇద్దరూ కేంటీన్‌లోంచి బయటకు వచ్చారు.

"థాంక్సండి!" అంటూ సరోజ నమస్కారం పెట్టి క్లాస్ రూమ్‌వైపు వెళ్లిపోయింది.

ఆనాటి నుండి ఎప్పుడు బ్యాంకుకు వెళ్లినా రవి నవ్వుతూ పలుకరించేవాడు.

ఒకసారి రవి బజారులో కలిపి ఇంటికి టీకి రమ్మని వాళ్ళ అక్కగార్ని పరిచయం చేస్తాననీ పట్టుపట్టేడు. కాదనలేకపోయింది. తల్లిదండ్రులు లేక ఒకరికొకరు తోడుగా నెట్టుకొస్తున్న అక్కనీ తమ్ముడినీ చూస్తే సరోజకు మనసులో జాలి కలిగింది.

ఆ తర్వాత ఒక అనాధ శరణాలయం తరపున ఏర్పాటుచేసే ప్రోగ్రాంలో సరోజను కూడా పాల్గొనమని సహాధ్యాయి ప్రేమరాజు అడిగినప్పుడు కాదనలేకపోయింది.

ఆనాడు బ్యాంకుకు వెళ్లినప్పుడు రవికి ఇన్విటేషన్ ఇచ్చింది. రవి ప్రోగ్రాం అయిన తర్వాత వచ్చి ప్రత్యేకంగా అభినందించేడు.

ఆ తర్వాత స్నేహం ఎక్కువయింది. చిన్నచిన్న వేళా కోళాలూ, చిన్నచిన్న మెచ్చుకోడాలూ, కొంటెచూపులూ, హోటళ్ళూ, సినిమాలూ, పిక్‌నిక్‌లూ....ఆరునెలలు గడిచేటప్పటికి రాత్రి తలగడ మీద తలఆన్చి పడుకొనేసరికి కళ్ళు మూయగానే రవి రూపం కళ్ళ ముందు నిలవడం—నిశ్శబ్దంగా కలలుకనడం అలవాటయిపోయింది సరోజకి.

## 2

వీధిలో ఆగిన గుర్రబ్బండిని చూడగానే కూతురు వచ్చేసిందనే సంతోషంతో తొందరగా బయటకు వచ్చేసింది కాంతం.

కాని బండిలోంచి దిగిన యువకుణ్ణి చూడగానే ఉత్సాహం ఎగిరిపోయి ముఖంమీద ప్రశ్నమాత్రం నిలిచిపోయింది.

మరుక్షణంలో బండిలోంచి దిగిన సరోజను చూసి యింకా

ఆశ్చర్యపోయింది కాంతం. నవ్వుతూ ముందడుగువేసిన సరోజను చూడగానే సందేహాలన్నీ పక్కకునెట్టి "వచ్చేవామ్మా! ఇంతాలస్యమై పోయింది యింకా రాలేదేమిటి చెప్మా! అని ఎదురు చూస్తున్నాను" అంది కాంతమ్మ.

"నాన్నకెలా వుందమ్మా?" ఆందోళనగా అడిగింది సరోజ.

"నాన్నకేం బాగానే వున్నారు" అర్థంకాలేదు కాంతానికి.

"అదేమిటీ? వంట్లో బాగులేదనీ అర్జెంటుగా రమ్మని టెలిగ్రాం ఇచ్చేరు."

"అలాగా! నాకు తెలీనే తెలీదు."

"నాన్న యింట్లో వున్నారా?"

"లేదు. కాకినాడ వెళ్ళేరు. ఓ గంట రెండు గంటల్లో వస్తారు. నీకింత ఆలస్యమైందేమమ్మా?"

"ట్రెయిన్ దొరకలేదు. రాజమండ్రిదాకా బస్సులో వచ్చి అక్కడ నుంచి బండిలో వచ్చేం...." అంటూ రవివైపు తిరిగి "రండి లోపలకు రండి" అని రవితో మాటలు పొడిగా మాట్లాడినా చూపుల్లో మరికొంత ఆత్మీయత కలిపి తల్లితో యింట్లోకి నడిచింది.

తల్లీకూతుళ్ల ముందు నడుస్తూంటే వెనుక రవి ఇంటివైపు చూశాడు.

వెనుకనే సామానులు తీసుకొచ్చిన బండివాడికి డబ్బులిచ్చి పంపించేడు రవి.

"అన్నయ్య ఎలా వున్నాడమ్మా?" అని అడిగి, తల్లిముఖం రంగులు మారిపోవడంచూసి మాట మార్చింది సరోజ. తరువాత మెల్లగా చెప్పింది కాంతం వారంరోజుల క్రితం సూర్యం ఇనప్పెట్టె లోంచి దొంగతనంగా రెండువేల రూపాయలు తీసుకొని వెళ్ళి పోయాడనీ ఇప్పటిదాకా జాడలేదనీను. కోడలు పద్మావతి ముఖం చూడలేక నాలుగురోజులు వాళ్ళ పుట్టింటిదగ్గరేనా ఉండివస్తుందని అక్కడికి పంపేనంది. సరోజ ఓసారి నిట్టూర్చి తిరిగి రవిదగ్గర కొచ్చింది. వీధివైపు కాస్త వెలుతురున్న గదిలో అతని సూట్‌కేసు పెట్టి అతన్ని అక్కడ కూర్చోబెట్టింది.

"నేను కాస్త ఉపోద్ఘాతాలూ అవీ ఇచ్చి మెల్లగా అసలు విషయంముందు అమ్మతో చెప్పాలి. సమయానికి అన్నయ్యా,నాన్నా ఇంట్లో లేకపోవడం కొంతమంచిదే అయింది. లేకపోతే బయట బండి దగ్గరే చిన్నసినిమా అయిపోయేది. నాన్న బాగానేవుండి టెలి గ్రామ్ ఇచ్చారంటే వెనకాల ఏదో వుండివుండాలి....అందుకని మీరు కాస్త మీ పుస్తకాలతో కాలక్షేపం చేస్తూండండి. ఈలోపులో స్నానా నికీ భోజనానికీ ఏర్పాట్లు చేస్తాను. ఈ ఒక్కపూటకూ ఇలాకూర్చో పెట్టేనని ఏమీ అనుకోవద్దు" అని ప్రేమగా కళ్ళల్లోకిచూసి వెళ్ళి పోయింది సరోజ.

రవి ఈజీఛెయిర్లో కూర్చుని చదవడానికి ప్రయత్నించి విఫలు డయి కిటికీలోంచి కనబడుతున్న రోడ్డువైపుచూస్తూ కూర్చున్నాడు.

పొయ్యిమీద పాలను చూస్తూండమని సరోజకుచెప్పి కూరలు ముందేసుకు కూర్చుంది కాంతం. మనసులోవున్న సందేహాన్ని నివృత్తి చేసుకోవాలనుకుంది.

"నీతోవచ్చిన ఆ అబ్బాయి ఎవరమ్మా!"

"ఆయన హైదరాబాదులో బ్యాంకులో ఆఫీసరు. యూని వర్శిటీలోనే వాళ్ళబ్రాంచి. అక్కడ పరిచయం అయిందమ్మా! చాలా మంచివారు...." సరోజ ఆగింది.

"చెప్పు!" కాంతం తలెత్తకుండానే అంది.

"ఆయనకు ఒక అక్కగారు వుంది. ఆవిడకూడా ఉద్యోగం చేస్తూంది. పెళ్ళికాలేదు. వీళ్ళిద్దరికీ ఇంక ఎవరూలేరు...." సరోజ మళ్ళీ ఆగింది.

"అతను నీతోకూడా ఎందుకొచ్చేడు?"

ఇంక డొంకతిరుగుడు మాటలుచెప్పి లాభంలేదనిపించింది సరోజకు. అతిమెత్తని హృదయంగల తల్లికి తనమాటలు నచ్చు తాయో నచ్చవోనని అప్పుడు భయం కలిగింది. కాని చెప్పకతప్పదు. మనసు గట్టిచేసుకుంది.

"...మేమిద్దరం పెళ్ళిచేసుకోవాలనుకున్నామమ్మా! మీకు చెప్పి మీకుచూపించి మీ అంగీకారం తీసుకోవాలని తీసుకొచ్చేను."

సరోజ తలవంచుకునే అంది.

కాంతం కూరలు తరగడం ఆపి చలనంలేకుండా నిలబడి పోయింది. కూతురు ఆశలను అర్థం చేసుకుంది. కాని భర్త ఆరోజే సంబంధం తీసుకురావడానికి వెళ్ళాడు. సరోజపని ఆయన వొప్పు కోరు. కాంతం మనసులో భయం మొదలయింది.

"నాన్న ఏమంటారో!" అంది ఆందోళనగా కాంతం కాఫీ కలుపుతూ.

"నాకు నువ్వు మనస్ఫూర్తిగా అంగీకరిస్తే చాలు. నాన్న విషయం నేను చూసుకుంటానమ్మా!"

"అలాగేనమ్మా! అన్నింటికీ ఆ భగవంతుడే వున్నాడు. నీ సుఖంకంటే నే నీ ప్రపంచంలో కోరుకునేదేదీ లేదమ్మా!"

సరోజకు హృదయంలో భారం దిగినట్లనిపించింది. టిఫిన్ కాఫీ తీసుకెళ్ళి రవికి ఇచ్చింది.

తరువాత ఇంట్లో కూర్చోలేక రెండుగంటలు అలా తిరిగొస్తా నని రవి బయటకు వెళ్ళాడు.

సరోజ ఇంటివెనుక తోటలోకి వెళ్ళింది. కాంతం తన పని పూర్తిచేసుకుని తానుకూడా కూతురు దగ్గరకు వెళ్ళింది.

పొద్దుతిరుగుడు పువ్వు సరోజపక్కనే గాలికి ఊగుతూంది. కాంతం మనసులో గతం ముందుకొచ్చి నిలబడింది. కూతురు భవి ష్యత్తు ఎలా వుంటుందోననే ఆందోళనను తొలగించుకోలేకపోతూ వుంది.

"ఏమిటమ్మా ఆలోచిస్తున్నావు?" సరోజ అడిగింది.

"ఏం లేదమ్మా! జీవితంలో కలలుకనేరోజులు గడిచిపోయే యమ్మా నీకు. నీ ఆలోచనలకూ జరగబోయే దానికీ ఏమయినా సామ్యం వుంటుందో లేదోనని భయపడుతున్నాను."

"ఎందుకమ్మా అలా అంటున్నావు? నా మటుకు నాకేమీ సందేహంలేదు."

"నీ వయసులో నేనూ అలాగే అనుకున్నానమ్మా! కాని ఆడదాని జీవితం ఆమె చేతుల్లోలేదు" అంది కాంతం. ఇద్దరూ

తోటలో సిమెంటు బెంచిమీద కూర్చున్నారు.

# 3

కాంతం ఒంటరిగా కూర్చుని దూరంగాచూస్తూ దీర్ఘంగా ఆలోచిస్తూంది. కాంతం తనచుట్టూవున్న వాతావరణంలో పెరిగినంత సహజంగానే చుట్టూవున్న సాంప్రదాయంలోకూడా పెరిగింది. కానీ ఒకరోజు ఆ యింట్లో తనవునికే ఒక సమస్యగా పరిణమిస్తుందని కానీ, తనకేమాత్రం సంబంధంలేని మనుషులముందు ఒక కృత్రిమమైన ఓటమితో తలవంచవలసి వస్తుందనికానీ ఊహించలేదు. ఇప్పటికి అయిదు సంబంధాలయ్యేయి. చూసేవాళ్ళ గొంతెమ్మ కోరికలేవో తీరక అమ్మాయి నచ్చలేదని అనగానే మనసు చివుక్కుమనేది. తాను తలిదండ్రులకు తొలగించవలసిన బరువనీ, తమ ఆస్థి నమ్ముకొని అయినా తనను వదిలించుకోడానికి తల్లి తండ్రులు అలమటించి పోతున్నారనీ తెలియగానే అవ్యక్తమయిన ఆవేదనతో కుమిలిపోయింది. ఈ సంఘంలో జీర్ణించుకుని పోయివున్న సాంప్రదాయమే తన శత్రువని కాంతం పసిహృదయానికి స్పష్టంగా స్ఫురించలేదు. తన వ్యక్తిత్వాన్ని ఎవరూ గుర్తించటంలేదనీ తాను స్వతంత్రంగా నిలబడాలనీ ఏవో పిచ్చివూహల్లో వుంది. ఏమయినా తన మనసులోని ఆలోచనలు తండ్రికి నచ్చజెప్పాలని వెళ్ళింది.

భానుమూర్తి బయట అరుగుమీద పక్కవేసుకుని నడుంవాల్చి విసనకర్రతో విసురుకుంటున్నాడు. లోపల మహాలక్ష్మి పనిచేసుకుంటూంది.

"నాన్నా!"

భానుమూర్తి తలతిప్పి చూసేడు.

మనసులోని ఆలోచన బరువుతోనేమో నన్నట్లు తలవంచుకుని గోటితో గోడనుగిస్తూ నిలబడింది కాంతం.

"ఏమిటమ్మా? చెప్పు" భానుమూర్తి అడిగేడు.

"నీకోమాట చెప్తాను. ఏమీ...."

"నాదగ్గర దాపరికం ఏమిటి? చెప్పమ్మా!"

"ఇప్పటికి ఎన్ని పెళ్ళిచూపులయ్యేయి నాన్నా?"

"ఎన్నయితేనేమిటి? ఘటన ఎక్కడుందో! అది కుదిరేవరకూ మరి...."

"నాకు చదువుకోవాలని ఉంది నాన్నా!"

"ఇప్పటికే నీపెళ్ళి ఆలస్యం అయిపోయిందమ్మా! ఆడపిల్ల చదువులు చదవడం మన ఆచారం కాదమ్మా! ఊరికే యింట్లో వున్నావుకదా అని ఏదో సరదాకు ఇన్నాళ్ళు చదివించేం కాని....ఎదిగొచ్చిన పిల్లవి పెళ్ళికాకుండా వుంటే వీధిలో పరువూ ఇంట్లో మన శ్శాంతీ ఉంటాయామ్మా! కన్నతండ్రిగా నా బాధ్యత...."

"బాధ్యత అనుకునే ఆ స్తినంతా అమ్మి అక్కలిద్దరి పెళ్ళిళ్ళు చేసేరు. ఇప్పుడు నాకోసం ఆ మిగిలిన రెండెకరాలూ అమ్మేస్తే మరి మీకు కాలూ చెయ్యీ ఆడనప్పుడు చూసేవాళ్ళమాత్రం యెవరు నాన్నా?"

"అన్నింటికీ ఆ పరమేశ్వరుడే వున్నాడు. ఎప్పుడో యేదో జరుగుతుందని ఇంట్లో ఆడపిల్ల పెళ్ళిచెయ్యకుండా వుంచితే ఇహం పరం వుంటాయా?"

"అన్నీ అమ్ముకున్నాక పరం సంగతి దేవుడెరుగును కాని ఈ భూమ్మీద ఒక్కరోజు గడిచేదెలా నాన్నా?"

"మనం మనుషులం. అంతకంటే మనం ఏం చెయ్యలేమమ్మా."

"ఎందుకు చెయ్యలేం నాన్నా! నేను ఇంకా చదువుకుంటాను. ఉద్యోగం చేస్తాను. ఈ ముసలితనంలో మీకు ఏ దిగులూ లేకుండా తోడుంటాను."

"కూతురుచేత వుద్యోగం చేయించుకుతింటే పుట్టగతులుంటాయా! ఏమయినా నీకు పెళ్లిచెయ్యాలి. మాకు అంతగా గడవకపోతే అప్పుడే మీ దగ్గరకొస్తాం! నువ్వో ఇంటిదానవయి పిల్లా పాపాతో వుంటే అదేచాలు...."

అప్పుడే మహాలక్ష్మి పనిచేసుకొని వచ్చింది.

"అన్నీ మనం అనుకున్నట్లు జరగవు నాన్నా! నేను చదువుకుంటాను."

"నీకు తెలీదమ్మా."

"ఏం తెలీదు నాన్నా? వచ్చినప్పుడల్లా దూళ్ళ సంతలో దూళ్ళను పరీక్షచేసినట్లు చేస్తే నేన్నిలవలేను."

"బాగుంది వరస! తొండముదిరి ఊసరవెల్లయిందని మన యింటా వంటా లేవు చదువులు వద్దండీ అంటే విన్నారుకాదు. ఇప్పుడుద్యోగం అంటూంది. ఇద్దరు పిల్లలకి తల్లి కావలసిన వయసు. ముద్దు ముద్దుగా కూతురు చెప్పడానికీ అయ్య వినడానికీ సరిపోయింది వీఘెక్కి నలుగురూ మొహంమీద వుమ్మేస్తారు...." మహాలక్ష్మి అందుకుంది.

"ఇప్పుడేమయిందే అలా రంయ్ మంటావు!...." అని భానుమూర్తి అంటూంటే కాంతం గుడ్లల్లో నీళ్లు కుక్కుకుని లోపలకు వెళ్లిపోయింది.

మంచంమీద పడుక్కొని చీకట్లోకి చూస్తూ తలగడ తడిపింది.

రెండు రోజుల తర్వాత కాంతం ఇంట్లో ఏదోపనిచేసి చేతులు కడుక్కొని పైట చెంగుతో చేతులు తుడుచుకొని ఓ నవల తీసుకొని చదువుదామని మంచంమీద ఒరిగేసరికి బయట తండ్రీ, జగన్నాధం మాటలు వినబడ్డాయి. తన పెళ్ళికి సంబంధించినవి కావడంతో పుస్తకం పక్కమీద పారేసి తలుపు పక్కకొచ్చి నిలబడింది కాంతం.

జగన్నాధం అంటున్నాడు. "మన నారాయణమూర్తి వుండే వాడు కదూ! వాడి బావమరిది...."

భానుమూర్తి అంటున్నాడు. "జానకిరామయ్య! అతనుపోయి పదేళ్ళు కావస్తూంది."

"ఆఁ! జానకిరామయ్య కొడుకు భాస్కరం! పిల్లవాడు బి.ఏ. పాసయ్యేడు. మూడొందలు తెచ్చుకుంటున్నాడు."

"నీకెలా తెలిసింది దీని విషయం?"

"వాళ్ళమ్మకి పసుపు కుంకం కింద ఇచ్చిన ఓ ఎకరం పొలం అతను బేరం పెట్టడానికొచ్చాడు. నిన్న మా చెల్లెలిగారింటికి వెళ్ళి నప్పుడు అనుకోకుండా ఈ భోగట్టా తెలిసింది."

"మరి ఓసారి వెళ్లి మాట్లాడి వస్తావా?"

"నిన్న మా బావగారితో మాట్లాడేను. పిల్లవాడి తల్లి మంచం పట్టింది. కొడుకు పెళ్లికోసం కాచుక్కూర్చుంది. ఇతనికి పిల్లనచ్చి కులగోత్రం కుదిరితే సరేనంటుంది."

"మరి పిల్లనచ్చద్దూ?"

"ఇన్ని సంబంధాలు తిరిగిపోయింది పిల్లనచ్చకా! వాళ్ల దిగింది మనం ఇవ్వలేక కాదూ! కాంతానికేం అపరంజి బొమ్మ!"

"మరయితే దీనికిమాత్రం మనం తూగగలమంటావా?"

"వాళ్ళు ఆస్తులూ అవీ వున్నవాళ్ళు కాదు. అబ్బాయే మన కన్నీను. ఎనిమిదివేలు కట్నంయిస్తే ఒప్పుకోవచ్చు."

"అయితే ఇకనేం!"

"కాని ఒకటుంది. అబ్బాయి రెండో పెళ్లివాడు."

కాంతం గతుక్కుమంది.

"రెండో పెళ్ళివాడా?" భానుమూర్తి కూడా తటపటాయించేడు.

"అయితే ఏం? ఇంకా ముప్పై నిండలేదు. పాపం ఆ అమ్మాయి మొదటికానుపు ఓ పిల్లవాణ్ణి కని పోయిందట."

"అయితే ఫరవాలేదంటావా?"

"ఫరవాలేకపోవడమేకాదు. ఒక టో ర క ం గా వుంటుందంటాను."

"మరయితే అతను వెళ్ళిపోకుండా రేపే పెళ్ళిచూపులకు ఏర్పాటు చేసేస్తే...."

కాంతం మనసు వుడికిపోయింది. తను ఒక బలి పశువుగా వున్నట్లనిపించింది. ఆపుకోలేని ఆవేశం పొంగివచ్చింది. గుమ్మం దాటి బయటికొచ్చింది.

"నేనింక పెళ్లి చూపులకు కూర్చోను" నిశ్చయంగా చెప్పింది.

"ఓసారి నీ ఆలోచన చెప్పేవు బాగుంది. అన్నిసార్లు అనకూడదమ్మా!" భానుమూర్తి వారించేడు.

"ఏమయినాసరే నేనుమాత్రం పెళ్లి చూపులకు కూర్చోను. నన్ను మీరేం చేసినా సరే!"

భానుమూర్తి ఓర్పు నశించింది. "ఏమిటీ అర్థంలేకుండా ఆ మంకుపట్టు! వయసుకుమించిన మాటలు మాట్లాడకు! నువ్వు చేసుకోనంటే అయిపోతుందేమిటి? గుండెలమీద కుంపటిలా ఎన్నాళ్లు ఇంట్లో కూర్చుంటామనుకున్నావ్!" భానుమూర్తి చికాగ్గా లోపలకు వెళ్లిపోయాడు.

మనసులో తుఫాను చెలరేగుతూంటే పైకిమాత్రం కదలిక లేకుండా అలాగే నిలబడింది కాంతం.

జగన్నాధం కాంతంవైపు పరిశీలనగా చూసేడు. ఆమెను అనునయించి సుముఖం చెయ్యడంకంటే మరోమార్గం లేదని తెలుసు. మెల్లగా దగ్గరకు వచ్చేడు. ప్రేమగా తల నిమిరేడు.

కాంతం కళ్లల్లోంచి బొట బొటా కన్నీళ్లు కారిపోయేయి.

"ఛీ ఛీ! ఇప్పుడేమయిందనమ్మా అంత దుఃఖం?"

"మామయ్యా!" జగన్నాధంమీద వాలి ఏడ్చేసింది కాంతం.

కన్నీళ్ళు తుడిచేడు జగన్నాధం.

"మా కాంతం మంచి అమ్మాయికదూ! నేను చెప్పినట్లు వింటుంది....కాంతం! అదుగో ఆ పొద్దుతిరుగుడు పువ్వు చూడు! ఎప్పుడూ సూర్యుణ్ణిబట్టే అది తిరుగుతూంటుందమ్మా! మన సాంప్రదాయాన్నిబట్టి ఆడపిల్ల చిన్నతనంలో తండ్రి సంరక్షణలో తండ్రి చెప్పినట్లూ, వయసొచ్చేక భర్త పాలనలో అతని మనసుకు నచ్చినట్లూ....వృద్ధాప్యంలో కొడుకుల పోషణలో వాళ్ళ ఇష్టప్రకారమూ నడచుకోవాలి. అలాకాకుంటే సమాజంలో ఎబ్బెట్టుగానూ ప్రకృతికి విరుద్ధంగానూ వుంటుంది. అందుకని నా మాటవిని ఈ సంబంధం చేసుకో! మన ప్రయత్నం ఏమీ అక్కర్లేకుండా దొరికింది. మనకు అన్నివిధాలా అనుకూలమైనది. కాదనకు మరి!....సరేనా?...."

కాంతం తలతిప్పి పొద్దుతిరుగుడు పువ్వువైపు చూసింది.

చిరుగాలికి అల్లల్లాడుతూ హృదయాన్ని విప్పి సూర్యుడువైపు చూస్తూంది ఆ పువ్వు.

కన్నీటి పొరలు తెరలై అడ్డునిలచేంతవరకు రెప్పవాల్చకుండా ఆ పువ్వునే చూస్తూ నిలబడింది కాంతం.

కాంతానికి భాస్కరంతో పెళ్ళయిపోయింది.

# 4

చేటలో బియ్యం పోసుకొని చెరుగుతూన్న కాంతం గదిలోకి ఎవరో వచ్చినట్లు అలికిడయి తలెత్తి అటుచూసింది. జీర్ణవస్త్రాలతో అస్థిపంజరంలా వున్న వృద్ధుడ్ని గుర్తుపట్టలేకపోయింది. "ఎవరది?" అంది.

పక్కకు తిరిగివున్న అతన్నుంచి జవాబు రాలేదు.

కాంతం చేట పక్కకుపెట్టి లేచివెళ్ళి దగ్గరగా చూసి నిశ్చేష్టురాలయిపోయింది.

"నాన్నా!" కాంతం తన కళ్ళను తానే నమ్మలేకపోయింది.

భానుమూర్తి నోట మాట రాలేదు.

ముఖం పీక్కుపోయివుంది. కళ్ళు గుంటలు పడ్డాయి. ఎప్పుడు తూలిపడిపోతాడో నన్నట్లు వున్నాడు.

"లోపలకు రా నాన్నా! ఇలా కూర్చో! ఏమిటి ఇంటి దగ్గర్నుంచేనా?" చెయ్యి పట్టుకొని మెల్లగా తీసుకొచ్చి మంచంవాల్చి భానుమూర్తిని మంచంమీద కూర్చోపెట్టింది కాంతం.

"నిన్ను చూసేదాకా ప్రాణం నిలుస్తుందనుకోలేదమ్మా!.... కొంచెం మంచినీళ్ళియ్యి" అన్నాడు భానుమూర్తి.

మాట నూతిలోంచి వచ్చినట్లు వస్తూంది.

కాంతం మంచినీళ్ళు తెచ్చింది. భానుమూర్తి నీళ్ళు తాగుతూంటే చిక్కి శల్యమైన అతని శరీరాన్నీ నీరసంతో వణికిపోతూన్న అతని చేతినీ మార్చి మార్చి చూసింది కాంతం. బాధతో కడుపులో దేవినట్లయింది.

"బొత్తిగా ఇలా అయిపోయేవేమిటి నాన్నా? ఒంట్లో బాగుండడం లేదా?"

"ఇంక ఒకటే బాగు! పోయేరోజు కాని వచ్చేరోజు కాదుగా! ఓపిక పూర్తిగా తగ్గిపోయిందమ్మా!....కడతేరే లోపల ఒక్కసారయినా నిన్ను చూడగలనో లేనోనని...."

"అవేం మాటలు నాన్నా! ఓ వుత్తరం ముక్కరాసి పారేస్తే

నేనే వచ్చేదానిగా!"

"తీరా రమ్మంటే అతనేమనుకుంటాడో!....అవునూ! అమ్మ పోయినప్పుడు నువ్వు రాలేదేమమ్మా?"

కాంతం బాధతో సిగ్గుతో తలవంచుకుంది.

"పోనీలేమ్మా! బాధపడకు. ఓ అయ్యచేతిలో పెట్టిన తర్వాత...." భానుమూర్తే అన్నాడు.

"నువ్వన్నదీ నిజమే నాన్నా! వెళ్ళాలి వెళ్ళాలి అన్న ఆరాటమే కాని వెళ్ళడానికి స్వతంత్రమేదీ!" కన్నీళ్ళతో అంది కాంతం.

"అమ్మ పోతూ పోతూ దాని ఒంటిమీద బంగారం పంచి ఈ గాజులు నీకిమ్మంది!" తనూ కన్నీళ్ళు పెడుతూ భానుమూర్తి చేతి సంచీలోంచి పొట్లం తీసి అందులోంచి గాజులు తీసి కాంతానికిచ్చేడు. కాంతం భోరుమంది.

"మీఅమ్మ పోయినప్పటినుంచి ఇల్లంతా బావురుమంటూంది. అటు పెళ్ళికి చేసిన అప్పు వడ్డీలకు వడ్డీలు పెరిగిపోయేయి. ఆ రెండు ఎకరాలూ ఇల్లూ అమ్మేసి నీ పెళ్ళికయిన ఋణం అంతా తీర్చేసేనమ్మా!"

"నాన్నా!"

"చివరికి అప్పు ఆస్తినంతా మింగేసిందమ్మా!"

"ఇల్లుకూడా అమ్మేసేవా? అదేమిటి నాన్నా! ఇల్లమ్మేసి పొలం అమ్మేసి ఇంక నీకు గడిచేదెలా నాన్నా?"

"ఏం చెయ్యమంటావమ్మా! ఇదమ్మితే కనీసం యిప్పటికి ఋణమయినా తీరింది. ఇప్పుడూ అమ్మకపోతే ఇంకో కొన్నాళ్ళకి వడ్డీలు పెరిగిపోయి ప్రాణంపోయినా ఋణం మిగిలిపోయేది."

"ఈ వయస్సులో ఆస్థిలేక, ఉండటానికి ఇల్లులేక, చూసే వాళ్ళు లేక...."

"దానికేముందిలే. నారు పోసినవాడు నీరు పొయ్యకపోతాడా! అదీకాక యెవరు చేసుకున్నది వాళ్ళు అనుభవించక తప్పుతుందామ్మా! నాక్కీ ముసలితనం ఇలా గడవాలని రాసిపెట్టివుంది కాబోలు!"

"ఇంత గడ్డుసమయంలో కూడా ఈ బంగారం అంతా మాకు పంచడం ఎందుకు నాన్నా? నువ్వే వుంచుకో!"

"వద్దమ్మా! అవి దాని ఒంటిమీద నగలు! అవి మీకు చేరితేకాని దాని ఆత్మ శాంతించదు."

"చివరకు యెటువంటి రోజు వచ్చిందో చూడు నాన్నా! అందుకే అన్నాన్నేను పెళ్ళిచేసుకోను ఇంకా చదువుకుంటానని! నాకే చదువు చెప్పిస్తే నిన్ను కడుపులో పెట్టుకొనేదాన్ని!"

"అదే చాలమ్మా! ఇంత చల్లటి మాటన్నావు. ఇంక నాకు కావలసిందేమిటి?"

"మా ఇంట్లో ఉండిపో నాన్నా! నే నాయనతో చెప్తాను."

"వద్దమ్మా! అల్లుడు ఇప్పటికే అతని అచ్చట్లు ముచ్చట్లు తీర్చలేదని కంటికి కనబడితే చాలు తోకతొక్కిన తాచులాలేస్తాడు.... నీ ఆపేక్ష కొద్దీ అలా అన్నావు కానీ అది జరిగేపని కాదు....ఏమిటో నమ్మా! అన్ని ఋణాల్నుంచీ విముక్తున్నయ్యేను కాని ఈ భూమ్మీద యింకే ఋణం మిగిలివుందో గాని ఈ ప్రాణంమాత్రం పోవటం లేదమ్మా!"

"నాన్నా!"

భానుమూర్తి ఉస్సురని నిట్టూర్చేడు. కాంతం కళ్ళు తుడుచుకుంది. కృంగిపోయిన తండ్రి దైన్యాన్ని చూడలేకపోయింది.

"లే నాన్నా! ఎప్పుడనగా భోంచేసేవేమో! కాస్త రెండు మెతుకులు తిని నడుం వాలుస్తే...." మెల్లగా తండ్రిని లేవతీసింది. భానుమూర్తి కాళ్ళూ చేతులూ కడుక్కొనివచ్చి పీటమీదకూర్చున్నాడు. కాంతం విస్తరి వేసి వడ్డించింది.

ఆకలి యెక్కువగా వుందేమో తొందరగా వణుకుతున్న చేతులతో ముద్ద నోట్లో పెట్టుకునేసరికి పలక మారింది. భానుమూర్తి దగ్గులో ఉక్కిరి బిక్కిరి అయిపోయేడు.

కాంతం ఛాతీపైన రాసింది.

భానుమూర్తి అలసిపోయేడు.

కాంతం చేత్తో ముద్ద తండ్రినోటికి అందించింది.

"అమ్మా కాంతం! నన్ను కన్నతల్లివమ్మా! ఈ దరిద్రుడికి నీలాంటి కూతురిని యెందుకిచ్చేదమ్మా!" భానుమూర్తి పసిపిల్ల వాడిలా భావురుమన్నాడు.

"ఊరుకో నాన్నా!" కాంతం తండ్రిని ఓదార్చింది.

చివరకు భానుమూర్తి ఎలాగో నాలుగు మెతుకులు కతికి లేచేడు.

కాంతం మంచం వాల్చింది.

"ఇలా కాస్త పడుకో నాన్నా! ప్రాణం కొంత కుదుటబడు తుంది" అంది. భానుమూర్తి పడుకున్నాడు.

సాయంత్రం అయిదు కాగానే భాస్కరం ఇంటికొచ్చేడు.

"ఇదేమిటి ఇంత తొందరగా వచ్చేరు?" అంది ఆశ్చర్యంగా కాంతం.

"ఏం? రాకూడదా!" భాస్కరం ఉత్సాహంగా కనబడ్డాడు.

"రాత్రి ఎనిమిదయ్యేదాకా ఇంటికొచ్చే అలవాటు లేదుకదా! వేళకాని వేళ వచ్చేస్తేను!"

"అబ్బబ్బ! ఈ పెళ్ళాలతో ఇదే చిక్కు! కాస్త ఆలస్యంగా ఇంటికి వస్తే సంసారం అక్కర్లేదు, పెళ్ళాం పిల్లలేమయ్యేరన్న ధ్యాసే లేదు అంటారు. అలా అని కాస్త తొందరగావస్తే యింత తొందరగా వచ్చేరేమిటి అంటారు. పొద్దున్ననుంచి సాయంత్రందాకా చాకిరీచేసి ఇంటికివస్తే ఓ చల్లటిమాట, ఓ తియ్యటి నవ్వు, ఓ కప్పు కాఫీ, మర్యాద మప్పిదం ఏమీ లేదుకదా!"

"అయ్యొయ్యొ! ఎంతమాటండి! ఇలా కూర్చోండి. కాఫీ తెస్తాను."

భాస్కరం కుర్చీలో కూర్చున్నాడు. కాంతం కాఫీ తీసుకొచ్చి యిచ్చింది.

"ఈరోజు ఓ గొప్ప విషయం జరిగింది" అన్నాడు కాఫీ తాగుతూ భాస్కరం.

"ఏమిటది?"

"మా శంకరాన్ని ఎరుగుదువా?"

"సరేలెండి! ఇప్పటిదాకా కొన్నివందలసార్లు చెప్పేఉంటారు"

"వాడు వచ్చేడు కాంతం! ఈ వూరొచ్చేడు. వాళ్ళ కంపెనీకి ఈ వూళ్ళో బ్రాంచి తెరవడాని కొచ్చేడు."

"వచ్చేం! బ్రాంచి తెరిచేక ఇక మీరసలు ఇంటికి రారేమో!" అంది నవ్వుతూ కాంతం.

"నీకు తెలీదు కాంతం! మేమిద్దరం కాలేజిలో చదివేటప్పుడు ఒకే బెంచిమీద కూర్చునేవాళ్ళం. కలలు కనేవాళ్ళం! ఒకే కలలు! పెద్ద బంగళాలో ఉంటూ పొడుగాటి కారులో తిరుగుతూ ఠీవిగా జీవితం గడపాలని. కలలన్నీ వాడి విషయంలో నిజమయ్యేయి. కాలేజీలో అన్నింటిలో నాకంటె వెనుకబడివుండేవాడు. కాని అదృష్టంలో మాత్రం చర్రున ముందుకు దూసుకుపోయాడు వాడు. వెనుకబడిపోయేను నేను.... కాని ఇడియట్ నన్ను మరచిపోలేదు. అంతస్థులో దూరాలు పెరిగినా ఆత్మీయత మాసిపోలేదు. వాడేమన్నాడో తెలుసా?"

"ఏమన్నాడు?" ఆత్రుతతో అడిగింది కాంతం.

"నువ్విలా వుంటే లాభంలేదురా! నీ జీవితం కొత్త మలుపు తిరగాలి! అన్నాడు."

"ఇంతకే ఇంత సంతోషమా! ఏదో సామెత చెప్పినట్లుంది" అంది కాంతం కాఫీ కప్పు అందుకుంటూ.

"మరచిపోయేను. అసలు విషయం ఏమిటంటే.... వాడు నాలుగురోజులు ఈ ఊళ్ళో వుంటాడు. రాత్రి మనింటికి భోజనానికి రమ్మని పిలిచేను.... నేను వెళ్ళి కాస్సేపు వాడితో కాలక్షేపం చేసి రాత్రి భోజనానికి తీసుకొస్తాను. అది చెప్పడానికే వచ్చేను."

"అలాగే! తీసుకు రండి."

భాస్కరం వెళ్ళబోతూంటే కాంతం ముందుకు వచ్చింది. "ఏమండి! ఒక్కమాటండి."

"ఏమిటది?"

"ఏమీ కోపగించుకోకుండా వింటారు కదూ!"

"విషయం చెప్పకుండా ముందుకాళ్ళకు బంధం వెయ్యకు."

అప్పుడే భాస్కరం ముఖంమీద విసుగు చోటుచేసుకుంది.

"అది కాదండి! మరి...." కాంతానికి మొదలుపెట్టడానికే భయంగా వుంది.

"మరి.........?"

"మన పెళ్ళికి మానాన్న పదివేలు అప్పుచేసేడు తెలుసుకదా"

భాస్కరానికి ఏదో వాసన తగిలినట్లుంది ముఖం సీరియస్‌గా మారిపోయింది. "అయితే?...."

"దానికి వడ్డీలకు వడ్డీలు పెరిగి చివరకు ఇల్లు పొలం అమ్మేయాల్సి వచ్చిందండి."

"అయితే ఏమిటి?" విసుగుదల పెరిగింది.

"మా నాన్న దిక్కులేనివాడయి పోయేడండి! ఎవరి పంచనో పడి బ్రతకాల్సిన రోజు వచ్చింది."

"అందుకు మనమేం చేస్తాం; ఆడపిల్లల్ని కన్నారు! తనస్థితికి తగిన సంబంధాలు చూసుకోకుండా పెద్ద పరుగులుపెట్టేడు మీ నాన్న. అప్పుచేసేడు. ఇప్పుడు తీర్చకుండా ఛస్తానంటే ఎవరొప్పుకుంటారు! అప్పులుచేసి ఆస్థులమ్ముకోవడం దేనికి? ఇప్పుడు చిప్ప పుచ్చుకుని వీధిలో నిలబడడం దేనికి?"

భాస్కరం మాటలు ఒక్కొక్కటే వింటూంటే కాంతం గుండెలో సూదులు గుచ్చుతున్నట్లుంది. అయినా సాధించవలసిన పని కోసం ముఖంమీద చిరునవ్వే ముద్రించుకు నిలబడింది. అయినా మాటలు వినలేక, "మీకు పుణ్యం వుంటుంది. అంత నిష్ఠూరంగా మాట్లాడకండి!" అంది.

"నేనేం మాట్లాడినా నిష్ఠూరం అవుతుంది. ఇప్పుడు నన్నేం చెయ్యమంటావు? పెళ్ళికి మీ నాన్న యిచ్చిన కట్నం తిరిగి ఇచ్చేసి ఆ పొలం ఇల్లు మీ నాన్నకి మళ్ళీ అప్పచెప్పమంటావా?"

"చాల్లెండి! ఎవరైనా వింటే నవ్వుతారు! ఒక్క నిముషం నేను చెప్పేది ఓపిగ్గా వినండి."

విసుగ్గా ఏమిటన్నట్లు చూశాడు.

"మనం కొన్నాళ్ళు మా నాన్నని మన దగ్గర వుంచుకుందా

మండి!"

"నువ్వింందాకటినుంచి మురిపించి బులిపించి ఇంత హడావిడి చేసింది దీనికా! అది భ_స్తే జరగదు. మీ నాన్న మనకేం చేసేదని యిప్పుడు నేను జాలి తలవాలి! నా జీతం యింకో మనిషిని పోషింవ డానికి సరిపోదు!"

"ఆయన పాపం చాలా యిబ్బందిలో వున్నాడండి! ఇప్పటి దాకా యిన్నేళ్ళూ మిమ్మల్ని నాకోసం యేదీ అడగలేదండి! కా_స్త కష్టంలో వున్నవాళ్ళని అయినవాళ్ళని ఆదుకోవడం మన ధర్మం కదండీ!.... ఏమండీ! నాలుగురోజుల క్రితం చెప్పేను గు_ర్తుందా! ఇంటి ప్రక్కనున్నావిడ వీధి చివరి ఎలిమెంటరీ స్కూల్లో టీచరు వుద్యోగం ఖాళీ వుందనీ కావలి_స్తే యిప్పిస్తాననందనీ! డబ్బు సరిపోక పోతే పోనీ నే నా ఉద్యోగం చేస్తానండీ!"

"నువ్వుద్యోగం చెయ్యటం ఏమిటి! నేను చచ్చేననుకున్నావా? నా పెళ్ళాంచేత ఉద్యోగంచేయించడానికి నేను చచ్చినా ఒప్పుకోను."

"అవసరం వచ్చినప్పుడు చే_స్తే తప్పేముందండి!"

"నా కుపన్యాసాలు వద్దు. నీ కాయన కన్నతండ్రయితే నేను కట్టుకున్న మొగుణ్ణి! నీకు కన్నతండ్రే ఎక్కువనుకుంటే ఇక్కణ్ణుంచి పో! శుభ్రంగా ఉద్యోగం చేసుకొని నీ కన్నతండ్రికి తినిపిస్తూ హాయిగా వుండు! లేకపోతే నేను చచ్చేక నువ్వా పని చెయ్యాలి. అంతే!"

"మీకు దండంపెడతాను. అంతమాటనకండి. ఏదో ఉండ బట్టలేక అడిగేను! దానికింత రాద్ధాంతం దేనికి!....మానాన్న ఇందా కనే వచ్చేడు. నిద్రపోతున్నాడు. వింటే బాధపడతాడు."

"అయితే సరాసరి ఉండిపోడానికే వచ్చేసేదేమిటి! ఛ! కా_స్త యినా సిగ్గులేదు."

భానుమూ_ర్తి నిద్ర ఎప్పుడోపోయింది. అల్లుడిమాటలు విన లేక పోతున్నాడు. ఉండలేక గదిలోంచి వచ్చేడు. "పిల్లనిచ్చు కున్నాక ఇంకా సిగ్గుంచుకుంటే ఎలా నాయనా? అయినా నే నిక్కడ ఉండిపోడానికి రాలేదు."

"నాన్నా!" కాంతం తండ్రి దగ్గర కెళ్లింది.

"అయితే ఎందుకొచ్చేరండీ?" భాస్కరం మీదికిరాబోయేడు.

"నువ్వు లోపలకు వెళ్లు నాన్నా!" భర్తనాలుక పదునుబాగా తెలిసిన కాంతం తండ్రిని బలవంతాన లోపలకు నెట్టింది.

"తననోటితో అడగడానికి ముఖం చెల్లక కూతుర్నిముందుకు తోపి...." భాస్కరం ఆపలేదు.

"ఏమిటండీ మీరు మరీనూ! ఇంతయినా మర్యాదలేకుండా పుల్లవిరిచినట్లు ఆ మాటలు!....నేను దైవసాక్షిగా చెపుతున్నాను. ఆయన ఇక్కడ వుండడానికి రాలేదు. ఆయన పరిస్థితి తెలిసి నేనే అడిగేను. మనసువిప్పి కాళ్ళావేళ్ళాపడి అడిగినందుకు మంచి బహూమానం ఇచ్చేరు!"

"నోర్ముయ్! నాకు నువ్వేం సర్టిఫికేట్ ఇయ్యక్కర్లేదు. ఇప్పటికి పదిసార్లు చెప్పడం అయింది! మీ నాన్నకు సిగ్గులేదూ నా గడప తొక్కడానికి!...."

కాంతం ఇంక పట్టలేకపోయింది. "ఆహా, మీరే సిగ్గున్న వాళ్లు! మీకక్ష తీర్చుకునేటందుకు నన్ను కట్టుకున్నప్పటినుంచీ ఏవో కారణాలు వెదుకుతూనే వున్నారు! మీరు అత్తారిసొమ్ముతో ఎం. ఏ. చేసి మంచి ఉద్యోగం చేసుకొని పదిచేతుల్తో తింటారు? ఆనాడే మీకు ఎకరం అమ్మియిచ్చేస్తే ఇన్నాళ్ళూ వాళ్ళేం తినాలి! వాళ్ళ అప్పులెలా తీరాలి!...."

"నోర్ముయ్! వ్యవహారం ముదురుతోంది?"

"అవును. అన్నింటికీ నోరు మూసుకూర్చుంటేనే యిలా అయింది. ఆ నాటినుంచీ చూస్తున్నాను. పండక్కి తీసుకెళ్లి వులెన్ సూటు పెట్టలేదనో, అలకపాన్పుమీద ఇస్తానన్న రేడియో యివ్వలేదనో నన్ను దెప్పుతూనే వున్నారు. మా అమ్మకు ప్రాణంమీద కొచ్చింది, పోయి చూసొస్తానండీ అంటే మీకు వులెన్‌సూట్లూ, రేడియోలే గుర్తుకొచ్చేయికానీ చావుబ్రతుకుల్లో గిలగిల్లాడుతూన మా అమ్మకనబడలేదు...."

"ఇంకా ఇలాపేలేవంటే చెంపలు వాచిపోతాయి జాగ్రత్త!"

"మీరు నన్ను చంపేసినా నా బాధ తగ్గదు. మీకంటే అడవిలో పెద్దపులి నయం!"

"అవునే! నేను పెద్దపులికంటే క్రూరమయిన వాడినే!"

కాంతం చెంప ఛెళ్లుమంది. "ఎక్కువ తక్కువలు మాట్లాడేవంటే ప్రాణం తీసేస్తాను." అక్కడికి సమస్య పరిష్కారం అయిపోయినట్లుగా భాస్కరం బయటకు వెళ్ళబోయాడు.

కాంతం దుఃఖావేశంలో తండ్రి తీసుకొచ్చిన గాజులు తీసుకొని భాస్కరం ముందుకొచ్చింది.

"ఆగండి! ఇవిగో ఇవి చూడండి! అలా మా అమ్మపోయినప్పటినుండి ఆవిడ ఒంటిమీద బంగారం ఏంచేసింది! నువ్వు కూతురివన్న విషయం మరచిపోయారా! ఎంత పొగరూ! అంటూ సాధించేరు. ఆవిడ శవంమీది బంగారం ఒలిచి ముగ్గురికి పంచి ముద్దుల కూతుర్నికదా అని నాకివి ఇవ్వడానికి వచ్చేడండీ మానాన్న! అంతేకాని చావుకూడుకు మొహం వాచిన మనయింటిలో నిలవుండిపోవడానికి రాలేదండీ!" కాంతంమాటలు పూర్తికాకుండానే భాస్కరం వెళ్ళిపోయాడు.

కూతురు దుఃఖాన్ని చూడలేక తన పరిస్థితికి తానే సిగ్గుపడుతూ భానుమూర్తి వచ్చి ఓదార్పుగా కాంతం భుజంమీద చెయ్యివేసేడు.

"నాన్నా!" అని కాంతం తండ్రిమీద పడి భోరున ఏడ్చేసింది.

"ఏడవకమ్మా! భూమ్మీద నూకలున్నాళ్లు ప్రాణం ఎలాగూ వుంటుంది. అది లేనప్పుడు నువ్వు పెట్టాలన్నా నేను తినగలనా!.... ఏదో చిత్తచాంచల్యంతో వచ్చేనే కాని....పుట్టిపెరిగిన ఊరూ.... ఆ చెట్టూచేమా మధ్య ఆకాశంలోకి చూస్తూ ప్రాణం కడతేరితే అంతకంటే కావలసిందేముంది! బాధపడకమ్మా! ఎవరెంత పెట్టిపుట్టారో అంతే దొరుకుతుంది. నీలాంటి గుండెనిండా అమృతం నింపుకున్న కూతుర్ని ఆ దేవుడు నా కిచ్చాడు. నాకింతకంటే ఏం కావాలి?...."

"ఏం లాభం నాన్నా! ఇంత చేతకాని స్థితిలో వుండి నాలాంటి వాళ్ల బ్రతికీ ప్రయోజనం ఏమిటి నాన్నా!"

"అంత మాటనకు తల్లీ! నే వినలేను" అన్నాడు భానుమూర్తి.

అప్పుడే స్కూలు నుంచి వచ్చిన కాంతం సవతికొడుకు సూర్యం భానుమూర్తిని చూసి ఆగిపోయాడు.

"ఏం నాయనా సూర్యం! బాగా చదువుకుంటున్నావా?"

సూర్యం భానుమూర్తిని గుర్తుపట్టలేదు.

"దగ్గరగా వెళ్లు సూర్యం! తాతయ్యే!" కాంతం నీళ్ళు తుడుచుకుంటూ చెప్పింది.

"రా నాయనా! ఇదివరకు వచ్చినప్పుడల్లా ఏ పండో బిస్కెట్లో తెచ్చేవాడిని. ఈవేళ వట్టిచేతుల్తో వచ్చేను."

భానుమూర్తి సూర్యాన్ని దగ్గరకు తీసుకొని ముద్దుపెట్టుకున్నాడు. "ఇంక నేను వస్తానమ్మా!"

"పోనీ రెండురోజులుండి వెళ్లు అనడానికి కూడా నోరు రావటంలేదు నాన్నా!"

"వద్దమ్మా! అతను వచ్చేటప్పటికి నేను వెళ్ళడం మంచిది! నిన్ను చూడాలనుకున్నాను. చూసేను. అంతే చాలు.

"నిన్నిలా సాగనంపుతున్నాను. ఈ పాపిష్టిదాన్ని మన్నించు" గుడ్లనీళ్లు కుక్కుకుంది కాంతం.

"కంట తడిపెట్టకు! నీ మనసు నాకు తెలుసు! ఆ దేవుడు నిన్ను చల్లగా చూస్తాడు. వస్తాను! వెళ్ళొస్తాను సూర్యం!"

భానుమూర్తి వెళ్ళిపోయేడు.

## 5

శంకరం ఆ వూరు వచ్చినప్పటినుంచి భాస్కరం ఇంటిపట్టున వుండడమే కరువైపోయింది. వస్తే ఏదో భోజనం పైముకు వచ్చి రెండుమెతుకులు కతికి వెళ్ళడం లేకపోతే రాత్రి బాగా పొద్దుపోయి వచ్చి పడుకోవడం. ఒక్కొరోజు రాత్రి ఇంటికి రానేవచ్చేవాడుకాదు. మర్నాడు కాంతం అడిగితే ఏదో కబుర్ల ధోరణిలో ఆలస్యమయిపోతే వాళ్లింట్లో భోంచేసి అక్కడే వుండిపొమ్మని శంకరం బలవంతంచేసేడు వుండిపోయేను అనేవాడు. కాంతానికి ఇవి నచ్చేవికాదు. కాని ఆమాట పైకిచెప్పినా చీవాట్లు తినడంతప్ప ప్రయోజనంలేదని తెలుసు. అందుకే ఎప్పుడు చెప్పలేదు. భాస్కరం

కోసం ఎదురుచూపి చూపి ఒక్కొక్కప్పుడు ఆకలి తప్పిపోయి తను తినకుండానే పడుకొనేది:

ఆ రోజు సూర్యం పుట్టినరోజు. స్కూలునుంచి రాగానే గుడికి తీసుకొని వెడుతూంటే శంకరంతో భాస్కరం ఇంటికి వచ్చేడు. గొళ్ళెంవేసిన తలుపుతీసి గుడికి వెళ్ళివస్తానని చెప్పి భాస్కరంతో చెప్పి వెళ్లింది కాంతం.

తిరిగి వచ్చేసరికి స్నేహితులిద్దరూ ముందుగదిలో కూర్చొని పకోడీలు తింటున్నారు. పక్కనే రెండు గ్లాసుల్లో అప్పుడే ఏదో ఎర్రనిద్రవం పోస్తున్నాడు. కాంతం గుండె వేగంగా కొట్టుకోవడం మొదలుపెట్టింది. తలవంచుకొని నేరుగా వంటింట్లోకి వెళ్లిపోయింది.

"....నీ జీవితంలో ఒక్క సంవత్సరం నాకియ్యి! ఆ తర్వాత ఎలాంటి మార్పువస్తుందో చూసుకో!....కమాన్! హేవిట్!" అని తన చేతిలో ఒక గ్లాసు తీసుకొని రెండోదానికి తగిలించేడు శంకరం.

సంభాషణ వింటూంటే కాంతానికి భయంవేసింది.

"ఏమండీ! ఓసారిలా వస్తారూ!"

భాస్కరం వంటింట్లోకి వచ్చేడు.

"ఆ గ్లాసుల్లో ఏమిటండీ అది! తాగుడా!" మెల్లగా ఆదుర్దాగా అడిగింది కాంతం.

"దాంతో నీకేమిటి?" భాస్కరం కనుబొమలు ముడిచేడు.

"మీరు తాగొద్దండీ!" ప్రాధేయపడింది.

"నేను ఏం చెయ్యవచ్చునో చెయ్యకూడదో నాకు బాగా తెలుసు! నీతులు చెప్పడానికి ప్రయత్నించకు!" భాస్కరం వెళ్ళి పోయాడు.

సూర్యం గ్లాసులకేసి వింతగా చూస్తున్నాడు.

"నీకు అన్నంపెడతాను రా!" అని కాంతం సూర్యాన్ని లోపలకు తీసుకొనిపోయింది.

సూర్యానికి అన్నం పెడుతూన్నా పక్కగదిలోంచి చెవుల్లో పడుతూన్న సంభాషణలమీదనుంచి కాంతం దృష్టి మరల్చలేక పోతూంది.

"....ఇది అన్ని అంతస్థులను కలిపే వంతెనరా! ఒకళ్ళ హోదాకు మనం పోవాలన్నా వాళ్ళను మనదగ్గరకు పిలవాలన్నా ఇది తప్పదు. నీ లైఫ్‌లో తిరగబోయే మలుపుకు ఇది ఫస్ట్ స్టెప్? కమాన్!...." శంకరం కంఠం.

"మైగాడ్!" భాస్కరం కంఠం. రుచి చూసినట్లున్నాడు.

"నథింగ్! డోంట్ ఎగ్జాజరేట్! ఓ పకోడీ నములు! దానిమీద ఓ సిప్ తీసుకో!....రెండు పెగ్స్ గొంతులోకి దిగిన తర్వాత దీని ముందు ఏ భేదాలూలేవు. అప్పుడే నీ ప్లాన్స్ అమలుజరపడం మొదలుపెట్టాలి! కాదనేవాడే వుండడు...."

సూర్యం అన్నంతిని నిద్రపోయేడు.

భాస్కరం వంటింట్లోకి రానేలేదు. శంకరం మాటలు విన్న తర్వాత కాంతం మనసులో దిగులు గూడు కట్టుకుపోయింది. అలా ఎంతసేపు కూర్చుందో తనకే తెలియదు.

పక్కగదిలో సంభాషణ ఆగిపోయింది.

పదినిముషాల తర్వాత కాంతం లేచిచూసింది. భాస్కరం కుర్చీలో వాలిపోయి కూర్చున్నాడు. తల సరిగా నిలబడలేదు. ఏదో గొణుగుతున్నాడు.

శంకరం ఓ చేతిలో సిగరెట్టు మరోచేతిలో గ్లాసూ పట్టుకొని వున్నాడు.

ఆ స్థితుల్లో భాస్కరాన్ని చూడగానే కాంతానికి ఎక్కడలేని భయం పుట్టుకొచ్చింది. కాంతం తాగినవాళ్ళనెప్పుడూ చూడలేదు.

"ఏమండీ!" అంటూ ఒక్క అడుగులో ముందుకొచ్చి భాస్కరాన్ని కదిపింది.

భాస్కరం లేవబోయాడు కాని సాధ్యం కాలేదు.

కాంతానికి పెద్దగా ఏడుపొచ్చేసింది.

"ఏమిటండీ ఇది! నిక్షేపంలాంటి మనిషిని తప్పతాగించి ఒంటిమీద స్పృహలేకుండా చేసేరు!...." అంది ఏడుస్తూ.

"గాభరా పడకండి! నేనున్నాగా! తెల్లారేసరికి మామూలుగానే వుంటాడు."

"మీరిక్కడ వుండటానికి వీల్లేదు. వెంటనే వెళ్ళిపొండి."

"మీరు భయపడుతున్నారు! ఏం ఫరవాలేదు...."

"ఏమయినా సరే! మీరు వెంటనే వెళ్లిపొండి!...."

శంకరం చేసేదిలేక లేచి కొంచెం తూలుతూ బయటకు వెళ్ళిపోయేడు.

కాంతం కళ్ళు తుడుచుకొని భాస్కరాన్ని తీసుకెళ్లి మంచం మీద పడుకోబెట్టింది. భాస్కరం గుర్రుపెట్టి నిద్రపోయేడు.

కాంతం కళ్లల్లో కారం పెట్టుకున్నట్లు రాత్రంతా కన్ను మూయకుండానే తెల్లవార్చింది.

మర్నాడు భాస్కరం లేస్తూనే "శంకరం ఎక్కడ?" అని అడిగేడు.

"రాత్రే వెళ్ళిపోయాడు" అంది కాంతం.

"ఎప్పుడు?"

"మీ చేత ఒళ్ళుతెలియకుండా తాగించిన తర్వాత! నేనే పొమ్మన్నాను."

"నీకేమయినా మతిపోయిందా!"

"మీరు కూడా ఏమిటండీ మంచీచెడూ లేకుండా! స్నేహం స్నేహం అంటూ ఎక్కడలేని పాడు అలవాట్లూ చేసుకొని...." కాంతం మనసులో అయిష్టత దాచుకోలేకపోయింది.

"చేసిన వెధవపన్లు చాలక అనవసరం మాటలు మాట్లాడితే పళ్ళు రాలకొడతాను....ఇప్పుడు వెళ్లి వాడి కాళ్ళమీద పడాలి...." భాస్కరం ముఖం కూడా కడుక్కోకుండా బట్టలు వేసుకున్నాడు.

"ఆయనతో మీకు స్నేహం వద్దండీ!"

"షటప్! వాడు నన్ను అందలం ఎక్కించాలనుకుంటూంటే."

"అన్ని విధాల పతనమయ్యే ఆ అందలాలు మనకొద్దండీ!"

"నా యిష్టం వచ్చినట్లు చేస్తాను. నువ్వెవత్తెవు నాకు చెప్పడానికి!" భాస్కరం అప్పుడే ఓ అడుగు బయటకు వేసేడు.

"నేను మీ భార్యనండీ!"

"అందుకే కుక్కినపేనులా పడుండు!" భాస్కరం వెళ్లి

పోయేడు.

కాంతం భగ్గున మండుతూన్న కళ్ళను మూసుకొని నీరసంగా నిట్టూర్చింది.

## 6

ఏడాది తిరిగేసరికల్లా నిజంగానే భాస్కరం జీవితంలో మలుపు తిరిగింది. శంకరం మాట ఇచ్చినట్లుగానే మలుపు తిప్పేసేడు.

భాస్కరంచేసే వుద్యోగం మానేసేడు. శంకరానికి వ్యాపారంలో కుడిభుజమయ్యేడు.

దొంగ వ్యాపారం చెయ్యడంలో మెలకువలన్నీ తెలుసుకొని గురువునుమించిన శిష్యుడయ్యేడు.

అద్దెకొంప వదిలి టౌనులో పెద్ద మండువాలోగిలి కొన్నాడు. ఇల్లంతా సామాన్లతో నింపేడు.

అతని వ్యాపారానికి అంతస్థులను కలిపేవంతెన అని శంకరం పరిచయంచేసిన తాగుడును పూర్తిగా స్వంతం చేసుకున్నాడు.

కాంతం కుక్కిన పేనులా పడివుండడంకంటె ఏమీ చెయ్యలేక పోయింది. మామూలుగానే తనమాట నేనాడూ లెక్కచెయ్యని భర్త నిషాలో ఆమెను పెట్టే హింసకు అంతులేకుండా వుంది.

కొత్తలో భాస్కరం పరస్త్రీ వ్యామోహం కాంతం అహం మీద పెద్ద దెబ్బకొట్టినా రాను రాను అతన్ని తాను ప్రత్యేకంగా అభిమానించకపోవడంవలన దాన్ని గర్హించి అతని తాగుడును భరించినట్లుగానే దాన్నీ భరించేది.

ఒకరోజు జగన్నాధం కొడుకు గోవిందు వచ్చేడు. "ఇక్కడికి వస్తూన్నానని తెలిసి మానాన్న తప్పకుండా నిన్నోసారి చూసి రమ్మన్నాడు" అన్నాడు గోవిందు.

తండ్రితరవాత తండ్రి అంత అభిమానిస్తుంది కాంతం జగన్నాధాన్ని. గోవిందుని చూడగానే అతన్ని చూసినంత సంబరపడింది కాంతం.

టిఫినుతిని, కాఫీ తాగేదాకా వెళ్ళడానికి వీల్లేదని బలవంతం చేసింది కాంతం.

ఓసారి కాంతం భర్తను కూడా కలిసి వెడితే మర్యాదగా వుంటుందని ఆగేడు గోవిందు.

కాంతం వంటింట్లో టిఫన్ చేస్తూంటే గోవిందు వసారాలో నాలుగు గోడలమీద వరుసగా ఫ్రేము కట్టించిపెట్టిన చిత్రాలను వరుసగా చూస్తూన్నాడు.

అప్పుడే ఇంట్లోకివచ్చి తనగదిలోకివెళ్ళి పడుకున్న భాస్కరాన్ని గోవిందూ గమనించలేదు. కాంతం చూడలేదు.

తరువాత కాంతం గోవిందుకు టిఫిన్ తెచ్చిపెట్టింది. గోవిందు టిఫిన్ తింటూంటే ఇద్దరూ కలసి చదువుకొన్న చిన్ననాటి రోజులు గుర్తుకు తెచ్చుకున్నారు. అనాటి ముచ్చటలు మనసారా మననం చేసుకున్నారు. తరువాత యెంతసేపయినా భాస్కరం వచ్చేజాడ కనిపించక పోయేసరికి ట్రెయిన్ టైమయిపోతూందని వెళ్ళిపోయేడు గోవిందు.

అతన్ని బయటకు సాగనంపి కాంతం లోపలకు వస్తూ తన గదిలోంచి బయటకు వస్తూ భర్తను చూసి ఆశ్చర్యపోయింది.

"అరె! మీరు ఇంట్లోనే వున్నారా! అతను మీకోసం ఇప్పటిదాకా చూసి చూసి యిప్పుడే వెళ్ళేడు."

"ఎవడు వాడు?" భాస్కరం కళ్ళు చింతనిప్పులా యెర్రగా వున్నాయి. ఇంతసేపూ అతను గదిలో కూర్చుని చేసిన పని అర్థమయింది కాంతానికి.

"మా జగన్నాధం మామయ్య కొడుకు. గోవిందు, ఈ ఊరు వచ్చి...."

"నిన్ను చూసిపోదామని వచ్చేడా? ఏమిటి వాడికీ నీకూ సంబంధం?"

కాంతానికి భర్త మాటలు వింటూంటే అసహ్యం పుట్టింది.

"ఏమిటండీ ఆ మాటలు! ఎవరైనా విన్నాకూడా బాగుండదు."

"చిన్ననాటి సరసాలన్నీ గుర్తుచేసుకోడానికి బాగున్నాయా! అందుకే చక్కగా ప్రేమతో టిఫినూ కాఫీచేసి ఇచ్చేవు! దగ్గర కూర్చుని కొసరి కొసరి తినిపించి తాగించేవు!"

"తీరికగా కూర్చొని ఏమిటండీ ఈ లేనిపోని మాటలు!"

"ఇందులో ఏది లేని మాట?"

"మీ మాటల వెనకాల మీ మనసులోవున్న నీచమైన ఆలోచన."

"నోర్ముయ్! చేసే వెధవపనులు చాలక ఇంకా సమర్థించుకోకోవడం కూడాను!"

"ఛీ ఛీ! ఏంమనుషులండీ మీరు! ఎలా చెప్పాలి మీకు!"

"అవును! ఎలా చెప్పాలి నాకు! ఎలా చెప్పగలవు నాకు! అందులో కట్టుకున్న మొగుడితో...."

"ఇదిగో; ఇలా అనవసరమైన మాటలు మాట్లాడితే మ్రాతం నే నూరుకోను."

"ఊరుకోకపోతే ఉరేట్టుకో!"

"అవును! ఉరే పెట్టుకోవాలి! మీతో రోజు రోజుకూ అన్నింటికీ ముప్పుగానేవుంది! ఇంటికి వచ్చినవాళ్ళతో మాట్లాడకపోతే ఒక తప్పు! మాట్లాడితే ఒకతప్పు! ప్రాణాలు తీసేస్తున్నారు!"

"పిచ్చి పిచ్చి వేషాలేస్తే నిజంగానే ప్రాణాలు తీసేస్తాను."

"మీరేమన్నా అనండి! తిట్టేరు పడ్డాను! కొట్టేరు పడ్డాను! ఇటువంటి పరువు తక్కువ మాటలంటే మాత్రం పడలేను. రోజూ ఒంటిమీద స్పృహలేకుండా తాగొచ్చి...."

"షటప్!" కాంతం చెంప ఛెళ్ళుమంది. కాంతం కళ్లల్లోంచి జలజలా కన్నీళ్ళు జారిపోయాయి.

"కొట్టండి! చంపెయ్యండి! మీతో బ్రతికిమాత్రం నేను బావుకున్నదేముంది! కన్నతల్లి ప్రాణం పోతూందంటే కంటితో చూడనియ్యలేదు. జన్మనిచ్చిన తండ్రి కడుపు చేత్తో పట్టుకొనివస్తే శత్రువును తరిమినట్లు తరిమికొట్టేరు. ఆయన చచ్చిపోయినప్పుడు కనీసం చావు కబురైనా తెలియనియ్యలేదు.

మీ యిష్టం వచ్చినట్లు జల్సాచేసేరు. అర్ధరాత్రీ అపరాత్రీ లేకుండా అడ్డమయిన వాళ్ళనూ ఇంటికి తీసుకొచ్చేరు. ఎక్కడలేని చాకిరీ చేయించేరు! ఇన్నిచేసి పరాయి మగాడితో కాస్సేపు భార్య

ఒంటరిగా మాట్లాడితే గంగ వెర్రులెత్తిపోయి ఏం సంస్కారం అండీ మీది! అలా చూసేస్తారేం! కొట్టండి! చంపండి! నాకు చావాలనేవుంది!" జుట్టు పట్టుకున్న భాస్కరం కళ్ళల్లోకి చూసి అరిచింది కాంతం.

# 7

"....కాని చావలేదమ్మా! బ్రతికే వున్నాను! జీవచ్ఛవంలా జానిస బ్రతుకు బ్రతుకుతూ వున్నాను! సంపద పెరిగినా సంతృప్తి పెరగలేదు! సూర్యం మాత్రం తండ్రి అడుగుజాడల్లోనే పెరుగు తున్నాడు! ఇంత చిన్న వయసులోనే తండ్రి అలవాట్లన్నీ పుణికి పుచ్చుకొని తండ్రికి మించిన కొడుకనిపించుకుంటున్నాడు!

మనసుని చంపుకొని బ్రతుకంతా చీకటనే నిన్నే ఓ ఆశాకిర ణంగా చూసుకొని బ్రతుకుతున్నానమ్మా!....కాని ఇప్పుడు నీ ఆశలు తెలిసిన తర్వాత నాన్న స్వభావం తెలిసి....నాకు చాలా భయంగా వుందమ్మా! ఏం జరుగుతుందోనని బెంగగా వుందమ్మా! ఈ పొద్దు తిరుగుడు పువ్వులాంటి ఆడదాని జీవితానికి స్వేచ్ఛ ఎక్కడుంది? సుఖం ఎక్కడుంది? పొద్దుతిరిగినవైపు తలవంచడం తప్ప ఈ జీవి తానికి గమ్యం ఏముంటుందమ్మా?"

తల్లి కథ వినేసరికి సరోజ కళ్ళనిండా నీళ్ళు నిండిపోయేయి. ఆమె గొంతులోని నిరాశ నిస్పృహ గుండెను చీల్చేస్తూంది. సరోజ తల్లి కన్నీళ్ళు తుడిచింది.

"నువ్వన్నది నిజమే కావచ్చునమ్మా! ఆడదాని జీవితం పొద్దుతిరుగుడు పువ్వులాంటిదే కావచ్చు! కాని మగవాడు సూర్యు డంత తేజస్వీ పవిత్రుడూ అయితే ఆడది పొద్దుతిరుగుడు పువ్వయినా అది మంచిదే! సూర్యుడికీ ఆ పువ్వుకీ వుండే బంధం ఒక నిరంకుశ మైన శాసనం కాదమ్మా! అది ఒక పవిత్రమైన అనురాగబంధం! స్నేహబంధం! అంతేకాని మగవాడు నీతిలేనివాడయి ఆడది తనకు లొంకువగానే వుండాలనుకోవడం స్వార్థం, అహంకారం అవుతుం దమ్మా!" అంది సరోజ వుద్రేకంతో.

"కాని నీ ఆలోచనలను పాటించే దెవరమ్మా!" అంది

నీరసంగా కాంతం.

"అవసరమైన వారందరూ పాటిస్తారమ్మా! అది నేను ఋజువు చేస్తానమ్మా!" అంది సరోజ ఆవేశంతో.

తల్లీ కూతుళ్ళు తోటలోంచి లేచి వచ్చేసరికి రవి ఇంకా తిరిగి రాలేదు.

వీధిలో రిక్షా ఆగడంచూసి సరోజ వీధి గుమ్మంవైపు వచ్చింది.

రిక్షా దిగుతూనే "ఏమే!" అంటూ పెద్దగా అరుస్తూ లోపలకు వస్తున్నాడు భాస్కరం.

"నాన్నా!" అంట్లూ సరోజ ముందుకొచ్చింది.

"వచ్చేవామ్మా! నువ్వు వచ్చేవా లేదా అనే ఖంగారు పడి పోతున్నాను...." అంటూ ఇంట్లోకి వచ్చేడు. సరోజ వెనకాలే వెళ్ళింది.

"వంట్లో బాగులేదని టెలిగ్రాం ఇచ్చేరు! ఎలావుంది నాన్నా!" తెలిసికూడా అడిగింది సరోజ.

"నాకేమమ్మా! నిక్షేపరాయుడిలా వున్నాను. ఓసారి చూడా లనిపించి మామూలుగా రాస్తే వస్తావో రావోనని....అదిసరేగాని అమ్మాయ్! వాళ్లు వచ్చేస్తున్నారు మరో అరగంటలో! వీళ్ళింటికీ వాళ్లింటికీ అంటూ ఎక్కడికీ వెళ్ళక ఇంట్లోనే వుండు...."

"ఏమిటి నాన్నా? మీరు చెప్పేది అర్థంకావటంలేదు. ఎందు కొస్తున్నారు వాళ్ళు?"

"నిన్ను చూడ్డానికి...."

"నన్ను చూడ్డానికా!....అంటే...."

"అవునమ్మా! పెళ్ళిచూపుల కొస్తున్నారు. నా ఫ్రెండ్ శేషారావు లేడూ! వీళ్ళది వాళ్ళయింటిదగ్గరే. వాడు చెప్పేడుట మనల్నిగురించి...."

అప్పుడే అక్కడికి వచ్చిన కాంతం అయోమయస్థితిలో పడి పోయింది.

"పోనీ ఆ పెళ్లిచూపులేవో ఓసారి దానితో మాట్లాడి ఏర్పాటు

చేస్తే....” వీలయినంతవరకు రాబోయే ప్రమాదాన్ని తప్పించాలనే తపనతో అంది కాంతం.

“నువ్వు నోరుమూసుకు లోపలకు తగులడు!....వచ్చేవాళ్ళ కేమయినా కాస్త టిఫిను, కాఫీలకు ఏర్పాట్లుచెయ్యి!....” కస్సు మన్నాడు భాస్కరం.

“వచ్చేస్తున్నారా?” నిర్ఘాంతపోయింది కాంతం.

ఆందోళన చెందిన తల్లిముఖం చూసి ఊరుకోమని సైగ చేసింది సరోజ. గుండె దడదడ లాడుతూంటే లోపలకు వెళ్ళి పోయింది కాంతం. సరోజకు కూడా తండ్రితో ఎలా మాట్లాడాలో అర్థంకాలేదు. కాని ఏదోవిధంగా విషయం చెప్పక తప్పదు.

“మీరు తొందర పడ్డారునాన్నా! ఇప్పుడే పెళ్ళిచూపులు వద్దు” నిబ్బరంగానే అంది.

“అదేమిటి?” భాస్కరం వులిక్కిపడ్డాడు.

“నా కిష్టంలేదు.”

“అసలు వాళ్ళువచ్చి వెళ్ళకుండా అదెలా చెప్పగలం! రానీ!”

“అప్పటిదాకా కూడా అనవసరం. ఇప్పుడేమీవద్దు నాన్నా!”

“వాళ్ళీపాటికి వచ్చేస్తూంటారు. కాస్తవెళ్ళి మంచి బట్టలు కట్టుకోవి....” సరోజ మాటలు లెక్కచెయ్యకుండా అన్నాడు భాస్కరం.

“ఏమిటినాన్నా మీరుచెప్తే వినిపించుకోకుండానూ! అయినా ఈ తొందరేమిటి ఓమాట చెప్పడానికైనా వీలులేకుండానూ!....”

“ఓమూల వాళ్ళొచ్చేస్తూంటే ఏమిటమ్మా యీ మాటలు! కొంచెం ఆలోచించు....వెళ్ళి చెప్పినట్లు విను!”

సరోజ ఆలోచించింది. తనతో రవి వచ్చినట్లుగాని, తన మనసులో మాటగాని తండ్రికి తెలియదు. ఆయన కొంచెం తొందర పడి పెళ్ళిచూపులు ఏర్పాటుచేసినా ఇప్పుడు వాళ్ళు వచ్చేస్తూంటే ఆయన మాత్రం ఏం చెయ్యగలడు! ఓసారి ఆ మర్యాదకూడా అయి పోతే వదిలిపోతుంది. తరువాత తండ్రికి వివరంగా చెప్పొచ్చు ననుకుంది.

"సరే అయితే! కాని నామాట వినండి నాన్నా! మీరు మాత్రం ఏ నిర్ణయాలూ తీసుకోకూడదు. దేనికీ వాళ్ళకు మాట ఇవ్వ కూడదు."

"అల్లాగే! కమాన్ గుడ్‌గర్ల్! వెళ్లి బట్టలు మార్చుకో."

భాస్కరం పెళ్ళిచూపుల ఏర్పాట్లలో దిగిపోయేడు. పెళ్ళి వారొచ్చేరు. వాళ్ళతో భాస్కరం స్నేహితుడు శేషారావూ మరొకా యనా కూడా వచ్చేరు. భాస్కరం ఎదురెళ్లి వాళ్ళను లోపలకు తీసుకొచ్చేడు.

* * *

వచ్చినవారందరికీ సరోజే కాఫీ లందించింది.

"....రండి ఇల్లు చూద్దురుగాని...." అని వారితో అంటూ సరోజను వుండమని సైగచేసి పెళ్లికొడుకు తప్ప మిగిలిన వాళ్ళంద రినీ తీసుకొని లోపలకు వెళ్ళేడు భాస్కరం.

ఓ అరనిముషం నిశ్శబ్దంగా గడిచింది. సరోజ అతనేం మాట్లాడుతాతో చూద్దామని ఊరుకుంది. చివరకు గొంతు సవరించు కొని పెళ్లికొడుకు సుబ్బారావు అన్నాడు.

"మీపేరేమిటన్నారు?"

"సరోజ."

మళ్ళీ నిశ్శబ్దం. నిశ్శబ్దంలోనుంచి లోపల పెళ్ళిపెద్దలతో తండ్రి మాట్లాడే మాటలు విన్పిస్తున్నాయి సరోజకు. పెళ్ళికొడుకు ప్రశ్నలకు బదులిస్తూనే వారి సంభాషణ వినసాగింది.

"ఇంతకీ అమ్మాయి నచ్చిందా?" భాస్కరం వినయంగా అడిగేడు.

"అమ్మాయికేం! మాకునచ్చింది" అన్నాడు కనకాచలం.

"అబ్బాయిని కూడా ఓసారి అడిగితే...."

"వాడికీ నచ్చినట్లేలెండి! కావాలంటే అడగొచ్చు.... అందులో ఏమీ సందేహం అక్కర్లేదులెండి."

"సరేమరి! మిగిలినవాటిలో తమ అభిప్రాయం శలవిస్తే...." కనకాచలం అందుకున్నాడు. "చూడండి!....మాకు యాభై వేలదాకా

ఇస్తామంటూ సంబంధాలు వస్తున్నాయి. అబ్బాయినిగురించి నేను వేరే చెప్పనక్కర్లేదు. లక్షల్లో ఒకడు! లక్షలు సంపాదించేవాడు! ఇక మా ఆస్తిసంగతి చెప్పేను. అమ్మాయి మాకు అన్నివిధాలా నచ్చింది కనుక నలభై వేలు కట్నంయిచ్చి ఆ అంతస్థులో మిగిలిన వన్నీ చేస్తే బాగుంటుంది...."

సరోజకు ఒళ్ళు మండిపోయింది. కట్నాలడిగినా ఏ మధ్య వర్తి ద్వారానో మెత్తగా చెప్పిస్తారు. ఈయన నిలబెట్టి ఎదురుగానే అడిగేస్తున్నాడు. అందులోనూ తన తండ్రి వాళ్ళకు మాటియ్యానని తనతో అన్నాడు కాని మాట నిలబెట్టుకొనేటట్లు లేదు. ఒక్కసారి ఈ మనుష్యులందరిమీదా సరోజకు అసహ్యం కలిగింది.

ప్రశ్నలడగటం ఆపిన సుబ్బారావు సరోజవైపే గుడ్లప్పగించి చూస్తున్నాడు.

"నేనుకూడా కొన్ని ప్రశ్నలడిగితే మీకేమీ అభ్యంతరం లేదనుకుంటాను" అంది సూటిగా అతని కళ్లల్లోకి చూస్తూ.

"అడగండి! మీరేమడిగినా చెప్తాను" ఏదో ఇంటర్వ్యూలో చెప్పినట్లు చెప్పేడతను.

"మీ వయసెంత?" సరోజ అడిగింది.

"ట్వెంటీసిక్స్!" అన్నాడతను.

"మీరు సిగరెట్స్ కాలుస్తారా?"

అతను ఊహించని ఈ ప్రశ్నకు కొంచెం ఆశ్చర్యపోయాడు.

అయినా కొంచెం తెలివిగా చెప్దామని, "అఫ్‌కోర్స్! నాగరికు డైనా ప్రతివాడూ సిగరెట్లు కాలుస్తాడు!" అన్నాడు.

"ఐసీ!" అని ముఖం చిట్లించింది సరోజ.

"ఎందుకు ముఖం అలాపెట్టేరు?" అన్నాడు సుబ్బారావు.

"ఏంలేదు! నాకు సిగరెట్లు కాల్చేవాళ్లంటే కొంచెం అసహ్యంలెండి!"

"అబ్బే! అంత ఎక్కువగా కాల్చను...." సుబ్బారావు సర్దుకోబోయాడు.

"అదిసరే! ఇంతవరకూ మీరెన్ని పెళ్ళిచూపులకు వెళ్ళేరు?"

"నాలుగు."

సరోజకు అతనిమీద కసి, అసహ్యం పెరిగిపోతున్నాయి. అయినా నిగ్రహించుకుంది.

"మరి అమ్మాయిలు ఎవరూ నచ్చలేదా?"

"ఇద్దరు నచ్చేరు."

"అచ్ఛా!....మరి....!"

"మిగిలిన విషయాలు కుదరలేదు."

"అంటే?"

"మే మడిగిన కట్నాలూ లాంఛనాలూ ఇవ్వడానికి వాళ్ళు ముందుకు రాలేదు."

"మరి మీకు అమ్మాయి అంత నచ్చినప్పుడు కట్నాలూ లాంఛనాలూ లేకుండా చేసుకోలేరా. డబ్బుతో ఓ అమ్మాయి ఆకారాన్ని చేసిపెడితే రక్తమాంసాల్లేని ఆ బొమ్మను పెళ్లిచేసుకోవడానికి మీకేం అభ్యంతరం వుండదనుకొంటాను?"

అప్పుడేవచ్చి గుమ్మంలో నిలబడ్డ సుబ్బారావు తండ్రి కనకాచలం అయోమయంగా చూసేడు.

కాని సరోజ వదలదలచుకోలేదు.

"మీరు ఫారిన్‌లో వుండేటప్పుడు...."

"చూడు నాన్నా ఆ ప్రశ్నలు!" దీనంగా తండ్రివైపు చూసేడు సుబ్బారావు.

"ఏమిటమ్మాయ్ ఇది! ఆడపిల్లవు! ఇన్నిమాటలు...."

"అవునండీ! నయాపైస పెట్టుబడిలేకుండా మీరు నన్ను గురించి అన్నిప్రశ్నలడిగి పరీక్షపెట్టేరే! వేలకువేలు పెట్టుబడిపెట్టి కొనుక్కునేటప్పుడు కాస్త సరుకు నాణ్యం చూసుకోవద్దూ!" కోపంతో సరోజ కళ్ళు ఎర్రబడ్డాయి.

"ఏమిటమ్మా అది?" అప్పుడే లోపలినుంచి శేషారావుతో వచ్చిన భాస్కరం కూతుర్ని అడిగేడు.

"చూడండి మీ అమ్మాయి మాటలు! పెద్దమనుషుల్ని పట్టుకొని...." కనకాచలం తన వెనక్కు సర్దుకుంటూన్న కొడుకు భుజం

మీద చేయివేసి మరోచేత్తో సరోజను చూపిస్తూ అన్నాడు.

"అమ్మాయ్ సరోజా!" భాస్కరం వురిమేడు.

కాని సరోజ ఎవర్నీ లెక్కచెయ్యదలచుకోలేదు. మొత్తం ఈ తంతు అంతా ఆమె ఆత్మాభిమానాన్ని పూర్తిగా రెచ్చగొట్టింది.

"పెద్దమనుషులట పెద్దమనుషులు? నచ్చిన అమ్మాయిల్ని అడిగినంత కట్నం ధారపొయ్యలేదని వదులుకున్నారట! సంస్కారం మానవత్వంలేకుండా తమకు తాము డబ్బుతో వెలకట్టుకొనే ఈ సిగ్గు లేని నరపశువులు నాకక్కర్లేదు."

"సరోజా!" భాస్కరం పిచ్చిగా అరిచేడు.

కనకాచలం ఒక్కక్షణం నిశ్చేష్టుడై నిలచి తరువాత కొడుకు వెనకాలే వీధి గుమ్మంవైపు దారితీస్తున్నాడు.

"ఉండండి బాబుగారూ!" భాస్కరం బ్రతిమాలబోయేడు.

"మీకు సిగ్గులేకపోతే మాకయినా వుండొద్దూ? నడవరా వెడదాం" కనకాచలం సుబ్బారావూ వెళ్ళిపోయారు.

ఈ ఊహించని పరిస్థితికి ఏంచెయ్యాలో తోచక మెల్లగా శేషారావు కూడా వాళ్ళవెనకాలే నడిచేడు.

భాస్కరం కోపానికి అంతులేదు. తను కావాలని తెచ్చిన మంచి సంబంధం పోవడం మాట అటుంచి కూతురు తలబిరుసు ప్రవర్తన తన వునికినే సవాలుచేసినట్లనిపించింది. కోపంతో వణికిపోతూ సరోజవైపు తిరిగేడు.

"దేన్ని చూసుకుని నీకీ అహంకారం!"

"ఇది అహంకారంకాదు" సరోజ నిశ్చలంగా జవాబు చెప్పింది.

"లేకపోతే ఏమిటిది? ఛీ ఛీ? చదువుకొని మర్యాద నేర్చుకుంటావనుకున్నాను. ఆడపిల్లవు ఇలా నోరు పారేసుకుంటే మళ్ళీ ఈ గుమ్మం ఎవరు తొక్కుతారు?"

"పోనీ నాన్నా? నాకోసం ఈ గుమ్మం ఎవరూ తొక్కక పోయినా ఫర్వాలేదు....నలభై వేలిస్తే చేసుకుంటామంటే నేనేమయినా మనిషిననుకున్నారా? మానుననుకున్నారా?"

"సరోజా! ఊరుకుంటూంటే నీ తలపొగరు ఎక్కువవు

తూన్నట్లుంది. ఎవరితో మాట్లాడుతున్నావో ఏంమాట్లాడుతున్నావో తెలుస్తూందా?"

"అన్నీ తెలుస్తున్నాయి నాన్నా?....అసలు నాతో ఏమాటా చెప్పకుండా వీళ్లను పెళ్లిచూపులకు తీసుకురావడం మీ పొరపాటు. ఏది ఎలావున్నా ఒక్కవిషయం మాత్రం చెప్తున్నాను వినండి. నా పెళ్ళి నూటికి నూరుపాళ్లూ నా యిష్టం వచ్చినట్లే జరగాలి. మీకు ఏ కారణంచేతో ఎవరో నచ్చేరని నన్ను బ్రతుకంతా వాళ్లతో గడపమంటే నే గడపలేను. నేను పెళ్ళిచేసుకోకుండా నయినా వుంటాను. కాని కట్నం ఇచ్చిమాత్రం ఆ శ్రీమహావిష్ణువు కిందికి దిగివచ్చినా చేసుకోను."

అప్పుడే గొడవ విని వచ్చిన కాంతం తండ్రీ కూతుళ్ళ వాగ్యుద్ధం వినడంకంటే మరేమీ చెయ్యలేకపోయింది.

"కట్నం ఇయ్యకుండా ఎవరైనా నీలో ఏం చూసి నిన్ను చేసుకుంటారనుకుంటున్నావు?" భాస్కరం రెట్టించేడు.

తండ్రి ఈ ప్రశ్న చాలా బాధ కలిగించింది సరోజకు.

"నాలో ఏం చూడలేని వాళ్ళు నా కక్కర్లేదు."

సరిగా అదే సమయానికి రవి వచ్చేడు.

కాంతం మనసులో వెయ్యి దేవుళ్ళకు మొక్కుకుంటూంది ఈ పరీక్షనుండి కాపాడమని.

సరోజ సందిగ్ధావస్థలో పడింది. రవి విషయం తండ్రికి నచ్చచెప్పడానికి ఇదివరలో ఏమాత్రం అవకాశం వున్నా ప్రస్తుత పరిస్థితిలో మాత్రం అంతా వ్యతిరేకంగానే వుంది. అలా అని ఎదురుగా రవి నిలబడి వుండగా విషయాన్ని దాచడంలోనూ అర్థం కనిపించలేదు. ఉన్నదున్నట్టు చెప్పడంకంటే వేరే మార్గం కనిపించటంలేదు. ధైర్యంగా రవి దగ్గరకు వెళ్ళింది.

"రండి! సమయాని కొచ్చేరు." అని లోపలకు తీసుకొని వచ్చింది.

అపరిచిత వ్యక్తి రావడం, అతని దగ్గరకు సరోజపోయి మాట్లాడడం, వాళ్ళిద్దరిమధ్యా కనబడుతూన్న సాన్నిహిత్యం, భాస్క-

రానికి పుండుమీద కారం చల్లినట్లుంది.

"నాన్నా! ఈయన రవికుమార్! హైదరాబాదులో బ్యాంకులో ఆఫీసరు. మిమ్మల్ని కలవాలని మీతో మాట్లాడాలని ఈయన నాతో ఈరోజు వచ్చేరు. ఈ లోపులో ఇక్కడ అనుకోకుండా వాతావరణం పాడయింది.... మేమిద్దరం ఒకరినొకరు అర్థం చేసుకున్నాం. ఇష్ట పడ్డాం. మీ అనుమతితో మే మిద్దరం వివాహం చేసుకోవాలనుకుం టున్నాం." సరోజ తండ్రితో అంది.

రవికి విషయం కొంత అర్థం అయింది.

సరోజ ధైర్యం భాస్కరాన్ని ఎంతో ఆశ్చర్యపరచింది. ఆపాదమస్తకం ఊపేస్తూన్న కోపాన్నంతా బలవంతంగా తొక్కి పట్టుకొని అసలు వ్యవహారం ఎక్కడిదాకా వెడుతుందో చూడదలి చేడు. "నా అనుమతి లేకపోతే!" తీవ్రంగా సరోజ కళ్ళల్లోకి చూసేడు.

"నాన్నా!" ప్రాధేయపూర్వకంగా తండ్రివైపు చూపింది సరోజ.

"ఏం? జవాబు చెప్పు!"

"అనవసరంగా ఆవేశపడకండి నాన్నా!"

"నే నడిగినదానికి జవాబు చెప్పు!" కోపంతో భాస్కరం కంఠం వణుకుతూంది.

"మేము పెళ్ళి చేసుకోదలచుకున్నాం. మీరు మనసారా ఆశీర్వదించాలని ప్రార్థిస్తున్నాము."

కాంతానికి తాడు తెగుతూన్నట్లనిపించింది.

"అది నేను అడిగిన ప్రశ్నకు జవాబుకాదు." భాస్కరం కటువుగా అన్నాడు.

"అయితే ఎవరు అనుమతించినా అనుమతించకపోయినా మేమిద్దరం ఒకటి కావడానికే నిశ్చయించుకున్నాము."

సరోజకు ఇంక గత్యంతరం లేకపోయింది.

భాస్కరానికి చెంపదెబ్బ కొట్టినట్లనిపించింది. మరో సంద ర్భంలో అయితే కూతుర్ని చెయ్యిచేసుకొనయినా లోపలకు తీసుకెళ్ళి

ఏ గదిలోనో తాళంపెట్టి తనమాట ఒప్పించడానికి ప్రయత్నించే వాడేమో। కాని ఇప్పుడు తనేదో శక్తివంతురాలయినట్లు ఒక ముక్కూ-మొహం తెలియనివాడిని పక్కనెట్టుకొని నోటికొచ్చినట్లు మాట్లాడుతూంటే ఆ పనికూడా చెయ్యాలనిపించలేదు. పూర్తిగా కూతురు గర్వభంగం చూడాలనిపించింది. విశ్వరూపం ధరించిన అహంకారం తప్ప మరే శక్తీ అతనిమీద పనిచెయ్యడం లేదు.

"అయితే నేను చెప్పేదికూడా విను। ఇదే నిర్ణయంతో నువ్వీ గడప దాటదలుచుకుంటే కట్టుబట్టలతో వెళ్ళవలసిందే। తిరిగి ఈ గుమ్మం తొక్కడానికి వీలులేదు."

"ఏమండీ।" కాంతం బాధగా అంది.

"నోర్మూయ్। నువ్వు లోపలకు నడు."

కాంతం చేసేదిలేక ఏడవడం మొదలుపెట్టింది.

తల్లి పరిస్థితిని చూసి సరోజ కొంచెం తమాయించుకుంది.

"ఇంత కాఠిన్యం దేనికి? కొంచెం ఆలోచించండి నాన్నా।"

"ఇంకా నేను సరిగా ఆలోచించాలా! నీకున్న తెలివితేటలూ నువ్వు చదివిన చదువూ నీకా విషయం తెలిసేటట్లు చెయ్యకపోతే చెప్తున్నాను విను. నేను కాళ్ళా వేళ్ళా పడి నీ సుఖంకోసం మంచి సంబంధం తెస్తే మంచీ మర్యాదా లేకుండా ప్రవర్తించేవు। నీ ఇరవై ఏళ్ళ వయసుతో యాభై ఏళ్ళ అనుభవాన్ని వెక్కిరించేవు।...."

ఇంక వాదించి ప్రయోజనం లేదనిపించింది సరోజకు.

"సరే నాన్నా।....రవీ। మీరు విన్నారుగా! నాన్నగారు నన్ను ప్రేమతో పెంచేరు. ముద్దు ముచ్చట్లు తీర్చేరు. మా అమ్మ నన్ను ప్రాణంలో ప్రాణంగా చూసుకుంది. ఆవిడలోని అణువణువూ నామీద ప్రేమతో స్పందిస్తూంది. నాన్న ఆస్థిలోని సెక్యూరిటీని, అమ్మ ప్రేమనూ అన్నింటినీ వదులుకొని ఇలా కట్టుబట్టలతో వస్తున్నాను. నేను మీకు ఇయ్యగలిగింది నన్ను తప్ప మరొకటి లేదు. ఈ గడప దాటితే లోపలకు రావద్దన్నారు నాన్నగారు. అందుకని మరోసారి గట్టిగా ఆలోచించుకోండి."

రవి ఇక్కడికి బయలుదేరినప్పుడు ఇటువంటి సంఘటన

ఎదుర్కోవలసి వస్తుందని ఊహించలేదు. అయినా సరోజను భార్యగా పొందడానికి తను ఏం చెయ్యడానికైనా సిద్ధమే! తన ప్రేమను ఋజువు చేసుకోడానికి ఇటువంటి పరీక్షే ఎదురైతే తాను తప్పకుండా విజయం సాధిస్తాడు.

"రా సరోజా!" రవి ఆమె చేతిని తనచేతిలోకి తీసుకున్నాడు.

కాంతం భోరున ఏడుస్తూ పరుగెత్తుకొచ్చి కూతుర్ని కౌగలించుకుంది.

"అమ్మా!" అని తల్లి కౌగిలిలో కరిగిపోయింది సరోజ.

"కాంతం! నువ్వు లోపలికెళ్ళు!" ఉరిమేడు భాస్కరం.

సరోజ తల్లి పాదాలను మనసారా కళ్ళకద్దుకుంది. ఆ తల్లి కన్నీటి ధారలు అక్షింతల్లా సరోజ నెత్తిమీద పడ్డాయి.

మాతృప్రేమకు నోచుకోని రవికి కాంతాన్ని చూస్తుంటే హృదయం ద్రవించింది. భక్తితో తనుకూడా ఆమె పాదాలకు నమస్కరించేడు.

"ఈ యింట్లో అమ్మాయి ఒక్కరోజు గడిపి ఆరు నెలలయిపోయిందండి! ఇంటికొచ్చిన శత్రువునుకూడా ఇలా పంపమండి! ఇంకొక్కసారి దయతలచి ఆలోచించండి!" అంది కాంతం భర్త వైపు తిరిగి.

భాస్కరం భార్యను గుడ్లురిమి చూసేడు.

సరోజ తండ్రి పాదాలకు నమస్కరించబోయింది.

భాస్కరం కాళ్ళు వెనక్కు తీసుకున్నాడు.

"సరే నాన్నా! నా చదువు చూసి నా కొచ్చే ఆస్తిపాస్తులు లెక్కకట్టి అన్నీ నచ్చేక నలభై వేల రూపాయలిస్తేకాని చేసుకోలేమనే వాళ్ళను కాదని, కట్టుబట్టలతోనైనా నాకు నువ్వే కావాలనే మనిషితో ఈ గడపదాటి వెడుతున్నాను. మంచిచెడ్డలు మీరే ఆలోచించండి. వస్తాను."

సరోజ రవితో రెండడుగులు గుమ్మంవైపు వేసి మళ్ళీ అంది. "నేను మాత్రం మీ పిలుపుకోసం ఎప్పుడూ ఎదురుచూస్తూనే వుంటాను."

సరోజ రవితో గుమ్మం దాటి బయట అడుగుపెట్టింది.

## 8

కమలాదేవి రవికుమార్ అక్క. రవికంటే పన్నెండేళ్ళు పెద్దది. ఏ.జీస్ ఆఫీసులో యు.డి.సి గా పనిచేస్తూంది. చిన్నతనంలోనే తల్లిదండ్రులను కోల్పోయిన కమలాదేవీ, రవికుమార్ పినతండ్రి ఇంట్లో పెరిగేరు. ఆయన కమాలాదేవిని తన మగపిల్లలతోపాటు చదివించేడే కాని ఓ యింటిదాన్ని చెయ్యలేక పోయేడు. కమలాదేవికి ఏ.జీస్ ఆఫీసులో ఎల్.డి.సి ఉద్యోగం వచ్చిన తర్వాత పినతండ్రి మనసులో ఇష్టం వున్నా భార్య పోరుపడలేక అన్న సంతానాన్ని బయటికి పంపవలసి వచ్చింది.

కమలాదేవి చిన్నతనంలోనే పెద్దరికం నెత్తిన వేసుకోవలసి వచ్చింది. అప్పుడప్పుడు పినతండ్రి వచ్చిపోతూన్నా ఆ రాకపోకలు కాస్త మనోధైర్యానికే పనికొచ్చేయిగాని మరేమీ చెప్పుకోదగిన సహాయం జరగలేదు. ఆమె జీవితం ఇలా గడవాలి అని ఆలోచించి అది సానుకూలమయ్యే ప్రయత్నం చేసే మనుషులు లేకపోవడంతో రోజులు నెలల్లోకీ, నెలలు సంవత్సరాల్లోకీ దొర్లిపోయినా ఆమె జీవితంలో వ్యక్తిగతంగా చెప్పుకోదగ్గ మార్పు రాకుండానే గడిచి పోయింది. ఎటొచ్చీ తమ్ముడు కాస్త ప్రయోజకుడై తనకంటె వున్నతంగా ఆఫీసరుగా ఉద్యోగ జీవితం మొదలుకావటంతో ఆ అదృష్టం కమలాదేవి తనదిగానే భావించింది.

ఒకప్పుడు ఒక యువతిగా అంతులేని మధురమైన కలలుకన్నా ఆ కలలన్నీ ఆమెపట్ల జాలిలేని కాలంలో ఆవిరైపోయేయి. దైనందిన కార్యక్రమం ఉద్రేకాలు ఉన్మాదాలు తొలగిన యాంత్రికమైన గాడిలో పడిపోయింది.

ఆమె మానసిక స్థితికి చిహ్నంగా ఇంకా నలభై నిండకుండానే జుట్టు సగం తెల్లబడిపోయింది.

రెండుమూడేళ్ళ నుంచి కమలాదేవి తమ్ముణ్ని పెళ్ళి చేసుకోమని పోరుతూంది.

"నీ పెళ్ళయేకే నేను చేసుకునేది." అంటూండేవాడు రవి.

రవి ఎంత హృదయపూర్వకంగా ఆ మాట అన్నా అది అసంభవమని కమలాదేవికి రూఢిగా తెలుసు. ఏడాదినుంచి రవి సరోజల స్నేహం తెలిసి కొంత ఊరట చెందిందామె మనసు.

రవి సరోజతో వాళ్ళ ఊరికి వెళ్ళినప్పుడు రవి నోటిద్వారా వాళ్ళ పెళ్ళికి సరోజ తల్లిదండ్రుల అంగీకారాన్ని వినడానికి ఆమె మనసు ఉవ్విళ్ళూరిందేకాని, రవి ఆమెను కట్టుబట్టలతో తీసుకొని రావలసిన సందర్భాన్ని మాత్రం ఊహించలేక పోయింది.

ఈ అనుకోని సంఘటనకు ఆమె మనసు ఎంతో ఆందోళన చెందింది. రవి ఆవేశంతో తొందరపడి సరోజను ప్రోత్సహించి ఆమె తల్లిదండ్రులకు దూరంచేసేదేమోనని భయపడింది.

నిజంగా జరిగిన విషయాన్ని సరోజ పదేపదే చెప్పగా చివరకు ఆమె మనస్సు కొంత కుదుటబడింది.

అయినా పెళ్ళికాకుండా సరోజ తమ యింట్లో ఉండడం అంత మంచిది కాదని వీలయినంత త్వరలో ముహూర్తం పెట్టించింది.

తమ పెళ్ళికి ఆడపడుచు చూపిస్తూన్న ఆసక్తి చూస్తుంటే సరోజకు ఆమెపట్ల ఎంతో ఆత్మీయత పెరిగింది.

ఆమె కథ తెలుసుకొని ఎంతో జాలిపడింది. ఓ సందర్భంలో ఆపుకోలేక మనసులోమాట చనువుతో పైకి అనేసిందికూడా.

"వదినా! మీరుకూడా ఓ యిల్లాలైయుంటే ఎంత బాగుండేది?" అని. కమలాదేవి నవ్వేసింది. సరోజ మనసులోని సానుభూతిని సరిగా అర్థం చేసుకుంది. మాటలతో దాటెయ్యడానికి ప్రయత్నించక మనసులో వున్న ఆలోచనే చెప్పింది.

"చూడమ్మా సరోజా! ఈ ప్రపంచంలో ఎందరో లేనివాళ్ళున్నారు. కళ్ళు లేనివాళ్ళు, కాళ్ళు లేనివాళ్ళు, తిండి లేనివాళ్ళు, ఆరోగ్యం లేనివాళ్ళు....మనిషి ఏదో లేనిదాన్ని వెదుక్కొని అశాంతి పొందడం స్వాభావికం. ఉన్నదాన్ని గుర్తించి ఆనందాన్ని పొందడానికి ప్రయత్నించడం వివేకం. నా మటుకు నేను ఎన్నో విధాలుగా అదృష్టవంతురాలిననే అనుకుంటున్నాను....మీ మటుకు మీ రిద్దరూ

ఎంతో అన్యోన్యంగా వుండండి. అదే ఇప్పుడు నేను కోరుకొనేది."
అంది గంభీరంగా నవ్వుతూ.

ఆమె జీవితంతో రాజీపడిన విధానానికి ఒకవైపు హృదయం ఆర్ద్రమవుతూండగా మరోవైపు అంత హృదయస్ఫూర్తిగా తమ సుఖాన్ని కోరుతూన్న ఆమె అభిమానానికి ముగ్ధురాలయింది సరోజ.

పెళ్ళికి ఇంచుమించుగా అందరూ స్నేహితులే, ఇటు కార్యకర్తలూ అటు అతిధులూ అభ్యాగతులూ అయ్యేరు.

సరోజ శుభలేఖలు తల్లిదండ్రులకు పంపించింది.

తల్లికి తనలో వున్న బాధనంతా వ్యక్తపరుస్తూ ఆమెయొక్క ఆశీస్సులు కోరుతూ తన భావావేశపూరిత హృదయాన్నే ఒక లేఖగా పంపింది.

పెళ్ళిరోజు కాంతం ఆశీస్సులు కవరులోనే వచ్చేయి. ఆ ఉత్తరంలో, ఒక్కో అక్షరంలో ఒక్కో ప్రేమసముద్రాన్ని చూస్తూ ఉత్తరం పదేపదే చదువుకొని పగలంతా కంట తడిపెట్టుకుంటూనే వుంది సరోజ.

పెళ్ళి నిండుగా నిరాడంబరంగా జరిగిపోయింది.

అందరి సుభాకాంక్షలూ రవికీ సరోజకూ భావిజీవితంపట్ల చక్కని ప్రోత్సాహాన్నిచ్చేయి.

పెళ్ళిదండలు మెడలో మెరెస్తూంటే వధూవరులిద్దరూ అతిధులందరికీ ఒకరితర్వాత ఒకరికి వీడ్కోలు చెప్తున్నారు.

పెళ్ళిపందిట్లో కొంచెం దూరంలో నిలబడి తనవైపు రెప్ప వాల్చకుండా చూస్తూన్న హాస్టలు వార్డెను ఉషా మెహతాను గుర్తించింది సరోజ.

నవ్వుతూ ఆవిడ దగ్గరకు వెళ్ళింది. ఆమె మనస్ఫూర్తిగా ఆశీర్వదించింది.

"మీ తల్లిదండ్రులెక్కడమ్మా?" ఆమె అడిగింది.

"మా నాన్నగారు ఈ పెళ్ళికి ఒప్పుకోలేదు మేడమ్! అందుకని...." కొంచెం చిన్నబుచ్చుకొని చెప్పింది సరోజ.

"తల్లిదండ్రులను ఎదిరించి చేసుకున్నావన్నమాట! గుడ్!

కాని దీన్నిగురించి నువ్వెప్పుడూ పశ్చాత్తాపపడే రోజు రాకూడదు సుమా!...."

"అంటే?...."

"నేనిలా చెప్తున్నానని మరోలా అనుకోకు! నేను మీ అమ్మ లాంటి దానను! ఇలా అయినవాళ్ళ మధ్య అభిప్రాయభేదాలూ ఆవేశాలూ వస్తూనే వుంటాయమ్మా!....కాని కావలసిందేమిటంటే ఒక సమయంలో ఒక సమస్య వచ్చినప్పుడు సాధారణంగా దానికి ఒకటే సరియైన పరిష్కారం వుంటుంది. మిగిలినవన్నీ సమస్యను పెంచేవే! అలాగే ఇప్పుడు మీ పెళ్ళి విషయంలోకూడా నువ్వు మీ వాళ్ళను కాదని చూపిన సాహసమే మీ సమస్యకు సరియైన పరిష్కారం కావాలని ఆశిస్తున్నాను. కాని అది అవునో కాదో భవిష్యత్తు నిర్ణయిస్తుందమ్మా!...."

"అవును మేడమ్!" అంది సరోజ మనసులో ఒక విధమైన ఆత్మవిశ్వాసంతో.

"కాని ఒక్క విషయం గుర్తుపెట్టుకో సరోజా! .... ప్రపంచంలో అన్నిటికంటే తొందరగా అంతర్ధానమయిపోయే పదార్థం ఏమిటో తెలుసా?...."

సరోజ అర్థంకాక వార్డెన్ కళ్ళల్లోకి చూపింది.

"అది దాంపత్య జీవితంలో సుఖం తల్లీ! అది అంతర్ధానం కాకుండా వుంచుకోగలగడమనేది ఒక కళ! ఆ కళ భగవంతుడు చాలా కొద్దిమందికే ప్రసాదించేడు. దేవుడు మీకది ప్రసాదించాలని మనసారా కోరుకుంటున్నాను...."

"థాంక్స్ మేడమ్!"

ఆమె మాటల వెనకాల ఎన్ని అగాధాల్లాంటి అనుభవాలున్నాయో ననిపించింది సరోజకు. శ్రీమతి ఉషామెహతాగా వున్న ఆమె భర్తకు దూరంగా ఒంటరిగా గడుపుతూన్న జీవితాన్ని గురించి ఆలోచించింది. తన వ్యక్తిత్వాన్ని పూర్తిగా చంపుకొని సంఘమర్యాద కోసం తండ్రి నీడలో బ్రతుకుతూన్న తల్లి గుర్తుకొచ్చింది.

తల్లి వ్రాసిన ఉత్తరంలో మాటలు గుర్తుకొచ్చి సరోజ మన సంతా సంతోష విషాదాల విచిత్రమైన కలయికతో నిండిపోయింది.

9

నగరం పొలిమేరలలో జనం పల్చగా వున్న ప్రాంతంలో ఒక బస్‌స్టాప్. బస్‌స్టాప్‌లో నలుగురైదుగురు మనుష్యులున్నారు.

ప్రేమరాజు క్షణక్షణానికీ వాచీ చూసుకుంటూ ఆత్రుతగా సిటీ బస్ కోసం ఎదురు చూస్తున్నాడు. తొమ్మిదిన్నర దాటిపోయింది. పదిగంటలకు యూనివర్శిటీలో వుండితీరాలి. అనుకోకుండా ఆలశ్యమై పోయింది. గత అరగంటలో ఒక్క బస్సు కూడా రాలేదు. వెంటనే బస్సు దొరికినా యూనివర్శిటీకి వెళ్ళేసరికి కనీసం అరగంట పడు తుంది. దూరంగా రోడ్డుమీద వాయువేగంతో వస్తూన్న స్కూటరు కనబడింది. రెండడుగులు ముందుకువేసి చేయి వూపి స్కూటరును ఆపేసేడు. స్పీడుగా వెడుతూన్న స్కూటరు కీచుమని చప్పుడు చేసు కుంటూ ఆగిపోయింది.

"లిఫ్ట్ ప్లీజ్!" అని ముందుకు నడవబోయి స్కూటరు మీద మనిషిని చూసి గతుక్కుమన్నాడు ప్రేమరాజు. స్కూటరు నడుపు తూన్నది అబ్బాయి కాదు అమ్మాయి. గళ్ళ ఓపెన్ షర్టు బ్లూజీన్స్‌లో టక్‌చేసి స్లీవ్స్ మోచేతులదాకా మడిచి పెట్టింది. బాబ్డుహెయిర్. ముఖం సగం కప్పుతూ తేనెరంగు కూలింగ్ గ్లాసెస్. ఎంత మగ వేషంలో వున్నా వయసు పొంగులో వున్న ఆమె సహజమైన స్త్రీ సౌందర్యం కొట్టొచ్చినట్లు కనబడుతూంది. గాలికి నుదుటిమీద చెదురుతూన్న ముంగురులతో మన్మధుడి బాణంలా వుంది.

ప్రేమరాజు ఒక్క క్షణం తను యూనివర్శిటీకి అరగంట లోపల వెళ్ళాలన్న సంగతి మరచిపోయేడు. స్కూటరుమీద అమ్మాయిని ఆపితే అసభ్యం అవుతుందేమోనని అనిపించి తికమక పడి "సారీ మేడమ్! మన్నించండి....దూరం నుంచి చూసి మగవా డనుకున్నాను!...." అమ్మాయి తీక్షణంగా ప్రేమరాజు కళ్ళల్లోకి చూసింది. తన క్షమాపణ ఆమెను సంతృప్తిపరచలేదనిపించింది ప్రేమరాజుకు.

అమ్మాయి వెనక్కి తిరిగి చూసింది. ఎక్కడా నర సంచారం లేదు. రిస్ట్‌వాచీ చూసుకొని "మీకు మగవాళ్ళ లిఫ్టే కావాలా?" అంది.

ప్రేమరాజు ఆశ్చర్యపోయాడు. "అది కాదండి!...." అని నీళ్లు నమిలేడు.

"కమాన్! డోంట్ వేస్ట్ ఎనీ మోర్ టైమ్!" అందామె.

ప్రేమరాజు ఇంకా ఆశ్చర్యంలోంచి తేరుకోకుండానే వెళ్ళి స్కూటర్ పిలియన్ మీద కూర్చున్నాడు. స్కూటర్ బాణంలా దూసుకుపోయింది.

స్కూటర్‌మీద వెనుకనుంచి పరిశీలనగా ఆమె వైపు చూసేడు ప్రేమరాజు.

ఎడమ చేతికి వెడల్పైన బంగారు గాజు. కుడిచేతికి నల్లని స్ట్రిప్‌తో పెద్దవాచ్. సుకుమారమైన ఆమె వేళ్లు సర్కస్ జంతువును కంట్రోల్‌చేసే శాండో బెత్తంలా గంటకు అరవై కిలోమీటర్ల వేగంతో వెడుతూన్న స్కూటరును సునాయాసంగా కంట్రోల్ చేస్తున్నాయి.

ఎదురు గాలికి రేగిన పట్టులాంటి ఆమె జుట్టు ప్రేమరాజు కళ్ళ ముందు నాట్యం చేస్తూంది. జుట్టుక్రింద తెల్లని మెడ. మెడలో సన్నని బంగారు గొలుసు. మొదటి చూపులోనే అసమాన సౌందర్యవతి అనిపించిన ఆమెకు అంత సన్నిహితంగా వుండడంలో విచిత్రమైన ఆనందానుభూతి కలిగింది ప్రేమరాజుకు. "చాలా థాంక్సండి" అప్రయత్నంగా వచ్చేసింది ప్రేమరాజు నోట్లోంచి.

"మెన్షన్ నాట్!" పరిగెత్తే యంత్రంలో ఒక భాగంలా వున్న ఆమె నోట్లోంచి వచ్చింది.

యూనివర్శిటీ కేంపస్ గుబురు గుబురుగా పెరిగిన చెట్ల మధ్య అందమైన బిల్డింగ్స్‌తో ప్రకృతి సౌందర్యానికీ మనిషి మేధస్సుకూ ఏర్పరచిన చక్కని కూర్పులా వుంది.

స్కూటరు వేగం తగ్గింది. ప్రేమరాజు తల తిప్పి ఆమెదృష్టి నాకర్షించిన వైపు చూసేడు.

రోడ్డుకు కలసిన ఒక సన్నని బాటలో ఒక అమ్మాయి చేతి నిండా పుస్తకాలతో తొందరగా అడుగులు వేస్తూ రోడ్డు వైపు వస్తూంది. నలుగురు స్టూడెంట్స్ ఆమె వెంటబడ్డారు. వాళ్ళ వికవికలూ పకపకలూ విని ఆ అమ్మాయి మరికొంచెం వేగంగా నడుస్తూంది.

వారిలో ఒకడు "అందాల ఓ చిలకా!...." అంటూ మొదలు పెట్టేడు.

"అందుకో నా లేఖ!" అంటూ రెండోవాడు ఉత్తరం అందించబోయాడు.

ఆ అమ్మాయి అవమానం భరించలేక కళ్ళల్లో నీళ్ళుబికి వచ్చేస్తున్నాయి.

"పెదవి వణికెలే చిలక కేలనో...." అంటూ ఒకడు వాళ్లకు ఎదురుగా వస్తూన్న అయిదోవాడికి కన్ను కొట్టేడు. వాడు కావాలని వచ్చి ఆమెకు ఎదురు తగిలేడు. ఆమె చేతిలో పుస్తకాలన్నీ క్రింద పడిపోయేయి. ఆమె ఏడుస్తూ పుస్తకాలు తీసుకోబోతే, "మే ఐ హెల్ప్ యూ ప్లీజ్!" అంటూ వెకవెకలాడుతూ అందరూ చుట్టూ గుమి గూడేరు.

స్కూటరు పక్కనే ఆగింది. అప్రయత్నంగా ప్రేమరాజు క్రిందికి దిగేడు. స్కూటరు స్టాండువేసి అమ్మాయి ముందుకొచ్చింది. పుస్తకాలు తీసి రెండో అమ్మాయి కిచ్చింది. వాళ్ళల్లో ఒకడు ఈల వేసేడు.

"మిస్టర్!" స్కూటరమ్మాయి ముందుకొచ్చింది.

అందరూ కొంటెగా ఆమెవైపు చూసేరు.

"మీలాగే చదువుకోడానికి వచ్చిన అమ్మాయిని ఇలా అవమానపరిచే మీరు మనుషులేనా? మిమ్మల్ని ఏం చేస్తే...."

"ప్రిన్సిపాలుగారితో కంప్లెయింట్ చేసుకోండి!" వాళ్ళలో ఒకడు అడగొంతుతో అన్నాడు.

"ప్రిన్సిపాల్‌గారితో కంప్లెయిన్ చేసుకోవాలా? ఆల్‌రైట్! మిస్టర్! ఆమెను క్షమాపణ అడుగు!" అని ఎదురొచ్చి కొట్టినవాడి

నడిగింది ఆమె.

"నేనేం గాజులు తొడుక్కోలేదు క్షమాపణ చెప్పుకోడానికి" అన్నాడు వాడు.

స్కూటరమ్మాయి బెల్టు తీసింది. చేతికొద్దీ పెట్టింది. వాడు కింద పడిపోయేడు. వరుసగా ఆగకుండా మరో రెండు తగిలించింది. భంగపరుచబడ్డ అమ్మాయి అడ్డు వచ్చింది.

"ఆమె అడ్డు వచ్చిందని వూరుకున్నాను. అడుగు! క్షమాపణ అడుగు."

వాడు నిస్సహాయంగా తటపటాయిస్తున్నాడు.

"కావాలంటే ఇదిగో ఈ గాజు తొడుక్కొని క్షమాపణ అడుగు" చేతి గాజు తీసి చూపించేటప్పటికి వాడు ఆమె కాళ్ళమీద పడి "క్షమించండి" అన్నాడు.

స్కూటరమ్మాయి వెళ్ళి ఆడగొంతుతో మాట్లాడినవాడి కాలరు పట్టుకుంది.

"ఇప్పుడేం చేస్తావో తెలుసా?" అంది ముఖంలో ముఖం పెట్టి

"ఏం చెయ్యను?" అన్నాడు వణికిపోతూ.

"వెళ్ళి ప్రిన్సిపాల్‌తో కంప్లెయిన్ చెయ్యి! అమ్మాయి బెల్టు తిరగేసిందనీ, గాజు తొడుక్కోమందనీ....రాస్కెల్స్! ఇంకా నిల బడ్డారేం! వెళ్ళండి...."

అందరూ వాళ్ళదారిన వాళ్ళు పోయారు.

అమ్మాయి స్కూటరు స్టార్టు చేసింది.

"కమాన్!" ఉరుముతూ ప్రేమరాజు వైపు చూసింది.

"వస్తున్నానండి" వినయంగా ప్రేమరాజు స్కూటరుమీద కూర్చున్నాడు. స్కూటరు కదిలిపోయింది. సరిగా స్కూటరు యూని వర్శిటీ కాలేజీ ముందు ఆగేసరికి అయిదు నిముషాలు లేటయింది.

"చాలా థాంక్సండి! మీరు సమయానికి రాకపోతే నాకు చాలా లేటయిపోయేది" అన్నాడు ప్రేమరాజు స్కూటరు దిగి.

అమ్మాయి ప్రసన్నంగా నవ్వింది.

"....నాకే కాదు. ఆ అమ్మాయికి కూడా!...." నవ్వుతూ కలిపేడు ప్రేమరాజు.

"మీకు ఆలస్యమయిపోతూంది." అమ్మాయి గుర్తుచేసింది.

"నిజమేననుకోండి....అంతకంటె ముఖ్యంగా మీలాంటి సాహసం వున్న అమ్మాయిని కలుసుకున్నందుకు చాలా సంతోషంగా వుంది....మీ పేరు?....మీ కభ్యంతరం లేకపోతే...."

"మిస్ గీత."

"బాగుందండి. ఏం చదువుతున్నారు?"

"బి. ఎ. ఫైనల్."

"నా పేరు ప్రేమరాజు. పేరునుబట్టి అపార్థం చేసుకోకండి, పిచ్చి పిచ్చి వేషాలేం వెయ్యను. అందులో మీరు బెల్టు ధరించి వుండగా...."

గీత పకపకా నవ్వేసింది.

"ఎం. ఎస్సి ఫైనల్లో ఉన్నాను. అమ్మాయి ఓసారి వెనకాల కూర్చోనిచ్చిందికదా అని వెనక వెనక పడుతున్నాడని మీరనుకోకుండా వుంటే....మరోసారి మిమ్మల్ని తీరికగా కలుసుకోవాలని వుంది. ఏమంటారు?"

"ఇఫ్యూ సో ప్లీజ్ అలాగే" అంది గీత.

"వస్తానండీ! థాంక్స్ ఎగెయిన్!" అన్నాడు ప్రేమరాజు.

"బై బై!" స్కూటర్ కదిలింది.

# 10

బ్యాంకు యూనివర్సిటీ బ్రాంచి గడియారంలో టైము సరిగా రెండున్నర అయింది.

కాంటీన్‌లో చేతులు కడుక్కోవడానికి వెడుతూ "రెండు స్వీట్స్‌కూడా తీసుకో!" అన్నాడు రవి.

రవి చేతులు కడుక్కొని టేబిల్ముందు కూర్చునేసరికి సరోజ ప్లేట్స్ తీసుకొని వస్తూంది.

రవికి మొదటిరోజు సరోజతో పరిచయమైనప్పుడు కాంటీన్‌కు వచ్చిన దృశ్యం గుర్తుకొచ్చింది.

"ఏమిటి ఆలోచిస్తున్నారు?" అంది సరోజ యెదురు కూర్చుంటూ.

"ఇదే టేబిల్ ముందు యిలాగే కూర్చుని ఆరునెలల క్రి నేను కన్న కల నిజమయిందని ఆలోచిస్తున్నాను."

సరోజకు కూడా చిత్రంగానే కనబడింది జరిగిందంతా.

"నువ్విక్కడ చదవడం, నేనిక్కడ ఉద్యోగం చెయ్యడ మనిద్దరం పెళ్ళి చేసుకోవడం....ఇప్పుడు నా పరీక్షలయిపో న్నాయి! ఇక్కడ నా ఉద్యోగం కూడా అయిపోతూంది....మనిద్దర యిందుకోసమే వచ్చినట్లు లేదూ!" అన్నాడు రవి.

"ఇక్కడ ఉద్యోగం అయిపోవడం అంటే...."

"నాకు సిటీలో మెయిన్ ఆఫీసుకు ట్రాన్సఫరయింది అంటూ జేబులో కాగితం తీసి సరోజకిచ్చేడు.

సరోజ స్వీట్ కొరుకుతూ "ప్రమోషనుకూడా వచ్చిందే! అంది సంతోషంతో కాగితం చూస్తూ.

"అందుకే ఆ స్వీట్! ఎలా ఉంది?"

"ఈ వార్త స్వీట్‌కంటే తియ్యగా ఉంది."

"ఈజిట్! అందుకే అన్నారు ఇల్లు కట్టినవేళా, ఇల్లా వచ్చినవేళా అని...."

"అయితే యీ ప్రమోషన్ నేనిచ్చిందేనంటారు!"

"అలా అనుకుంటే నా కెంతో బాగుంటుంది...." అన్నా రవి.

నాలుగు టేబిల్స్ అవతల మరో టేబిల్ముందు గీతా, ప్రే రాజూ కూర్చున్నారు.

ప్రేమరాజు టీ తాగుతున్నాడు. గీత కూల్‌డ్రింక్ తా తూంది. ప్రేమరాజు రెప్ప వాల్చకుండా ఆమెవైపే చూస్తూన్నాడ

"ఏమిటా చూపు!" అంది గీత కొంచెం మందలింపుగా.

ప్రేమరాజు అందులో మందలింపును లెక్కచెయ్యలేదు.

"గులాబీరేకులాంటి యింత సుకుమారమైన ముఖం వెను ఎంత సాహసం దాక్కొని ఉందోనని చూస్తున్నాను....అది సరే

రు బెల్టు తీసుకొని ఆ రోమియోని వుతికేసేరు కదా! వాళ్ళు అయిదు
రు వున్నారు. నిజంగా వాళ్లు అందరూ కలసి తిరగబడితే మిమ్మల్నీ
న్నూ కలసి పులుసులోకి ఎముక లేకుండా తన్నేవారు!....మీకు
క్కడిదా ధైర్యం!"

"ఏమో! తరువాత యేం జరుగుతూందన్న ఆలోచన నాకు
ేదు. అయిదుగురూ చేరి పాపం ఒకామెను ఆడది కదా అని
డిస్తూంటే చూడలేకపోయాను. ఒళ్ళు మండిపోయింది."

"నన్ను చెప్పమంటారా! న్యాయం మీవైపు వుంది. అదే
వైపు అనంతమైన శక్తి-అక్కడ అయిదుగురు కాదు అయిదు
ందలమంది ఉన్నా మీరా పనే చేసేవారు! మీరక్కడ గెలిచేరా
దా అన్నది ముఖ్యం కాదు! ఆ పరిస్థితుల్లో మీరలా ప్రవర్తించ
ే చాలా గొప్ప విషయం!...."

"కావచ్చు" అంది గీత సంతృప్తితో.

"పరీక్షలయిపోతున్నాయి కదా! అయిన మర్నాడు మా
ఫ్రెండ్స్ అందరం పిక్నిక్‌కు వెడుతున్నాం! మీరుకూడా రాకూడదూ"
ంది గీత కాంటీన్ బయటకు వస్తూంటే.

"రావాలనే ఉందనుకోండి! అందులో మీరు వస్తున్నారంటే
ంకానూ!....కాని...." నసిగేడు ప్రేమరాజు.

"కాని....మిగిలినవి నాకు వదిలెయ్యండి. మీరు తప్పకుండా
స్తున్నారు."

"థాంక్స్!" అన్నాడు ప్రేమరాజు కళ్ళతో చూస్తూన
ామెను హృదయంలో నింపుకుంటూ.

ప్రేమరాజు అతవి సబ్జెక్ట్సులో యూనివర్సిటీ ఫస్టు వచ్చేడు.
ీత బి. ఏ. పాసయింది.

## 11

ప్రేమరాజును అభినందిస్తూ గీత అతన్ని యింటికి పార్టీకి
ిలిచింది. తండ్రి జగపతిని కూడా యింట్లో ఉండమంది. ఓ అర
గంటలో వస్తానని జగపతి బయటకు వెళ్ళేడు.

జగపతికి ఇండస్ట్రియల్ ఎస్టేట్‌లో ఎలక్ట్రిక్ స్పేర్‌పార్ట్స్

తయారుచేసే ఫాక్టరీ ఉంది. ఫాక్టరీలో సుమారు రెండువందలమం
పని చేస్తారు. ఎస్టేట్‌లో బాగా లాభాలు గడించుకున్న పరిశ్రమ
జగపతిది ఒకటి.

గీత యింటికి ప్రేమరాజు వచ్చేడు. కాస్సేపు యిద్దరూ కు
సాగా పిచ్చాపాటీ మాట్లాడుకున్నారు. ఆ ధోరణిలోనే తన కి
పైచదువు సాగించాలని ఉన్నా ఆర్థికంగా వీలుపడదనీ వీలయినం
త్వరలో యేదైనా ఉద్యోగ ప్రయత్నం చెయ్యాలనీ చెప్పేడు. అ
టికే ఓ ట్యుటోరియల్ కాలేజిలో పార్టుటైమ్ ఉద్యోగం చేస్తున్న
చెప్పేడు. గీత యేం చేయదలచుకుందో అడిగేడు. క్లాసు రాలే
కనుక పోస్టు గ్రాడ్యుయేషన్ సీటు రావడం అనుమానమనీ, అయి
తనకు పై చదువులమీద పెద్దగా ఉత్సాహం లేదనీ ఏవయినా
సంక్షేమ కార్యక్రమాల్లో వీలయినంత సేవ చెయ్యాలని ఉం
చెప్పింది.

వీళ్ళు మాట్లాడు కొంటూండగానే జగపతికూడా వచ్చేడు.

ఇద్దరికీ పరిచయం చేసింది గీత. ప్రేమరాజు వినయం
నమస్కారం చేసేడు.

పరీక్షల్లో అతని కొచ్చిన రాంక్ విని అభినందించా
జగపతి.

కూతురు ఆసక్తికరంగా అతని గురించి చెప్పడాన్ని ని
త్తంగా విన్నాడు జగపతి.

"అది సరే!....అతను పోస్టు గ్రాడ్యుయేషన్ చేసేడు. నువ
గ్రాడ్యుయేషన్ చేసేవు! మీ యిద్దరికి పరిచయం యెలా అయింది
అన్నాడు జగపతి కూతురుతో.

ప్రేమరాజు కొంచెం ఖంగారు పడ్డాడు.

గీత తడుముకుంటూంది.

"కల్చరల్ యాక్టివిటీస్?" జగపతే అందించేడు.

"అవును సార్!" అన్నాడు ప్రేమరాజు. గీత అవునన్న
తల ఆడించింది.

ప్రేమరాజు ఖంగారు చూస్తే యిద్దరి పరిచయం కొంతదూ

తూన్నట్లే అనిపించింది జగపతికి. ఏది ఏమయినా అసలు వివ
లు తెలుసుకుంటే అది కొనసాగించవలసిందో తుంచెయ్యవలసిందో
లోచించవచ్చు.

"మీ ఫాదర్ యేం చేస్తుంటారు?" జగపతి అడిగేడు.

"నాకు ఫాదర్ లేరండి!" అన్నాడు ప్రేమరాజు.

"ఓ! ఐయామ్ సారీ! ఉన్నప్పుడేం చేస్తుండేవారు?"

"నాకు తెలీదండి."

టీ కలుపుతూన్న గీత ప్రేమరాజు వైపు ఆశ్చర్యంగా
గాసింది.

"సర్ప్రైజ్! అదేమిటోయ్!" అన్నాడు జగపతి జీడిపప్పు
లుకులు నోట్లో వేసుకుంటూ.

"అవునండి! మా నాన్నగారు నేను పుట్టక ముందే
యారు."

"అరే పాపం! అయినా మీ అమ్మగారి ద్వారా తెలిసి
ండొచ్చుగా?"

"నాకు తెలిసివచ్చే వయసొచ్చేసరికి మా అమ్మగారు కూడా
రండి. అనాధ శరణాలయంలో పెరిగేను."

"నిజంగా! అయితే ఇన్నాళ్ళూ మీ ఖర్చుకీ, చదువులకీ
బ్బు?...." గీత అడిగింది సానుభూతితో.

"ఏముంది! ఇంకా ప్రపంచంలో దానధర్మాలు చేసేవాళ్లు
ారుగా! ఎవర్నో ప్రాధేయపడి...." జగపతి గొంతులో హేళన
్రేమరాజు గుర్తించలేదు.

"అవునండి! హైస్కూలు చదువయ్యేవరకూ అనాథ శరణా
యం స్కూలులోనే చదువుకున్నానండి. మంచి మార్కులు
వడంవలన ఆ తర్వాత స్కాలర్‌షిప్ దొరికింది చదువులకి. అదీ
క ఎంతోమంది స్నేహితులు సాయం చేసేరు. నేను కూడా
్యూషన్లు చెప్పేను. ఒకటి రెండు పార్ట్‌టైము ఉద్యోగాలు
సేను...."

"బాగుంది. కష్టపడి పైకొచ్చేవన్నమాట!....మిగిలింది నేను

చూస్తాలే!" అన్నాడు జగపతి పైకి ఆలోచించుకుంటూన్నట్లుగా.

"ఏమన్నారు డాడీ?" అంది గీత తండ్రి మాటల్లో ప్రేమ రాజుకు సహాయం జరుగుతుందన్న విషయం గురించి.

కృతజ్ఞతతో కూడిన ఆత్రుతతో జగపతివైపు చూసేడు ప్రేమ రాజు.

"ఏం లేదు....రెండు రోజుల తర్వాత ఫాక్టరీకి వచ్చి కన బడు. నీకు సరిపోయే ఉద్యోగం ఎక్కడ దొరుకుతుందో ఈలోపల వాకబు చేస్తాను" సాలోచనగా చూస్తూ అన్నాడు జగపతి.

"థాంక్సండి! తప్పకుండా వస్తాను" అన్నాడు ప్రేమరాజు.

అందరూ టీ తీసుకున్నారు. ప్రేమరాజూ గీతా ఏం మాట్లాడు కుంటారో ఎలా మాట్లాడుకుంటారో చూడడానికి కావాలని మరి కొంచెంసేపు అక్కడే కూర్చున్నాడు జగపతి.

పెద్దగా మాటలేం సాగలేదు. మరో పదినిమిషాలు నిశ్శబ్దం ప్రేమరాజుకు ఇబ్బందిగా గడిచింది. మెల్లగా వెళ్ళొస్తానని లేచేడు. జగపతికి నమస్కారం చేసి బయటకు నడిచేడు. గీత అతని వెనకాలే వీధి గుమ్మం వరకు వెళ్ళి సాగనంపి వచ్చింది.

తను ప్రేమించినవాడు తండ్రి ఆదరణనూ నోచుకోగలిగి నందుకు అమితానందం చెందింది గీత.

*　　　*　　　*

సరిగా మూడురోజుల తర్వాత ప్రేమరాజు, జగపతి ఫాక్టరీకి వెళ్ళేడు.

ప్రేమరాజు వెళ్ళేసరికి జగపతి కేబిన్‌లో అతని వ్యాపార సంబంధమైన వ్యక్తులు కావచ్చు—ముగ్గురు ఉన్నారు. కేబిన్ అద్దంలో నుండి ప్రేమరాజును చూసి జగపతి బయట కూర్చోమని సైగ చేసేడు. ప్రేమరాజు కూర్చున్నాడు.

గీతతో తనకు పరిచయమైనప్పటినుంచి యిప్పటిదాకా జరిగిన సంఘటనలన్నీ అతనికి చాలా విచిత్రంగా తోచసాగేయి. గీతమీద యెన్నో ఆశలు పెంచుకొని యెన్నో కలలు కన్నా యింత సులువుగా

తనకు యింత అనుకూలంగా విషయం మారడం చాలా అదృష్టమని పించింది.

అరగంట తర్వాత లోపల వున్న వ్యక్తులు బయటకు వెళ్ళిపోయారు.

జగపతి ప్రేమరాజును లోపలికి రమ్మని పిలిచేడు.

ప్రేమరాజు లోపలకు వెళ్ళి విష్‌చేసి కూర్చున్నాడు.

"నువ్వు ఎం.ఏ. కదూ?" అన్నాడు జగపతి సూటిగా ప్రేమరాజు ముఖంలోకి చూస్తూ. ఆ చూపు అతని మెదడులో ఏదో భాగాన్ని వెదకుతూన్నట్లుంది.

"అవునండి" అని వినయంగా ప్రేమరాజు తన సర్టిఫికెట్సు జగపతి ముందుంచేడు.

జగపతి ఓసారి ఒక్కొక్కటే తీసి చూసేడు.

"నీకు మా ఫాక్టరీలోనే ఉద్యోగం ఇస్తున్నాను."

ప్రేమరాజు ఉలిక్కిపడ్డాడు. తననెక్కడికయినా రికమెండు చేసిపంపిస్తాడేమో అనుకున్నాడు కాని తన ఫాక్టరీలోనే ఇంత త్వరగా తీసుకుంటాడని అనుకోలేదు. ఇన్ని మంచి సంఘటనలు ఒకదాని తర్వాత ఒకటి జరగడం అతనికే నమ్మ శక్యంకాకుండా వుంది. సంతోషంలోంచి తేరుకునేసరికి ఓ నిముషం పట్టింది.

"ఏంపని చెయ్యాలండి?"

"పని మాట చూద్దాంలేకాని నెలకు ఆరువందలు జీతం" జగపతి ఇంకా చూపు మార్చలేదు.

"థాంక్యూ వెరీమచ్ సర్!" అని ప్రేమరాజు అన్నాడు కాని జగపతికి థాంక్స్ యెలా చెప్పాలో తెలియనంత కృతజ్ఞతతో నిండి పోయింది ప్రేమరాజు మనసు.

"నువ్వు రేపే వచ్చి డ్యూటీలో చేరవచ్చు."

"అలాగే సార్!"

ఇంక తరువాత యేం మాట్లాడాలో తోచలేదు. మెల్లగా లేవబోయాడు.

"కాని ఒక కండిషను!" జగపతి అన్నాడు.

"ఏమిటి సార్," ఒకటేమిటి వంద కండిషన్సుకు ఒప్పు కుంటానన్నట్లుగా ముఖం పెట్టేడు ప్రేమరాజు.

"ఈరోజు నుంచీ నువ్వు గీతను కలవకూడదు."

ప్రేమరాజుకు కరెంట్ షాక్ తగిలినట్లయింది.

"సార్!" అన్నాడు తెల్లబోతూ.

"నువ్వనుకున్నది దొరికింది కనుక యింక గీతను మరచి పోవాలి."

ప్రేమరాజు ఆనంద శిఖరాలమీదనుంచి తూలిపోయాడు. కల ల్లోంచి బయటికొచ్చేసేడు. జగపతి మనసులోని భావం ఒక మెరు పులా మొదటినుంచి చివరివరకు అర్థమయిపోయింది.

"మీరు నన్ను పొరపాటుగా అర్థం చేసుకున్నారు సార్!" అన్నాడు బాధగా.

జగపతి ఆ మాటలు వినిపించుకోలేదు.

"అంతే కాదు! గీత మరో పెళ్ళికి ఒప్పుకునేటట్లు చెయ్యాలి."

"మేమిద్దరం పెళ్ళి చేసుకోవాలనుకున్నాం సార్!" అన్నాడు ప్రేమరాజు నిస్సహాయంగా.

"ఎంత ధైర్యం నీకు ఆ మాట అనడానికి? జీవితం అంతా ధారవోసి యీ ఆస్థి, హోదా సంపాదించేను. ఇదంతా గద్దలా తన్నుకు పోదాం అని ఆశపడడానికి ఏమిటి నీ అర్హత!...."

జగపతి ముఖంలో ప్రేమరాజుకు అతని నిజరూపం కన బడింది. ఒక్కసారి తనచుట్టూ వున్నదంతా ఓ ఇనుపకోట అని పించింది. లోపలకు తాను వచ్చింది నిజమే! కాని తనకు కావలసింది చేజిక్కించుకొని ప్రాణాలతో బయటకు వెళ్ళడం అసాధ్యం అని పిస్తూంది. మెల్లగా ఒళ్ళంతా చెమటలు పడుతున్నాయి.

"మీ ఆస్థి అంతస్తు నాకు అక్కర్లేదు సార్! గీత కావాలి" ఆ మాటలు తనకే హద్దుమీరుతూన్నట్లు వినిపించేయి.

"నో! గీతనవ్వను. కావలిస్తే మరో రెండు వందలు జీతం ఇస్తాను."

"ఎక్స్క్యూజ్ మి సార్!" ప్రేమరాజు లేచి చెవులు పగిలే హోరు చేస్తున్న యంత్రాల మధ్యనుంచి బయటకు వచ్చేసేడు.

దిక్కు తెలియని ఎడారిమధ్య నిలబడినట్లనిపించింది ప్రేమ రాజుకు. ప్రతిక్షణం గీత తనకు దూరంగా జరిగిపోతూన్నట్లనిపించి నిరాశ మనసంతా ఆవరించుకుంటూంది. ఆమెను తనకు దూరం కాకుండా పట్టుకోడానికే అన్నట్లుగా సైకిలు తీసుకొని తిన్నగా గీత దగ్గరకు వెళ్ళిపోయేడు.

"రాజూ!" చెమటలు కక్కుతూ రొప్పుతూ నిలబడ్డ ప్రేమ రాజును చూసి ఆశ్చర్యపోయింది గీత.

"నీతో ఓ ముఖ్యమైన విషయం మాట్లాడాలి గీతా!" వెంటనే చెప్పకపోతే తరువాత నిముషంలో ఆ అవకాశం కూడా దొరకదేమో నని భయం కలిగింది అతనికి.

"ఏమిటి?"

"నువ్వు నన్ను పెళ్ళి చేసుకుంటావా?"

"ఏమిటిప్పుడు హఠాత్తుగా ఇంత తొందర?"

"మీ నాన్నగారు నాకు నెలకు ఎనిమిదివందల రూపాయల వుద్యోగం ఆయన ఫాక్టరీలో ఆఫర్ చేసేరు....కాని ఈపైన నేను నీతో కలవకూడదనీ, నిన్ను వేరే పెళ్ళికి ఒప్పించాలనీ కండిషన్ పెట్టేరు."

"నువ్వేమన్నావ్?"

"నన్ను అటువంటి ప్రశ్నలడిగి ఇన్సల్ట్ చెయ్యవద్దు. ఐ లవ్యూ! ఐ వాంట్ టు మేరీయూ! కాదనకు గీతా! ప్లీజ్!...."

గీత కొంచెం ఆలోచించింది.

"ఒకే! కాని నాదీ ఓ కండిషను!" అంది.

"ఏమిటది?" బెదురుతూ అడిగేడు ప్రేమరాజు.

"నాకు ఏ షరతులూ వుండకూడదు."

"ఇంకా!"

"నేనిక్కడే వుంటాను. నువ్వే ఈ యింటికి రావాలి."

"మీ డాడీ!...."

"అది నేను చూసుకుంటాను."

"థాంక్యూ! అలాగే."

అని ప్రేమరాజు ఫానుకింద సోఫాలో కూలబడ్డాడు. పోయే శ్వాస దొరికినట్టయింది.

## 12

ప్రేమరాజు ఏమీ తోచక అరగంట నుండి హాలులో పచార్లు చేస్తున్నాడు.

కాళ్ళు లాగుతూన్నట్లనిపించి సోఫాలో కూర్చున్నాడు. ఎదురుగా వున్న మేగజైన్స్ తిరగెయ్యబోయాడు. దృష్టి వాటి మీదకు పోవటం లేదు. వాటిని దూరంగా తోసి బద్ధకంగా ఒళ్ళు విరుచుకున్నాడు. అప్రయత్నంగా దృష్టి ఎదురుగా వున్న కేలెండరు మీదకు పోయింది.

ఆ రోజుకు ప్రేమరాజు పెళ్ళయి సరిగా మూడునెలలయింది. మూడు నెలల జ్ఞాపకం చాలా బాధగా వుంది.

తానేమీ పొందలేకపోయాడు. కలలు కలలుగానే వుండి కోరికలు కోరికలుగానే మిగిలిపోయి మనసును దహించివేస్తున్నాయి. ఎక్కడో ఏదో తీవ్రమైన లోపం వుంది. ఆరాత్రి....ఎన్నాళ్ళనుంచో కలలు కంటూ వస్తూన్న ఆ రాత్రి....గీతను లోపలకు పంపి బయట తలుపు మూసేరు. క్రీమ్‌కలర్ పట్టుచీర, దానికి ముదురు నీలం రంగు అంచు, దానిమీద బంగారు జరీ, అంచురంగులో రైక, పసిమి ఛాయలు వెదజల్లే గీత మెడలో నీలి రాళ్ళతో పొదిగిన నెక్లెస్, అదే రంగు రాళ్ళు పొదిగిన జూకాదుద్దులు, చేతికి రాళ్ళగాజులు, పట్టులాంటి నల్లని కురుల్లోంచి అడుగడుక్కూ వయ్యారంగా కదులుతూన్న మల్లెల మాలలు, అలంకారాలతో అప్పుడే ఆరవిచ్చిన గులాబిలా వుంది గీత.

కొన్ని క్షణాలు తను ఆమె వైపు రెప్పవాల్చకుండా చూసేడు. అంత అందం ఒక మనిషిలో ఉండడం, అది తనకు దొరకడం.... కొంతసేపు అంతా ఒక భ్రమగా తోచింది.

ఎన్నేళ్ళుగానో ఎదురు చూసిన క్షణం వచ్చేసింది. ఊహిం
దానికంటె ఎన్నో అందాలు దిద్దుకొని వచ్చేసింది.

"ఎంత అందంగా ఉన్నావు గీతా!" అన్నాడు ప్రేమగా
ఎదురుగా నిలచి.

"అబ్బబ్బ! పెళ్ళికాదుగాని ప్రాణం తీసేస్తున్నారు. బెల్
బాటమ్, షర్టు వేసుకుంటే హాయిగా స్వేచ్ఛగా వుండేది. ఈ చీ
చుట్టబెట్టి—ఇవన్నీ చూడండి! గంగిరెద్దులా ఎలా తయారు చేసేరో
అంటూ తలలో పూలు తీసిపారేసింది గీత.

"ఉండనీ గీతా! వాటిలో నువ్వెంత అందంగా వున్నావో!

"నాన్సెన్స్! ఉక్కబోసి ఛస్తుంటే!" అని మంచంమీ
ఉస్సురని కూలబడింది గీత. "ఇవ్వేం తలతిక్క ఆచారాలో గా
అగ్నిహోత్రాలంటూ కళ్ళనిండాపొగ! ఇప్పుడిక్కడ ఊపిరాడకుం
....మైగాడ్! పెళ్ళిలో ఇవన్నీ వుంటాయని తెలిస్తే చచ్చినా పెళ
చేసుకోపోయేదాన్ని!" అంది.

"థాంక్ గాడ్! ఇవన్నీ నీకు తెలిసే వుంటే నాకీ అవకాశ
వచ్చేదే కాదు" అని నవ్వుతూ తను ఆమె ప్రక్కనే కూర్చున్నాడు

"దూరంగా కూర్చోండి. నాకసలే చిరాగ్గా వుంది" అంది
గీత దూరంగా జరుగుతూ.

తాను అప్రతిభుడయ్యేడు. ఆమె ముఖంలో విసుగు చూ
ఏమాటా మాట్లాడలేకపోయేడు.

ఆమె క్షణక్షణానికీ తాను ధరించిన వాటిని చూసి విస
క్కుంటూ గదిలో అలమారు తెరచి అందులోంచి ఓ పుస్తకం తీస
కొని మంచం మీదకు ఒరిగింది.

"వరల్డు మువ్‌మెంట్ ఆఫ్ వుమన్స్ లిబరేషన్!" మర
క్షణంలో పుస్తకంలో లీనమయిపోయింది. ఆమె ప్రక్కకు చేరాల
తాను చేసిన ప్రయత్నాలన్నీ విఫలమయ్యేయి. పుస్తకం పక్కకు
పారేసి ఆమె కళ్ళు మూయగానే తాను పక్కకు చేరేడు. మీద
చెయ్యి వేయబోయాడు. కాని భయం వేసింది. పది నిముషాల
తర్వాత ధైర్యం చేసేడు. కాని అప్పటికే గీత నిద్రపోయింది.

చల్లారని వేడితో నరాలు దహించి వేస్తూంటే అలాగే మెకు దగ్గరగా పడుకున్నాడు. ఎప్పుడు నిద్రపట్టిందో తెలియదు.

తెల్లారగానే ఆమె మీద ఉన్న తన చేతిని పక్కకు విసిరేసి ముఖం చిట్లించుకొని గీత లేచిపోవడం మాత్రం తెలుసు.

తాను అర్థంకాని అయోమయంలో పడిపోయేడు. అప్పటి ుంచి ఏదోవిధంగా ఆమెను శారీరకంగా మానసికంగా గెలుచుకో ాలని చూస్తూనే వున్నాడు. ఆలు మగలను గురించి ఏదైనా మాట చ్చేసరికి గీత తలవాచిపోయేటట్లు ఉపన్యాసం ఇచ్చేస్తూంది.

గీతలో దీన్ని తానంత ముందెందుకు చూడలేకపోయేడో ర్థం కావటం లేదు. రోజులు గడుస్తూన్న కొలదీ ఇంట్లో తానో తిధిగా ఉంటూన్నట్లుంది కాని తన వునికి అసలు గీతకేమీ పట్టి ట్లేలేదు. గీత తండ్రి మాత్రం తను ఇటు కనబడితే తల అటు ిప్పుకొనేట్లు ఉంటున్నాడు.

మనసులో అలజడి పెరిగిపోతూంది. అందులోనూ తనకు వేరే వ్యాపకం కూడా ఏమీ లేకపోవడంతో అసలు రోజు గడవడమే ష్టమయిపోతూంది. పోనీ ఏ పుస్తకాలయినా చదువుతూ కూర్చుందా మనుకుంటే గీత పుస్తకం పేజీల్లో కనబడుతుంది. లేచి ఆమెదగ్గర ెడితే ఆమె సాధించలేని సమస్యగా అలాగే వుండిపోయింది.

ఆ సమయంలోనే తనకు ఐ.పి.యస్.లో సెలెక్షన్ గావడం గొప్ప వుపశమనంగా భావించాడు.

ఆ విషయం తెలుసుకొన్న గీత సంతోషించి హృదయ పూర్వకంగా అభినందించింది ప్రేమరాజును.

"పోస్టింగ్ ఇక్కడే కాని ముందు కొన్నిరోజులు ట్రైనింగ్‌కు వెళ్ళాలి.... కాని అన్నిరోజులు నిన్నువిడచి వుండడం ఎంత కష్టం గీతా?" అన్నాడు ప్రేమరాజు.

"ఏమిటి పిచ్చిమాటలు? మీరేం పసిపిల్లలా?" అన్న గీత మాటలు విని నిర్ఘాంతపోయేడు ప్రేమరాజు.

# 13

మేనేజరు కేబిన్‌లోంచి ఫైల్స్ రవి టేబిల్ మీద కొచ్చేయి.

ప్రతి ఫైల్‌మీదా మేనేజరు ఆర్డర్స్‌చూసి వాటిని క్లర్కుకి పంపించేవ
రవి. మేనేజర్ "ప్లీజ్ స్పీక్" అని వ్రాసిన ఎటుజడ్ ప్లాస్టిక్
లిమిటెడ్ ఫైల్ తీసుకొని సీటులోంచి లేచి అప్పుడే ఎవరో బయ
పార్టీ కేబిన్ లోపలకు వెళ్ళడం చూసి తరువాత వెడదామని మళ్ళీ
సీటులో కూర్చున్నాడు రవి.

విలియమ్స్ మేనేజరుగా వచ్చినప్పటినుంచీ రవి ప్రాముఖ్య
చాలా పెరిగింది. విలియమ్స్‌ను మొదటిసారి చూడగానే రవికి అత
మీద గౌరవం కలిగింది. మనిషి చాలా ఎత్తరి. పచ్చగా వుంటాడు
నోట్లో ఎప్పుడూ పైపు వుంటుంది. పైపు వెనుక ఎప్పుడూ చిర
నవ్వు వుంటుంది. ఎంతో మర్యాదగా మాట్లాడుతాడు. తన క్రిం
ఆఫీసర్స్‌ను కూడా తనతో సమానులుగాచించి ఎప్పుడూ జోక్స్
వేస్తూ సరదాగా వుంటాడు.

వచ్చినరోజే 'ఎడ్వాన్సెస్ డిపార్టమెంట్' స్టాఫ్‌ను అందరినీ
పిలిచి "ఇది నాపెట్ డిపార్ట్‌మెంటు. ఎందుకో తెలుసా?" అన్నాడు

"ఎందుకంటే బ్యాంకు ఆదాయం అంతా, మనందరి జీతాలు
జీవితాలూ, సంసారాలూ అన్నీ దీనిమీదే ఆధారపడి వున్నాయి
అందుకని—" అని తనే అన్నాడు. అని తరువాత "నీ ముఖం
చూసి చెప్పగలను. నువ్వు చాలా ఎఫిషెంట్ బాంకర్ వని." అని
రవి భుజం తట్టేడు. రవి కెంతో వుత్సాహం కలిగింది.

కేబిన్‌లోకి వెళ్ళిన మనిషి బయటకు రావడంచూసి రవి ఫైల్
తీసుకొని లోపలకు వెళ్ళేడు.

"గుడ్‌మార్నింగ్ సర్."

"గుడ్‌మార్నింగ్. ప్లీజ్ టేక్ యువర్ సీట్."

"దిసీజ్ ఎ టు జడ్ ప్లాస్టిక్స్ లిమిటెడ్ సర్." అన్నాడు
రవి ఫైలు తెరచి ముందుపెట్టి.

"ఏమిటి నీ రికమెండేషన్." అన్నాడు విలియమ్స్ ఫైల్
చూడకుండానే.

"లక్ష రూపాయలు ఎడ్వాన్సుకు అప్లై చేసేరు. స్మాల్‌స్కేల్
ఇండస్ట్రీస్ కింద ప్లాస్టిక్ ఇండస్ట్రీ వర్కింగ్ కేపిటల్ కోసం డబ్బు

అడిగేరు. ఇది పార్ట్నర్‌షిప్ ఫర్మ్‌గా చెప్పేరు. కాని డీడ్ సరిగాలేదు. అందులోనూ వీళ్ళు ప్రపోజ్‌చేసిన స్కీమ్ కూడా ఫీజిబుల్‌గాలేదు. ఫర్ ఎగ్జామ్పుల్...."

"రవీ! అంత కోడిగుడ్డుకు ఈకలు పీకినట్లు ఎనలైజ్‌చేస్తే ఎలాగయ్యా! నువ్వూ నేనూ బాంకర్స్ కానివాళ్ళు కాదుగా! ఏ ఆకారంలో చూపిస్తే మనం ఒప్పుకుంటామో వాళ్ళకు తెలియకపోవచ్చు! బీ లిబురల్ యంగ్‌మాన్! ఈ ఇండస్ట్రీవల్ల వచ్చే జాబ్ పొటన్షియల్ చూడు! నలుగురికి వుద్యోగాలు దొరుకుతాయి! ఇకముందు నువ్వు మనడబ్బు సేఫ్టీతోపాటు సొసైటీ, కంట్రీస్ వెల్ఫేర్ కూడా చూడాలి!...." అని పైపు అంటించేడు విలియమ్స్.

"కాని సర్...."

"ఐనో! నీలాంటి సిన్సియర్ బాంకర్‌ని ఒప్పించకుండా బిజినెస్ చెయ్యడం నాకూ ఇష్టంలేదు! ఎనీవే దాన్ని ఇలా రిజెక్టు చెయ్యడం నా కిష్టంలేదు! సాయంత్రం నేను అటువైపే వెడుతున్నాను! నేనోసారి ఇనస్పెక్టు చేసివస్తాను! అన్నీ సరిగావుంటే వాళ్ళు బ్యాంకుకు కావలసిన విధంగానే ఫార్మ్స్ నింపి ఇస్తారు. మరీ మనం స్టాండర్డ్స్ ప్రకారం ఫర్మ్ లేకపోతే మనం వాళ్ళు అడిగినంత కాకుండా ఎడ్వాన్సు తగ్గించి ఇయ్యవచ్చు!...."

మర్నాడు విలియమ్స్ ఇనస్పెక్షను రిపోర్ట్ తైపు చేయించి సంతకంచేసి రవి కిచ్చేడు.

"నువ్వు కూడా సంతకం చెయ్యి! చిన్న ఫర్మ్‌కు నేను ఇనస్పెక్షను రిపోర్టు ఇస్తే అంతా బాగుండదు!" అన్నాడు విలియమ్స్.

"ఒకేసార్!" అని రవి కేసంతా మళ్ళీ పరీక్షచేసి ఎడ్వాన్సు యాభై వేలకు తగ్గించేడు.

పదిరోజుల తర్వాత ఎటుజడ్ ప్లాస్టిక్స్ పార్ట్నర్ సురేంద్ర కుమార్ సీటుదగ్గరకొచ్చి పార్టీకి రమ్మని పిలిచేడు. రవి రాలేనన్నాడు. అతను ఎంత బ్రతిమాలినా వినిపించుకోలేదు.

మరో అరగంట తర్వాత తన దగ్గరకొచ్చిన విలియమ్స్‌ను

చూపి లేచి నిలబడ్డాడు రవి. ప్రక్కనే సురేంద్రకుమార్ వున్నాడు.

"కమాన్ రవీ?" అన్నాడు విలియమ్స్.

"సర్? నాకు కొంచెం...." అని రవి నసుగుతూంటే, "కమాన్ యంగ్‌బోయ్? ఈవేళ వాళ్ళ ఇండస్ట్రీ ఇనాగరేట్ చేస్తున్నారు. లెటజ్ విష్ దెమ్ గుడ్‌లక్? నేనే ప్రక్కనున్నప్పుడు నువ్వు హెజిటేట్ చెయ్యనక్కర్లేదు. కమాన్ క్విక్?" అని తాను ముందుకు నడిచేడు. సురేంద్రకుమార్ ఎంతో మర్యాదగా వంగి వెనుకకు నిలబడివుండగా రవి చేసేదిలేక విలియమ్స్ వెనకాలేనడిచేడు.

ఆ రోజు రవీ సరోజల పెళ్ళిరోజు. సరోజ ముస్తాబుచేసుకొని రవికోసం ఎదురుచూస్తూంది. ఆఫీసునుంచి తొందరగా పెర్మిషను తీసుకొని వచ్చేయమంది. తొందరగా రాలేదు సరికదా ఆఫీసు టైము దాటిపోయి కూడా గంట కావస్తూంది.

బయట విరిసిన వెన్నెల. తలలో మల్లెపూలు గుబాళిస్తున్నాయి. సినిమా పోతేపోయింది. రవి ఇప్పుడైనావస్తే ఓ గంట సేపు ఇలా వెన్నెల్లో టాంక్ బండ్‌మీదనైనా సరదాగా తిరిగి రావచ్చునని ఎదురుచూస్తూంది సరోజ. ఎదురుచూస్తూనే నిద్రపోయింది.

తలుపు చప్పుడువిని సరోజ కళ్ళు తెరచింది.

రవి అప్పుడేవచ్చి షూస్ విప్పుకుంటున్నాడు. సరోజ దగ్గరగావచ్చి "ఇంత ఆలస్యమయింది? ఎక్కడికి వెళ్ళేరు?" అని అడుగుదామనుకుంటూంటే రవి దగ్గర డ్రింక్స్ వాసన తగిలింది. నోట్లో ప్రశ్న నోట్లోనే వుండిపోయింది. తొందరగా రమ్మని వుదయం గుర్తుచేసినా రాత్రి ఇలా రావడంతో మనసు చివుక్కుమంది.

అయినా బలవంతంగా చిరునవ్వు తెచ్చుకొని "రండి? అన్నం వడ్డిస్తాను" అని వంటింట్లోకి నడుస్తూ "నా కిప్పుడు ఆకలిగాలేదు. ఏం తినలేను సరూ?" అన్న రవి మాటవిని అలాగే నిలచిపోయింది. మనసులో కొద్దిగా కోపం వస్తూంది. ప్రయత్నించి మెల్లగా పక్కకు నెట్టేసింది. తనకుకూడా తిన బుద్ధికాలేదు. అయినా ఆ రోజు అలిగి భోజనం మానేయకూడదని కొంచెం ఎంగిలి పడబోయింది. కాని

ఏమీ లోపలకుపోలేదు. అలాగే గిన్నెలు మూతపెట్టేసి ఒక ప్లేటులో ఆ రోజే ప్రత్యేకంగా చేసిన స్వీట్ తీసుకొని రవి దగ్గరకొచ్చింది.

"అయామ్ రియల్లీ సారీ సరూ! అనుకోకుండా ఒక చోటికి వెళ్లవలసి వచ్చింది" అన్నాడు రవి స్వీట్ ఒక ముక్క తుంచి నోట్లో పెట్టుకుంటూ.

సమాధానంగా మళ్లీ ఓ బలవంతపు చిరునవ్వు పెదవులమీదకు తెచ్చుకోవడంకంటె ఏమీ చెయ్యలేకపోయింది సరోజ.

# 14

రాత్రి పదకొండు దాటింది. రవికోసం ఎదురుచూస్తూ కూర్చున్న సరోజ అడుగెక్కడపడుతూందో తెలియనంతగా తూలుతూ తన వైపు వస్తూన్న రవిని నిశ్చేష్టురాలై చూస్తూ నిలబడిపోయింది. ప్రక్కనుంచి రవి వెడుతూంటే వాసన గుప్పుమంది. అటూ ఇటూ అడుగులేసుకుంటూ ఎలాగో ఇంట్లోకి వచ్చి సోఫాలో కూలబడ్డాడు. షూలేసెస్ విప్పుకుందామనేమో ఒంగుని చేత్తో ఏదో తడుము తున్నాడు గాని ఆ కొస చేతి కందటంలేదు.

సరోజ తనువెళ్ళి లేసెస్ విప్పి షూస్ తీసిందో లేదో రవి భళ్ళున వాంతి చేసుకున్నాడు. అది తన చీరంతా చిందింది. భరించ లేని దుర్వాసనతో సరోజకు వాంతి వచ్చినంత పని అయింది.

మామూలుగా ఎప్పుడూ ప్రసన్నంగా వుండే రవి ముఖాన్ని మూసుకుపోతూన్న కళ్ళతో నోట్లోంచి తీగలు తీగలుగా కారుతూంటే చూడలేకపోయింది. ఇప్పుడు తానేం చెప్పినా రవి అర్థంచేసుకొనే స్థితిలో లేడని మరోదారిలేక మెల్లగా తువ్వాలుతో మూతి తుడిచి తీసుకెళ్లి మంచంమీద పడుకోబెట్టింది. ఇల్లంతా శుభ్రంచేసి తన చీర మార్చుకొని మంచం దగ్గర కెళ్ళేసరికి రవి తల ఇటూ అటూ తిప్పుతూ ఏదో గొణుగుతున్నాడు. సరోజ ప్రక్కన కూర్చోగానే ఒడిలో తలపెట్టి నడుముకు రెండు చేతులుచుట్టి పడుకున్నాడు.

సరోజకు మనసంతా కెలికినట్లయింది. కళ్లల్లో వత్తులు పెట్టు కొని అలాగే కూర్చుంది.

తెల్లారేముందు సరోజకు కాస్త కళ్ళు మూతలు పడ్డాయి.

తిరిగి కళ్ళు తెరిచేసరికి రవి ప్రక్కనే మంచంమీద పడుకొని వున్నాడు. అప్పుడే తెల్లవారినట్లుంది. రవి ఆమె కళ్ళల్లోకే చూస్తున్నాడు.

సరోజ రెప్ప వాల్చకుండా అతనివైపే చూసింది. కాని ఏమీ మాట్లాడలేదు.

"అయామ్ వెరీ సారీ సరూ!" అని రవి ఆమె ముఖంలోకి చూడలేక చూపు మరల్చేడు.

సరోజ ఏదో మాట్లాడాలనుకుంది. కాని మాట గొంతుదాటి రాలేదు. గొంతు బిగిసిపోయినట్లనిపించింది. అప్రయత్నంగా కళ్లలో నీళ్ళు నిండేయి. రవిచేసిన పనికి అటువంటి భావం చూపించడం సరోజకు ఇష్టంలేదు. వెంటనే తల రెండో ప్రక్కకు తిప్పుకుంది.

"ఇంకోసారి ఇలా ఎన్నడూ జరగనియ్యను సరోజా! ప్లీజ్ ఎక్స్‌క్యూజ్‌మి!" అన్నాడు రవి మళ్ళీ.

సరోజ తనను తాను కొంత స్వాధీనంలోకి తెచ్చుకుంది.

"చక్కగా చదువుకొని బ్యాంకులో ఆఫీసరుగా పనిచేసే మీరు మీ ఒళ్ళు మీకు తెలియని స్థితిలో ఇంటికి రావడం చూసే వాళ్ళకూ నాకూ ఎలా వుంటుందో ఊహించుకోండి!" అంది.

"ఇంకోసారి జరుగనియ్యనన్నానుగా!" రవి నచ్చచెప్తూన్నట్లుగా అన్నాడు.

"అదే నేనూ ఆశపడుతూన్నది.... లేచి ముఖం కడుక్కోండి! కాఫీ తీసుకువస్తాను" అని పక్కమీదనుంచి లేచింది సరోజ.

సరోజ ఆశించినట్లు జరుగలేదు.

రవి అప్పుడప్పుడు తన సరదాలు మానలేకపోగా సరోజకు పట్టుబడకుండా వుండడానికి ప్రయత్నించేవాడు. పైగా వీలయినప్పుడల్లా ఆఫీసులో ఒక బాధ్యతగల ఆఫీసరుగా పనిచేసేటప్పుడు అది మనసుమీద కలుగజేసే ఒత్తిడి, ఏ వినోదం ద్వారానో ఆ ఒత్తిడి నుండి పొందవలసిన విడుదల.... వీటినిగురించి తరచుగా సరోజతో మాట్లాడడం మొదలు పెట్టేవాడు. రవి వాదనలో నిజానిజాలు ఎలా వున్నా తన బలహీనతలను భార్యనుండి దాచుకోడానికి ప్రయత్నిం

చడం దానికోసమని ఏవేవో వుపన్యాసాలు చెప్పడం నచ్చలేదు సరోజకు. అయినా గత్యంతరంలేక ఆ మాటల సందర్భంలోనే రవిలో వస్తూన్న మార్పు దృష్టిలో పెట్టుకొని వాదించేది సరోజ.

క్రమంగా సరోజ రవి అలవాట్లమీద ఏ విధంగా మాట్లాడినా విసుక్కోవడం మొదలుపెట్టేడు రవి.

రోజులు గడిచినకొలదీ రవి ఇంటికి కొంత ఆలస్యంగా రావడం అలవాటూ అయిపోయింది. అప్పుడప్పుడు కాస్త మోతాదు మించి తీసుకొని అదొక ఆలోచించవలసిన విషయంకూడా కాదన్నట్లుగానే ప్రవర్తిస్తున్నాడు రవి.

ఇన్నిరోజులూ కూడా సరోజ వాటిని ఎంత సహించినా ఏమాత్రం ఒప్పుకోలేకపోయింది. కాని ఏదో ఓరోజు రవి తన పొరపాటును తెలుసుకొనేలా చెయ్యాలనే తపన పెరుగుతూనేవుంది. కాని వుపాయం మాత్రం తోచటంలేదు. తనపట్ల రవి మనసులో ఎటువంటి విరోధభావం కలుగకుండా వుండాలనే వుద్దేశ్యంతో మనసులో అలజడినంతా లోపలే దాచుకొని పైకి ఏమీ జరుగనట్లుగానే ఎప్పటిలాగే వుండాలని నిశ్చయించుకుంది. దానిని రవి అలుసుగా తీసుకున్నాడు. దానికి దృష్టాంతం సరోజకు ఆ రాత్రి కనబడింది. రవి ఏదో పార్టీకెళ్ళి రాత్రి ఆలస్యంగా వచ్చేడు. పార్టీ ప్రభావం మనిషిని వదలలేదు. హుషారుగా వున్నాడు. సరోజ ప్రక్కనే పక్కలో పడుకొని తానప్పుడే చూసివచ్చిన కేబరేడ్యాన్సు వర్ణించడం మొదలుపెట్టేడు. ఆ అమ్మాయి ఎలా గంతులేసిందీ, ఎలా కన్ను కొట్టిందీ, ఎలా బట్టలు విప్పిందీ, అవయవాలు ఎలా ప్రదర్శించిందీ ఆమెలో ఏమేమి అందాలు తనకు నచ్చిందీ తన మనసులో ఎటువంటి వుద్రేకాలు చెలరేగిందీ....అవన్నీ వింటూన్న సరోజకు తను సాధించవలసిన సమస్య చేయి దాటిపోతూందేమోనని • భయం కలిగింది.

రవి వాగి వాగి సరోజను ఆక్రమించుకొని శరీరంలోని వేడి చల్లార్చుకున్నాడు. మరుక్షణంలో నిద్రపోయాడు. ఉన్నట్లుండి సరోజకు పెళ్లినాటి రాత్రి హాస్టలు వార్డెను ఉషామెహతా మాటలు

గుర్తుకొచ్చేయి. అవును! తమ వివాహ జీవితంలో సుఖం ఆవిరి అయిపోతూందా! అది నిలబెట్టుకొనే కళ తనకులేదా? ఏంచెయ్యాలి తను! రవిని పూర్తిగా తనవైపు ఎలా ఆకట్టుకోవాలి? ఇవే ప్రశ్నలు సరోజ మెదడును దొలచడం మొదలుపెట్టేయి.

## 15

సరోజ యూనివర్సిటీ హాస్టలుకు బయలుదేరింది. చాలా రోజుల తర్వాత యూనివర్సిటీ పరిసర ప్రాంతాలు చూస్తూంటే మనసులో అవ్యక్తమైన వుపశమనం కలిగింది. జనసమ్మర్దం తక్కువగా వున్న రోడ్లూ, రోడ్లకు రెండువైపులా ఏపుగా ఎదిగిన చెట్లూ మనసులోని ప్రశాంతతకి ప్రతిబింబంగా వున్నాయి.

సరోజ వార్డెను ఇంటిముందు కొచ్చింది. కాంపౌండులో వున్న చెట్లు అయిదు సంవత్సరాల కాలగమనాన్ని గుర్తుచేస్తున్నాయి.

సరోజ కాంపౌండ్ లోపలకివెళ్లి కాలింగ్‌బెల్ నొక్కింది.

బెల్ నొక్కుతూనే అనుకోకుండా కర్టెన్ సందులోంచి కనబడిన దృశ్యం చూసి చకితురాలయింది.

వార్డెన్ వుషామెహతా సోఫాలో వెల్లకిలా ఎవరి ఒడిలోనో పడుకొనివుంది. పైటతొలగిన ఆమె హృదయంపై వాచీ పెట్టుకొని రోమాలతో నిండిన ఓ బలమైన చెయ్యి కనబడింది.

బెల్ చప్పుడుకు ఆమె వులిక్కిపడి లేచింది.

సరోజ చాలా ఇబ్బందిగా ఫీలయింది. తాను బెల్ నొక్కడం ఆ దృశ్యం కంటబడడం ఒక్కసారిగా జరిగిపోయింది. ఉషామెహతా మీద అప్పటిదాకా వున్న గౌరవం కాస్తా ఎగిరిపోయింది. వెంటనే వెనుదిరిగి వెళ్ళిపోవాలనిపించింది. కాని ఆవిడ లేవడం చూసి వెళ్ళిపోతే బాగుండదని ఏంచేయలేక నిలబడిపోయింది.

ఇంతలో కర్టెను తప్పించుకొని ఉషామెహతా రానేవచ్చేసింది.

"ఎవరు?....ఓ! సరోజా! నువ్వా! వాటే సర్‌ప్రైజ్! ప్లీజ్ కమిన్!...." అంటూ పిలిచింది.

సరోజ ఎలాగో చిరునవ్వు పెదవులమీదకు తెచ్చుకొని లోపలకు వెళ్ళింది. ఆ గదిలో వేరే ఎవరూ కనబడలేదు.

సరోజను సోఫామీద కూర్చోమని ప్రక్కనే ఉష కూర్చుంది.

సరోజ కాపురాన్నిగురించి ఎన్నో ప్రశ్నలడిగింది. ఆమెతో వీలయితే కొన్ని ఆంతరంగిక విషయాలు ముచ్చటిద్దామని సరోజ వచ్చినా ఇప్పుడెందుకో చెప్ప బుద్ధికాలేదు. ఏదో కప్పదాటుగా జవాబులు చెప్పింది.

తర్వాత ఉష, సరోజ స్నేహితురాళ్ల కొంతమందిని గురించి తనకు తెలిసిన వివరాలు చెప్పింది. మిగిలిన వాళ్ళనుగురించి సరోజను అడిగింది. కొత్త అమ్మాయిలను గురించి కొన్ని ఆసక్తికరమైన విషయాలు చెప్పింది.

ఇవన్నీ మాట్లాడుతూంటే సరోజ ఆమె ముఖంమీద కనబడిన నిర్మలత్వం చూసి ఆశ్చర్యపోయింది. కొంతసేపయ్యేక వెళ్ళిపోతానని సరోజ లేవబోతే చాలా రోజుల తర్వాత వచ్చేవు కూర్చోమని బలవంతంచేసింది. తన రహస్యం ఎక్కడ బయటపడుతుందోనన్న ఆందోళనైనా లేకుండా కూర్చోమని ఎలా బలవంతం చేస్తూందో అనుకుంది సరోజ. ఇన్ని మంచి మాటలు మాట్లాడి ఇంత ఆదర్శ ప్రాయంగా కనబడే మనుష్యులు కూడా బలహీనతలకిలా బానిసలయిపోతారా! ఏమిటీ ప్రపంచం! ఏ సానుభూతికోసం సరోజ ఇక్కడికి వచ్చిందో ఆ ధ్యాస అపుడే అంతర్ధానమయింది. దాని స్థానే జుగుప్స చోటు చేసుకుంది. అరగంట తర్వాత ఉష కాఫీ కలుపుకొస్తానని లోపలకు వెళ్లింది. సరోజకు అప్పటికే వచ్చి ఎన్నో గంటలయినట్లుంది.

తిరిగి కాఫీ కప్పులతో వచ్చినప్పుడు ఉషతో కూడా ఒకాయన వచ్చేడు. వయసు నలభై అయిదు వుంటుంది.

"సరోజా! మీట్ మై హజ్‌బెండ్ సురేష్‌మెహతా!" అంటూ పరిచయంచేసింది ఉష. సరోజ నిర్ఘాంతపోయింది. ఆవిడ మాటలు నమ్మడానికి కొంత సైము పట్టింది.

కాఫీలు తాగడం అయిన తర్వాత ఆయన బయటకు వెళ్ళి వస్తానని వెళ్లిపోయేడు.

సరోజ మనసులోవున్న సందేహాన్ని దాచుకోలేక అడిగేసింది.

"కొన్నాళ్ళు ఈయన మీకు దూరమయ్యేరు కదూ!"

"అవును."

"మరి?...."

"అది నా అదృష్టం సరోజా! అయామ్ రియల్లీ హాపీ నౌ!" ఉష ముఖంలో ఎంతో సంతృప్తి కనబడింది.

సరోజ అప్పటివరకూ తన మనసులో కలిగిన అనుమానాలకు బాధపడింది. అది బయటికి చెప్పకుండా వుండిలేకపోయింది.

"డోంట్ వర్రీ! పరిచయంలేనప్పుడు అంతకంటె మరోలా మరెవరైనా ఎలా అనుకోగలరు?" అంది ఉష.

సరోజకు ఆవిడ అనుభవంలో తన సమస్యకు కూడా పరిష్కారం వుందనిపించింది.

"కావాలని మీకు దూరమైన మనిషి తిరిగి ఇంత దగ్గరగా ఎలా వచ్చేరు మేడమ్!" అని అడిగింది.

ఆవిడ చెప్పడానికి ఆలోచిస్తూన్నట్లు కనబడింది. అప్పటిదాకా ఏదో తన ఆదుర్దాలో ఆవిడకు చాలా వ్యక్తిగతమైన విషయాలు అడుగుతూన్నట్లు స్ఫురించలేదు సరోజకు.

సరోజ అంది. "ఇవి మీ వ్యక్తిగత విషయాలనుకోండి.... అసలు ఈ రోజు నేను మీ దగ్గరకు రావడంలో ఉద్దేశ్యం చెప్తాను.... నా పెళ్ళినాడు మీరన్నారు మేడమ్!....ప్రపంచంలో చాలా తొందరగా హరించిపోయే వస్తువు దాంపత్య జీవితంలో సుఖం....అని! ఆ మాటలు నాకు బాగా గుర్తుండిపోయాయి. అలా ఆవిరికాకుండా చూసుకోగలగడం ఒక కళ అన్నారు. అది దేవుడు అందరికీ ప్రసాదించలేదన్నారు!....ఇప్పటికి మా పెళ్లయి అయిదు సంవత్స రాలయిపోయింది. మీ మాటలు మా విషయంలో కూడా నిజమవు తున్నాయేమోనని భయంగావుంది మేడమ్!....ఏంచెయ్యాలో తోచక ఓసారి మిమ్మల్ని కలిసిపోవాలనిపించి వచ్చేను. ఆ ఆదుర్దాతోనే అడిగేను మేడమ్! మరోలా అనుకోవద్దు!"

"అదేంలేదు సరోజా!....మనుషులు సుఖంగా వుండే పద్ధతి ఒకటేకాని అలాలేకుండా వుండడానికి కారణాలు ఎన్నయినా

వుండొచ్చు అన్నాడు లియోటాల్‌స్టాయ్. అలాగే మీ సుఖం హరించి పోవడానికి కూడా ఏదో కారణం వుంటుంది. నా అనుభవాన్ని నేను నీకు చెప్తాను. అది ఒకవేళ నీకు సహాయపడితే చాలా సంతోషం.

"మాది ప్రేమవివాహంకాదు. ఏర్పాటుచేసిన పెళ్ళి. పెళ్ళి కాకముందు అందరిలాగే నేనూ ఎన్నో కలలుకన్నాను. నాకు రాబోయే మనిషి ఎలా వుండాలో ఎన్నో చిత్రాలు ఊహించుకున్నాను. కాని ఇటువంటి విషయాల్లో మన ఊహలకు ప్రాణం రాదుగా! అందుకని పెళ్ళయిన తర్వాత నా ఊహాచిత్రాలన్నీ ఆయనలోనే చూడడానికి ప్రయత్నించేను. మా సంసారంలోనే నా కలలన్నీ తీర్చుకోడానికి ఉత్సాహపడ్డాను. కొన్నాళ్ళు మేము సుఖంగా ...చాలా సుఖంగా వున్నాము. కాని దురదృష్టవశాత్తూ....ఆయన క్రమంగా నాకు దూర మవుతూ వచ్చేరు. కారణం అనేది స్పష్టంగా ఏదీ లేదేమో! మనిషి మార్పును కోరడం స్వభావం అనుకుంటాను. కాని దాంపత్యం విష యంలో మనం సంఘజీవితం గుర్తుపెట్టుకున్నపుడు దాన్ని బలహీన తగా ఎంచవలసివస్తుంది. ఆ బలహీనత కొంత అవగాహనతో తప్ప పోగొట్టుకోవడం కష్టం. కాని పోగొట్టుకోవాలి. ఎందుకంటే అందరూ అదే మార్పుకోరితే ఏమవుతుంది! ఈ మార్పు కోరడానికి అంతం ఎక్కడ! ఆలోచించాలి. కాని ఆలోచించని వాళ్ళకు ఎలా చెప్పాలి?

అంతకుముందు నాలో ఆయనకు ఏవి ఆకర్షణీయంగా కన బడ్డాయో అవే క్రమంగా ఆయన చికాకుకు కారణమయ్యాయి. నేను ఎంతో మధనపడిపోయేదాన్ని. రాను రాను రోజూ ఇంట్లో ప్రతిచిన్న విషయానికి వాగ్వివాదాలు! పోట్లాటలు! నేను బ్రతిమాలుతూన్న కొద్దీ ఆయన ఇంకా దూరమైపోతున్నారు! ఒక్కసారి జరిగిన సంఘటన లనీ వాటిలో నా పాత్రనీ సింహావలోకనం చేసుకున్నాను. నేను చెయ్యాని నేరాలకు ఆయన వెనకాలపడి ప్రాకులాడడం తప్ప మరే నేరమూ చెయ్యాలేదనిపించింది. ఆ రోజునుంచి ఆయన చేసే పొర పాట్లకు నేనేదో తప్పుజేస్తున్నట్లు బాధపడుతూండడం అనవసరమని పించింది. కాని మనసులో కసి, ప్రతీకారవాంఛ పెరుగుతూండేవి. వాటిని మొదట్లో జయించడం చాలా కష్టమయింది. ఏమయినా నాకే

నేను మంచిపనే చెయ్యాలికాని ఉద్రేకంతో ఏ పనీ చెయ్యకూడదను కున్నాను. క్రమంగా అది నాకు చాలా శక్తినిచ్చింది. నా జీవితం నేను వీలయినంత చేతనయినంత నిండుగా జీవించదలచుకున్నాను. అప్పుడే ఇక్కడ ఉద్యోగం వచ్చేక ఇలా వచ్చేసేను. ఆయనను నేను యిద్దరి మధ్యా సంబంధాలు ఎలా వున్నా ఎప్పుడూ కించపరచడానికి ప్రయత్నించలేదు. మొదటి నాలుగైదు సంవత్సరాలు మా యిద్దరి మధ్యా ఉత్తర ప్రత్యుత్తరాలు లేవు. బహుశా తరువాత ఆయనకు పరిచయమైన మనుషులందరిలో నేనే ఉత్తమురాలినయ్యేనేమో.... చివరకు....ఈనాటికి నాకు దూరమయిన దానికి పదిరెట్లు వేగంతో నా దగ్గరకు వచ్చేరు. ఆయన సరిహద్దులు ఆయనకు తెలిసివచ్చేయి!.... అదంతా గతం!....ఇప్పుడు ఆయన నన్నెంతో గౌరవిస్తారు! నేను చాలా సంతోషంగా వున్నాను సరోజా!...."

ఉషామెహతా గొంతు రుద్ధమైంది. పెదవులమీద చిరునవ్వు మెరుస్తూండగానే కళ్ళల్లో కన్నీళ్ళు మెరుస్తున్నాయి.

సరోజకు ఆవిడ తన మనసులో మాటలే చెప్తూన్నట్లని పించింది. ఆవిడ అనుభవం కొత్త ఆత్మవిశ్వాసాన్ని సృష్టించింది.

"కంగ్రాచ్యులేషన్స్ మేడమ్. వస్తాన్నేను. నన్నింత ఆత్మీయు రాలిగా భావించి ఇన్నిమాటలు చెప్పినందుకు థాంక్స్!" అని లేచింది సరోజ.

"విష్‌యూ గుడ్‌లక్! మళ్ళీ ఎప్పుడైనా కలుస్తూంటావు కదూ!" అంది వార్డెన్.

"తప్పకుండా." అంటూ బయటికి నడిచింది సరోజ.

సరోజ ఇంటికి రాగానే "నీకోసం ఎవరో ఒకతను వచ్చి వెళ్ళేడు." అంది కమలాదేవి.

"ఎవరు?....పేరు అడిగేరా?" అంది సరోజ.

"అడిగేను. కాని అతను దానికి జవాబు చెప్పలేదు. ఓ అర గంటలో మళ్ళీ వస్తానని వెళ్ళిపోయేడు....కాకీ యూనిఫారమ్‌లో వున్నాడు."

సరోజ ఎంత ఊహించినా ఊహకెవరూ అందలేదు—కొంత

సేపటి తర్వాత బట్టలు మార్చుకొని పూలకుండీల్లో నీళ్ళు పోస్తూంటే మోటారుసైకిలు చప్పుడయింది.

"అతను వచ్చేడు" అంది కమలాదేవి వీధిలోకి చూస్తూ.

సరోజ వీధి గుమ్మంలోకి వచ్చింది.

అతను ఆరడుగుల మనిషి. పోలీసు ఆఫీసరు యూనిఫారంలో వున్నాడు. కోరమీసం....సరోజ హఠాత్తుగా గుర్తుపట్టింది.

"హలో ప్రేమరాజుగారా! వెంటనే గుర్తుపట్టలేకపోయాను సుమా! ఇందాకా వచ్చింది మీరేనా?" అంది ఆశ్చర్యంతో.

"అవునండీ" ప్రేమరాజు నవ్వుతూ మోటారుసైకిలు స్టాండు వేసి ముందుకొచ్చేడు.

"ఇదేమిటి! స్టేజిమీదే కాకుండా రోడ్డుమీద పగటి వేషాలు కూడా మొదలుపెట్టేరేమిటి?" అంది సరోజ అతని యూనిఫారం వైపు ఎగాదిగా చూసి మీసంమీద దృష్టినిలిపి.

"ఇది పగటివేసం కాదు. అసలు వేషమే. మీసంకూడా." అన్నాడు ప్రేమరాజు నవ్వుతూ.

"దెన్ కంగ్రాచ్యులేషన్స్! లోపలకురండి" అని సరోజ లోపలకు దారితీసింది.

పది నిముషాలు పరస్పరం కుశలప్రశ్నలయిన తర్వాత సరోజ అంది, "అవును! ఇన్ని సంవత్సరాల తర్వాత ఇంత హఠాత్తుగా గుర్తుకొచ్చేనేమిటి?" అని.

"అదే నేనూ చెప్పబోతున్నాను. నేను ఓ అరగంట మీతో ఒక ప్రత్యేకమయిన విషయం గురించి మాట్లాడాలి. అప్పాయింట్ మెంట్ తీసుకుందామని వచ్చేను" అన్నాడు ప్రేమరాజు.

"నా మటుకు నే నెప్పుడూ సిద్ధమే. ఇప్పుడుకూడా...." అంది సరోజ ప్రేమరాజు చెప్పబోయే విషయాన్ని గురించి ఊహించడానికి ప్రయత్నిస్తూ.

"థాంక్యూ వెరీమచ్! అయితే ఇప్పుడే చెప్తాను" ప్రేమరాజు ఎగిరి గంతేసేడు.

"ఇప్పుడే అంటే ఓ కప్పు టీ తాగిన తర్వాత...." అంటూ

సరోజ లేచివెళ్ళి బిస్కెట్లూ, టీ తీసుకొని వచ్చింది. అప్పటికి ప్రేమ రాజు ముఖంలో తీవ్రమయిన భావం చోటు చేసుకోవడం గమనిం చింది.

ప్రేమరాజు మొదలుపెట్టేడు.

"నేను చెప్పబోయేది మీకేమాత్రం సంబంధంలేనిది. నాకు మరో గత్యంతరం లేక ఆఖరు ప్రయత్నంగా మీ సలహాకోసం వీలయితే సహాయంకోసం వచ్చేను. అందుచేత దయవుంచి కొంచెం ఓపికతో చివరిదాకా విని మీ సలహా చెప్పండి....

ఇటువంటి పరిస్థితుల్లో నాకే ఓ తల్లిగాని, అక్కగాని, చెల్లెలు గాని వుంటే బహుశా నా నోటితో ఇలా ఈ విషయాన్ని ఒకరికి చెప్పుకొనే అవసరం వుండేదికాదు. కాని అటువంటి భాగ్యానికి నోచు కోని దురదృష్టవంతుణ్ణి నేను. మిమ్మల్ని ఆ స్థానంలో వుంచుకొని నేను చెప్తున్నాను....

క్లుప్తంగా గీతతో తన పరిచయం, తర్వాత తను ఎదుర్కొం టున్న సమస్య వివరించాడు ప్రేమరాజు.

"ఆలోచించి ఆలోచించి విసిగి వేసారిపోయేను. చివరకు మీరు నాకు సాయం చేయగలరనిపించింది. ఇదే నాకు మిగిలిన చివరి ఆశాకిరణం. మీ వివేకంతో ఎలాగైనా గీతతో పరిచయం చేసుకొని ఆమె ధోరణి మళ్ళించండి! నా కోసం! నా జీవితంకోసం!...."

ప్రేమరాజు ముఖంలో ఆందోళన చాలా స్పష్టంగా కనబడు తూంది. అతని జీవితాన్నంతా దేనికో ఒడ్డి ఓడిపోతూన్నట్లుగా వుంది అతని ముఖం. సరోజకు ఎంతో జాలికలిగింది.

"మీరు తప్పకుండా సాయంచేస్తారుకదూ!" ప్రేమరాజు రెట్టించేడు.

సరోజ ఏమీ మాట్లాడలేకపోయింది. గీతతో ముఖపరిచయ మైతే వుందికాని అంతకుమించి మరేమీ లేదు.

"ఇప్పుడు నేను ఏం చెప్పగలను చెప్పండి!" అంది సరోజ.

"మనస్ఫూర్తిగా ప్రయత్నిస్తానని చెప్పండి చాలు!" అన్నాడు ప్రేమరాజు.

"సరే ప్రయత్నం చేస్తాను. చూద్దాం ఏమవుతుందో!" అంది సరోజ కనీసం అతన్ని ఓదారుద్దామనే ఉద్దేశ్యంతో.

"చాలా ఓపికగా విన్నందుకు థాంక్స్! మీదగ్గర ఈ చనువు తీసుకున్నందు...." అని ప్రేమరాజు అంటూంటే సరిగా రెండు గంటల ముందు ఇటువంటి మాటలే తాను ఉషామెహతా దగ్గర చెప్పడం గుర్తుకు వచ్చింది సరోజకు. తాను ఏం చేయాలో తెలియక ఆవిడ దగ్గరకు వెళ్ళడం, అదేరోజు ప్రేమరాజు అటువంటి సమస్యనే తీసుకొని తనదగ్గరకు రావడం....చాలా వింతగా తోచింది. సమస్య లోంచి బయటకు వచ్చే మార్గమేదా అని ఆలోచించే తాను ప్రేమ రాజుకు సలహాగాని సహాయంగాని ఇవ్వడం హాస్యాస్పదంగా అనిపించింది.

ప్రేమరాజు వస్తానంటూ లేచేడు.

"కూర్చోండి. ఆయనకూడా వాచ్చేవేళయింది. ఓసారి కలిసి వెడుదురుగాని!" అంది సరోజ.

కాలేజి రోజులు ముచ్చటించుకుంటూ కూర్చున్నారు.

రవి వచ్చేటప్పటికి చీకటిపడుతూంది. వస్తూనే చీకాకుగా వచ్చేడు. రాగానే వరండాలో టీపాయ్‌మీద కవరు కనిపించింది. తన పేరేవుందని తెరవబోతూ వెనక్కి తిప్పిచూసి సరోజ పుట్టింటినుంచి వచ్చిందని చూసేడు. పెళ్ళి చేసుకుంటే గుమ్మం తొక్కడానికి వీల్లే దనే ఇంటి దగ్గర్నుంచి ఉత్తరాలేమిటని ఒళ్ళు మండిపోయింది. కోపంగా కవరు చింపకుండానే విసిరేసేడు. అది టీపాయ్‌మీద వున్న మేగజైనులో దూరిపోయింది.

డ్రాయింగు రూమ్‌లోంచి వినబడుతూన్న ప్రేమరాజు కంఠం విని అప్పుడే వరండాలోకి వచ్చిన కమలాదేవిని "ఎవరది?" అని అడిగేడు.

"తెలీదు. సరోజ ఫ్రెండట." అని ఆమె చెప్తూంటే సరోజ వచ్చింది.

"ఓసారిటురండి! యూనివర్సిటీలో నా క్లాసుమేట్ ప్రేమరాజు వచ్చేడు. మిమ్మల్నికూడా చూపి వెడదామని ఇప్పటిదాకా వున్నాడు"

అంది.

"ఎవరతను? నాకేం గుర్తురావటంలేదే! ...." విసుగ్గా ముఖం పెట్టేడు రవి.

"మా కాలేజి యానివర్సరీలో డ్రామాలో వేషంవేసి నాతో డాన్సుచేసేడూ! అతను."

"అయితే ఏమిటి? ఇప్పుడు నేను కలుసుకోకపోతే ఏమవుతుంది!....ఏవో చెప్పి పంపించెయ్!"

"అదేమిటండి అలా అంటారు! నాకు బాగా తెలిసినతను! ఇలా అంటే ఏం బాగుంటుంది!"

"నన్ను విసిగించకు సరోజా! ఇప్పుడు నే నెవర్నీ కలవలేను" అని రవి ముఖం ముడుచుకుని లోపలకు వెళ్ళిపోయేడు.

సరోజ చిన్నబుచ్చుకొని చేసేదిలేక తిరిగివచ్చి "ఏమీ అనుకోకండి! ఆయనను మరోసారి కలుసుకుందురుగాని!" అంది సిగ్గుతో సగం చచ్చిపోయి.

"సరే లెండి" ప్రేమరాజు వెళ్ళిపోయేడు.

సరోజకు రవి ధోరణి చాలా కష్టం అనిపించింది. రాత్రి పడుకొనేవరకూ ముల్లులా గుర్తుకొచ్చి బాధపెడుతూనే వుంది.

ఒక్క చిన్న సంఘటనే తన నింత బాధపెడుతూంటే ప్రేమరాజు మనస్సు అతని భార్య ధోరణికి ఎంత కలగిపోయిందో నని పించింది.

## 16

స్వీట్‌హోం క్లబ్బులో హాలంతా చప్పట్లతో గాజుల చప్పుడుతో మారుమ్రోగిపోతూంది.

చివరి వరసలో సరోజ ఖిన్నురాలై కూర్చుండిపోయింది.

ఈ రెండింటికీ కారణం గీత ఉపన్యాసం, మగవాడిపై పోరాటమే స్త్రీ లక్ష్యంగా ఆ ఉపన్యాసం, నడిచిన తీరు!

ఇంత విరోధభావం పెట్టుకొని అసలు మగవాడితో కలపి ఓయింటిలో జీవించడం ఎలాగో అర్థంకాలేదు సరోజకు?

మీటింగ్ అయిపోగానే గీత సరోజను తన కారులో డ్రాప్

చేస్తాను రమ్మంది.

సరోజ సరేనని కారులో కూర్చుంది.

"ఉపన్యాసం మీకు నచ్చిందా?" దారిలో అడిగింది గీత.

"లేదు" అంది సరోజ.

"ఎందుకు? ఎలా వుంది?"

"తేనె కలిపిన విషంలా వుంది." అంది సరోజ. గీత అభిప్రాయాలను మొదట్లోనే తుంచెయ్యాలని నిశ్చయించుకుంది. గీతతో తాను కావాలని పరిచయం చేసుకొని ఆమె కార్యక్రమాలలో ఆసక్తి చూపించడంలో ఉద్దేశం ఆమె ఆలోచనల్లోని విరుద్ధమైన భావాలను వీలయితే మార్చి ప్రేమరాజు లాంటి మంచి మనిషిని సరిగా అర్థం చేసుకొనేటట్లు చేయగలగడమే. దానికి ఇంతకంటె మంచి అవకాశం లేదు.

"అయితే ఏది తేనె? ఏది విషం!" గీత అడిగింది.

"మీ వాక్చాతుర్యం మీ ఉపన్యాస ధోరణి తేనె! చెప్పిన విషయం విషం!"

"మై గుడ్‌నెస్!" ఒక్కసారిగా సరోజను నమ్మలేనట్లుగా తల తిప్పి చూసింది గీత. "ఏదో రిమార్కు చేసేసి దాటిపోడానికి వీల్లేదు. దాన్ని ఋజువు చెయ్యాలి, నాకు నచ్చచెప్పాలి" అంది.

"నా అభిప్రాయాన్ని నేను చెప్పగలనుగాని నచ్చచెప్పడం ఎవరి సాధ్యం! మీ అభిప్రాయాలు మీరు నాకు నచ్చచెప్పగలరా?"

"తప్పకుండా" సరోజ ఎదురు సవాలు వినేసరికి గీత పౌరుషంతో అంది. "కమాన్! మా యింటిదగ్గర టీ త్రాగి వెడుదురుగాని" అంది కారాపి గీత.

సరేనని కారు దిగింది సరోజ.

"ఇప్పుడు చెప్పండి! నేను చెప్పినదాంట్లో దేనితో మీరంగీకరించరు?" డ్రాయింగ్ రూమ్‌లో టీ త్రాగడం అయిన తర్వాత అడిగింది గీత.

"దేనితోనూ అంగీకరించను."

"అంటే?"

"స్త్రీ పురుషుల నిద్దర్నీ శత్రువులుగా నిలబెట్టి, పురుషుడు ఎప్పుడూ స్త్రీని అణగద్రొక్కే ఉద్దేశంతోనే బ్రతుకుతూన్నట్లు ఊహించుకొని మీరు మాట్లాడేరు."

"అవును."

"స్త్రీ పురుషు లిద్దరూ శత్రువులని నేననుకోను. వారిద్దరికీ ఉన్నంత మిత్రత్వం మరెక్కడా లేదు...."

"కాని చరిత్ర చెప్పింది వేరు. పురుషుడు ఎప్పుడూ శత్రు భావంతోనే...."

"నో! కాదు. మీ మాట నెగ్గించుకోవడం మీకూ నామాట నెగ్గించుకోవడం నాకూ ఇష్టంగా వుంటుంది. అలాగే సంసారంలో స్త్రీతో స్నేహం అనుభవిస్తూనే ఆమె శారీరక బలహీనతనూ, ఓర్పునూ దయనూ లోకువగా తీసుకొని పురుషుడు స్త్రీ స్వాతంత్ర్యాన్ని క్రమంగా దోచుకున్నాడు. స్త్రీ దాన్ని తిరిగి సంపాదించుకోవాలి. అలా సంపాదించుకొని ఇద్దరి మధ్యా వున్న బంధాన్ని సమానప్రవ_త్తిలో వుంచుకోవాలి. అది కూడా స్త్రీ లందరూ ఒక జాతిగా పురుషులమీద దండెత్తడం పద్ధతి కాదు. ఎవరి అనుభవాల్లో ఎటువంటి లోకువలు తీసుకోవడం జరిగిందో వాటిని వారు తెలుసుకొని వ్య_క్తిగతంగానే ఆ సమస్యలు పరిష్కరించుకోవాలి. అంతేకాని మీరు ఉపన్యసించిన పద్ధతిలో స్త్రీ మనస్సు మార్చుకొని. ఆ విధమైన స్వేచ్ఛకోరితే పురుషుడి జీవితం నరకం అవుతుంది."

"అయితే అవుతుంది. ఇన్నాళ్ళూ దోచుకున్న మగవాడ్ని అణగద్రొక్కితే మాత్రం తప్పేముంది?"

"అదే నేనొప్పుకోను. అప్పుడు సంసారాలు కప్పల తక్కెలా ఉంటాయి. ఒకరి నొకరు అణగద్రొక్కాలనే ఈ వాదానికి అంతమెక్కడ?

ఉదాహరణకు మీరున్నారనుకోండి! మీ జీవితంలో మటుకు వారు మీమీద ఎటువంటి ఆంక్షలూ విధించలేదనుకోండి! మీ స్వేచ్ఛకేమీ అడ్డు లేదనుకోండి! మీ అందాన్నీ, మీ మంచితనాన్నీ ఆయన అనుక్షణం ఆరాధిస్తూ మిమ్మల్నెంతగానో ప్రేమిస్తూ మీతో

ఎంతో స్నేహంగా వున్నారనుకోండి! అటువంటప్పుడు ఆయన పురుషుడు కనుక శత్రు జాతికి చెందినవాడనుకొని మీరు చెప్పిన పద్ధతిలో ఉదయంనుంచి సాయంత్రంవరకు ఆయనను సాధించడం మొదలుపెడితే ఆయన బ్రతుకు నరకప్రాయం అవుతుంది. మీమీద ప్రేమా తగ్గిపోతుంది. చివరకు మీరు నిలబడిన కొమ్మను మీరే నరుక్కున్నట్లవుతుంది. కాదంటారా?"

గీత మాట్లాడలేదు. సరోజ మాటలు ఆమె హృదయాంతరాల్లో దేన్నో స్పృశించేయి. ఆమె ఆలోచనలో పడింది. అది చూడగానే సరోజకు తానాశించిన పని జరుగుతూన్నట్లనిపించి ఉత్సాహం కలిగింది.

"అయితే ఆడది ఎలా వుండాలని మీరంటారు?" అప్రయత్నంగానే తన నోట్లోంచి వచ్చేసింది ప్రశ్న.

"ఆడది తన ఆడతనాన్నే అసహ్యించుకొని మగవాడుగా వుండటానికి ప్రయత్నించకూడదు. స్త్రీగా తన పాత్రను ఆమె నేర్పుతో ఆసక్తితో నిర్వహించాలి. మగవాడు తన మంచితనాన్నీ మెత్తదనాన్నీ లోకువగా తీసుకోకుండా చూసుకుంటే చాలు!

ఉదాహరణకు పువ్వులో ఎందుకంత ఆకర్షణ! దానికెందుకంత అందం? అంత సువాసన? దాని సువాసనను చూసి తుమ్మెద వెదుక్కుంటూ వచ్చి దాని అందాన్ని చూసి దానిమీద వ్రాలి తన దాహాన్ని తీర్చే మకరందాన్ని గ్రోలడానికే! ఈ చర్యలోనే జరగవలసిన సృష్టికార్యం కూడా అతి సహజంగా జరిగిపోతుంది. పోతే ఇక మనం మనుషులం కనుక అందరి శ్రేయస్సునూ కోరుతున్నాం అనుకునే సంఘజంతువులం కనుక మనకున్న రాగద్వేషాలను దృష్టిలో పెట్టుకొని కొన్ని సూత్రాలకు కట్టుబడే సమాజాన్ని నిర్మించుకొన్నాం. దాని పరిధుల మధ్య అవసరమైనచోట స్త్రీ తన ఆకర్షణనంతా చూపించాలి! ప్రేయసీ ప్రియులమధ్య అన్యోన్యతకి ఆమె అందం, ప్రేమపూరిత మనస్తత్వం ఎంతగానో తోడ్పడాలి.

తన మగాడి కోసం విరహంతో ఎదురు చూడలేని ఆడదాని మనసులో ఏదో జడత్వం వుంది. తన మగాడి మనస్సును అర్థం

చేసుకోడానికే ప్రయత్నించని ఆడదాని మనస్సులో ఏదో మూర్ఖత్వం వుంది. తన మగాడికి పూర్తిగా సమర్పించుకోలేని ఆడదాని జీవితంలో ఏదో వెలితి వుంది.

పువ్వు రెండు రోజులుండి రాలిపోయేదే! యవ్వనం మూడు నాళ్ళ ముచ్చటే! ఆ మూణ్నాళ్ళూ పిచ్చి పిచ్చి ఆవేశాలతో కాలం గడిపేసి వృద్ధాప్యాన్ని నిష్ప్రయోజనంగా సానుభూతి లేనిదిగా చేసుకున్న జీవితానికి శాంతి ఎక్కడ? గమ్య మెక్కడ? అంత వికృతంగా గడిపిన జీవితంలో చివరకు మిగిలేది శూన్యం! వలచిన వాడిచేత మెడలో తాళి 'కట్టించుకొని అతని చేతిలో కరగిపోలేని ఆడది ఏదీ సాధించలేదని నా అభిప్రాయం!''

గీత ముఖం తెల్లబోయింది. గుడ్లప్పగించి దూరంగా చూస్తూంది. అమెను చూస్తుంటే ఎందుకో సరోజకు జాలి కలిగింది.

"మీ ఉపన్యాసాలికి నా జవాబు చెప్పేనుగాని దీన్ని పెర్సనల్‌గా తీసుకోకండి'' అని నవ్వేసింది సరోజ. కాని గీత అంత సులభంగా నవ్వలేకపోయింది. సరోజ మాటలు ఆమె హృదయంలో సంక్షోభాన్ని రేపేయి.

సరోజ లేచి నిలబడింది.

"నడవండి. మీ యింటి దగ్గర దింపుతాను'' గీత బయటకు దారి తీసింది.

సరోజ ఇంటికి వచ్చేసరికి ఇంకా సాయంత్రం కాలేదు. ఏవైనా పుస్తకాలు చదువుదామని చూసింది. కాని మనసు పోలేదు. డ్రాయింగ్ రూమ్‌లో వస్తువులూ పుస్తకాలూ కొంత చిందర వందరగా వున్నాయని వాటిని సర్దుతూ కూర్చుంది.

టీపాయ్ క్రింద అరలో పాత మాగజైన్స్ తీస్తూంటే వాటిలోంచి ఓ కవరు కింద పడింది. చూస్తే తల్లి దస్తూరీ! ఆత్రుతగా కవరు చింపి చదివింది సరోజ. ఆమె గుండె వేగంగా కొట్టుకోవడం మొదలుపెట్టింది. తండ్రికి సీరియస్‌గా వుందనీ, దాన్నే టెలిగ్రాంగా భావించి తొందరగా రమ్మనీ పది రోజులక్రితం తల్లి వ్రాసిన ఉత్తరం. కవరు మీద స్టాంపులు చూస్తే వారం రోజుల క్రితమే

వచ్చినట్లుంది.

అయితే ఇన్నాళ్ళూ వీటిలో ఎలా వుంది? పొరపాటా! లేదా రవి చూసే ఉత్తరం అలా వుంచేసేడా! సరోజకు అర్థం కాలేదు.

రాత్రి రవి వచ్చేవరకూ కాళ్ళు కాలిన పిల్లిలా తిరిగింది. రవి రాగానే విషయం చెప్పింది. ఓసారి వెళ్ళివద్దాం అంది. రవి ఏమాత్రం ఆందోళన చూపించకపోయేసరికి మనసు చివుక్కుమంది. పైగా తనకు రావడానికి వీలుపడదన్నాడు.

"ఏం?" అంది సరోజ దెబ్బతిని.

"వీలుకానప్పుడు కారణం ఏదయితే మాత్రం ఏమిటి?" అన్నాడు రవి పొడిగా.

"కాని నేను మాత్రం తప్పకుండా వెళ్ళాలి."

"అంటే వెడుతున్నానని చెప్తున్నావా లేదా నా అభిప్రాయాన్ని అడుగుతున్నావా?" రవి గొంతులో కొంచెం సాధింపు కనబడుతూంది. అతని అభిప్రాయం కూడా తెలుసుకోవాలనిపించింది సరోజకు.

"మీ అభిప్రాయం ఏమిటి?"

"కట్టుబట్టలతో తరిమేసిన వాళ్ళింటికి వెళ్ళడం సిగ్గులేనితనమని."

"కాని మనం కూడా ఆయనంత మూర్ఖంగా ఉండనక్కరలేదుగా! నేను మాత్రం ఓసారి వెళ్ళివస్తాను."

"వెళ్ళాలని ముందే నిర్ణయించుకున్నప్పుడు నా అభిప్రాయం అడగడం ఎందుకు?" రవి కనుబొమలు ముడుచుకున్నాయి.

"సారీ! నాన్నగారికంత సీరియస్‌గా వుందంటే మీరూ కొంచెం బాధ చూపిస్తారని ఆశించేను. నాదే పొరపాటు!" అంది సరోజ కళ్ళల్లో నీళ్ళు తిరుగుతూంటే.

## 17

పెరటి అరుగుమీద చెంగు పరుచుకొని పడుకుంది కాంతం. ఆకాశంనిండా కమ్ముకున్న నిలకడలేని మబ్బుల ఆకారాల వైపు రెప్పవాల్చకుండా చూస్తూంది. ఆ మబ్బుల ప్రతిబింబాలే మనసు

నిండా నిండి వున్నాయి. ఆఖరు క్షణాల్లోని భర్త ఆకారం కళ్ళ ముందు నిలుస్తూంది. భాస్కరం మనసులోని అశాంతి, మృత్యు ముఖంలోకి జారిపోతూంటే ముఖంమీద దారుణంగా ముద్రవేసు కున్న భయం....చుట్టూ ఎవరినీ నమ్మలేని ఆ మనస్తత్వం....ఎవరి ముఖంలోనూ ఓదార్పు చూడలేని అశక్తత—ఏమిటి? నిరంకుశ మైన జీవితం నడిపి ఆయన మాత్రం సుఖపడిందేమిటి? అయిన వాళ్ళను ఒక్కరోజు దగ్గరకు తీసుకోలేదు. పశువాంఛలను తీర్చుకో డానికి ఒక పరికరంగా తప్ప తననెన్నడూ ఒక ఆత్మీయురాలిగా తీసుకోలేకపోయారు. అన్ని వ్యసనాలకూ లోనై ఒళ్ళంతా గుల్ల చేసుకొని చిక్కిశల్యమై మంచంపట్టి ఖంగు ఖంగుమని దగ్గుతూ దోసిళ్ళనిండా రక్తం కక్కుకొని....అయిపోయింది. అంతా అయి పోయింది. జీవితం ఎంత చిన్నది!

ఓ పక్క చేయి తిమ్మిరెక్కి కాంతం రెండోవైపుకు తిరిగింది. చేతి బంగారు గాజులు గలగల మన్నాయి. మెడలో చంద్రహారాలు రెండోవైపుకు జారేయి. బంగారు గాజులు! బంగారు గొలుసులు! తన వంటిమీద వాటి కదలికలే పరిహాసం చేస్తూన్నట్లున్నాయి.

ఇన్నాళ్ళ జీవితంలోనూ తను తిండిలేక పస్తుపడుకోలేదు. ఏదో బట్ట కట్టుకోకపోలేదు. కాని నిరాశలతో నిట్టూర్పులతో ఏమిటి జీవితం ఇలా గడిచిపోయింది! ఒక్కరోజు మనశ్శాంతి లేదు! అన్నీ ఉండి మనుష్యులు ఎందుకిలా బ్రతుకుల్లో నిప్పులు చెరుగుకుంటు న్నారు. ప్రకృతి ఆకలి దప్పులు తీరడానికి అన్నీ ఇచ్చినా సంఘంలో మనుషుల మధ్య సంబంధాలు విషమపరిణామం చెంది పాలకుండలో విషపుచుక్క పడ్డట్లుగా అయిపోతూంది.

సరోజ ఉత్తరం వ్రాసినా రాలేదు. కారణం ఏమిటో తెలి యదు. అది ఎన్ని ఆదర్శాలకు పోయినా తల్లి పోయినప్పుడు కూడా వెళ్ళలేని తన బ్రతుకులాగే అయిపోయిందేమో దాని బ్రతుకు కూడా. ఆ మూడు ముళ్ళు పడ్డతర్వాత బంధాలు అలా బిగుసుకుపోతాయి కాబోసు ఊపిరి సలుపకుండా!

బయట కటకటాల చప్పుడవుతూంది.

సూర్యం వచ్చినట్లున్నాడు!

కన్న తండ్రికి కొరివి పెట్టడానికి రాలేదు. కాని జేబులో డబ్బు లయిపోయినప్పుడు ఇల్లు వెదుక్కుంటూ వచ్చేడు. కట్టుకున్న పెళ్ళాన్ని ఎలా వున్నావన్న మాట లేదు. కన్నపిల్లల్ని ఓసారి దగ్గరకు తీసుకుందామన్న ఆలోచన లేదు. మరి ఏ ఆలోచనలుంటాయో ఆ మెదడులో! తమ బాగుకోరి హితబోధచేసే తల్లిదండ్రుల, నిత్యం తనకోసం అలమటించే భార్యాపిల్లలమీద అసలు కక్షలు ఎలా పెంచుకోగలుగుతారో!

కటకటాలు ఇనుప ముక్కతో కొట్టినట్లు పెద్దగా చప్పుడవుతున్నాయి.

తప్పతాగి తాళాలెక్కడయినా పారేసుకున్నాడేమో! రెండు రోజుల ముందు మళ్ళీ వచ్చి ఆస్తంతా తన పేర వ్రాయమన్నాడు. తండ్రీ కొడుకూ తాగి తగలేసినదాంట్లో మిగిలింది నాలుగోవంతులేదు. ఆస్తంతా ఎలా వచ్చిందో అలాగే హారతి కర్పూరంలా హరించి పోయింది. ఆఖరు ఘడియలో ఆయనకు ఆస్తి తనపేర వ్రాయించాలని ఆలోచన వచ్చింది. కొడుకు తగలేస్తాడనికాని తన మీద అభిమానంతో కాదు. మరణ బాధలో కూడా తనను వినలేని తిట్లు తిట్టి బాధనుంచి విముక్తికి పొందడానికి ప్రయత్నించే మనసులో అభిమానం వుందని ఎలా అనుకోగలదు! తన ఆలోచనలు! తన సుఖం! తన బాధ! బయట ఇంత ప్రపంచంలో ఉన్న మనుషులందరికీ తనలాగే మనసులుంటాయనీ ఆలోచనలుంటాయనీ అహంకారాలు వుంటాయనీ ఆయన ఎప్పుడయినా ఆలోచించగలిగేరా!

ఆస్తి సూర్యం పోరినట్లు తను వాడిపేరే వ్రాసేస్తే మరో ఆరు నెలల్లో అదీ అయిపోతుంది. భార్యనీ పిల్లల్నీ తినేందుకు తిండి కూడా లేకుండా చేసిపోతాడు. అందుకనే తను ససేమిరా వ్రాయనంది. నానా గొడవా చేసేడు.

ఈ స్థితిలో కోడలిక్కడుండటం మంచిది కాదని వియ్యంకుడికి నచ్చజెప్పి ఆయన్తోపాటు పంపింది.

సాయంత్రం కాగితాలతో సూర్యం మళ్ళీ తయారు! నానా

రభస చేసేడు. ఇంట్లో సామానులన్నీ చిందరవందర చేసేడు. "నా పెళ్ళాన్ని పుట్టింటికి పంపడానికి నువ్వెవ ర్తవు?" అన్నాడు. చేతికందినవి పట్టుకుపోయేడు. పోతూ పోతూ మధ్య కటకటాల తలుపు తాళం వేసిపోయేడు.

"కాగితం మీద సంతకం పెడతానంటేనే తలుపు తెరుస్తానే. వెధవా!" అన్నాడు పోతూపోతూ.

ఆ మాట గుండెల్లో బల్లెంలా గుచ్చుకొని తను కుమిలి కుమిలి ఏడ్చింది.

తాళం పగిలినట్లుంది. కటకటాలు తెరిచిన చప్పుడు.

"అమ్మా!" అన్న సరోజ పిలుపు విని కళ్లు తెరిచింది కాంతం. సరోజ! తన కన్న కూతురు సరోజ! తన ప్రాణంలో ప్రాణంలా పెంచుకున్న మమతల మూట సరోజ. ఒక్కసారి దాని ఒడిలో పడి ఏడ్వాలని తపనపడిపోయింది. తన కడుపులో కష్టాలన్నీ చెప్పుకొని కళ్ళల్లో నీళ్లన్నీ కార్చి కార్చి మనసు తేలిక చేసుకోవాలనుకుంది. కాని ఇదేమిటి? ఏడుపు రాదేమిటి? కళ్లల్లోకి నీళ్లు రావేమిటి?

కాంతం రెప్ప వాల్చకుండా గుడ్లప్పగించి కూతురు వైపు అలాగే చూస్తూంది. లేవడానికి కూడా ప్రయత్నించలేదు.

తండ్రి ఎలా వున్నాడో అని వచ్చిన సరోజ—ఊళ్ళోకి రాగానే తండ్రి పోయాడని తెలిసి దుఃఖంతో గొంతు పూడిపోయిన సరోజ—తల్లిని చూడగానే బావురుమంది. ఆమె పరిస్థితికి గుండె తరుక్కుపోతూంది. కటిక నేలమీద తాళాల వెనుక ఒంటరిగా దిక్కు లేనట్లు ఇలా పడి వుందే! ఏమిటి యీమె చేసిన నేరం? భర్త అడుగులకు మడుగు లొత్తినందుకా! సవతి కొడుకు ఆగడాల్ని గుండెల్లో దాచుకున్నందుకా! ప్రేమించేనంటూ అయినవాళ్ళందర్నీ వదిలి పరాయి మగాడుతో కూతురు వెళ్ళిపోయినా మనసారా ఆశీర్వదించినందుకా!

ఆ క్షణంలో తల్లి వున్న స్థితికి తాను కూడా ఎంతో కారణమని పించింది సరోజకు. దుమ్ము కొట్టుకొనిపోయిఉన్న చీర, కన్నీటి చారలు,ఎండి కళావిహీనమయిన ముఖం, సగం నెరిసిన జుట్టు, చెదిరి

పోయిన తల....ఆమె రూపం ఇన్నాళ్ళ జీవితంలోని అనుభవాల కూడికకు జవాబులా వుంది.

సరోజ ఏవేవో వివరాలడుగుతూంది. కాంతం యాంత్రికంగా జవాబులు చెప్తూంది.

తర్వాత సరోజ తల్లిని లేవదీసి స్నానం చేయించింది. తానే వంటచేసి విస్తరివేసి వడ్డించి తల్లిని తీసుకొచ్చి కూర్చోపెట్టింది.

అరగంట తర్వాత తల్లిని మామూలు మనిషిగా చూడ గలిగింది సరోజ. తాను వచ్చినప్పుడు భావరహితంగా వున్న తల్లి మళ్లీ ఇప్పుడు సుఖదుఃఖాల పరిధిలోకి వచ్చేసింది.

కాంతం భర్త మంచం పట్టినప్పటినుంచీ తాననుభవించిన క్షణాలన్నీ పూసగుచ్చినట్లు చెప్పింది.

సరోజ ఎంగిళ్లుతీసి చేయికడుక్కొని రావడానికి పెరట్లోకి కెళ్ళింది.

అడుగుల చప్పుడువిని కాంతం తలెత్తి చూసింది.

సూర్యం! సరోజ వచ్చేవరకూ ఏమయినా ఫరవాలేదనిపించిన కాంతానికి సూర్యాన్ని చూడగానే భయంతో గుండె ఝల్లుమంది.

బట్టలు మురికిగా నలిగిపోయి వున్నాయి. గడ్డం మీసం వారం రోజుల్నుంచి పెరిగివున్నాయి. కళ్ళు చింతనిప్పుల్లా ఎర్రగా వున్నాయి.

లోపల అడుగుపెడుతూనే ఓసారి ఇల్లంతా కలయజూసేడు.

"తాళం ఎవరు తీసేరు?" సూర్యం గర్జించేడు.

"ఎవరూ తియ్యలేదు. నేను పగులకొట్టేను" అంది అప్పుడే వచ్చి పైటకొంగుకు చేతులు తుడుచుకుంటూ సరోజ.

సరోజను చూసి గతుక్కుమన్నాడు సూర్యం.

"నిన్న చెప్పింది ఏంచేసేవు?" సూర్యం, కాంతంవైపు చూసి అడగేడు.

"ఏమిటి నిన్న నువ్వు చెప్పింది?" సరోజ అడిగింది.

"నేను-నీతో మాట్లాడటంలేదు" సూర్యం ముక్కు పుటాలు పెంచి రోషంతో అన్నాడు.

"ఆవిడ నీతో మాట్లాడదు" సరోజ తాపీగా అంది.

"ఓహో! అయితే పట్నంనుంచి నిన్ను తెప్పించుకుందేమిటి తన ఆటలు సాగించుకోడానికి! నాకు నువ్వుకాదు ఎవరు దిగివచ్చినా లెక్కలేదు. నేననుకున్నది జరుగవలసిందే!"

"వాడితో వద్దమ్మా! వాడిసంగతి నీకుతెలీదు" అంది కాంతం కంగారుగా.

"మధ్యలో నువ్వొద్దు రాకమ్మా! నా సంగతి నీకూ తెలీదు. వీడి కంతకంటె తెలీదు."

"ఏమే! సంతకంచేస్తావా లేదా?" గొంతు చించుకు గట్టిగా అరిచేడు సూర్యం. పాంటుజేబులోంచి మడిచిన కాగితాలకట్ట బయటికి తీసేడు.

కాంతం మాటాడక తలవంచుకొని కూర్చుంది బెదురుతూ.

"ఆఖరుసారిగా చెప్తున్నాను. నువ్వు గొంతు చించుకుంటే ఇక్కడ జడిసే వాళ్ళెవరూలేరు!" సరోజ అంది. "ఏమైనా మాట్లాడ దలచుకుంటే నాతో మాట్లాడు. లేకపోతే వచ్చినదారినే బయటకు నడు."

"నువ్వెవత్తివే ఆమాట అనేందుకు! ఇది నా యిల్లు! నా యిష్టం! దాన్ని కాగితాలమీద సంతకం చేయమను. పోతాను."

"ఏమిటా కాగితాలు?"

"నా ఆస్తి నాకు రాసిచ్చే కాగితాలు."

"ఆస్తి నీదే అయితే నీకు రాసివ్వడందేనికి?"

"అన్యాయంగా తనపేర రాయించుకుంది కనుక! ఆయన ఆస్థికి నేను వారసుడ్ని కనుక!"

"ప్రయోజకత్వం లేనివాడు, తనపొట్ట తాను పోసుకోలేని వాడు, తండ్రి పోయినప్పుడు తలకు కొరివిపెట్టడానికైనా కరువైన వాడు, కొడుకైనా ఆయన స్వార్జితానికి వారసుడెలా అవుతాడు! నువ్వున్నా లేవనే అనుకొని ఆయన ఆస్తంతా అమ్మపేర వ్రాసేడు. ఇందులో నీకు చిల్లిగవ్వరాదు....ఇది నీ యిల్లుకాదు! వెంటనే బయటకు నడు!" సరోజ గుమ్మం చూపించింది.

సూర్యం ఓ నిముషం పొగలు కక్కుతూ సరోజవైపు

చూసేడు.

తరువాత ఒక్కసారి కాంతంవైపు తిరిగి ఇంటి కప్పెగిరిపోయేలా అరిచేడు.

"ఆ స్తంతా దీనికి కట్టబెడదామని తీసుకొచ్చేవే దొంగలంజా! నిన్నూ దీన్నీ లోపల పెట్టేసి ఈ కొంపకు నిప్పుపెట్టేస్తానే...."

సూర్యం అరుపులు వింటూంటే సరోజ ఒళ్ళు అగ్నిహోత్రంలా మండిపోయింది. చేతికొద్దీ చెంపమీద ఛెళ్ళున పెట్టింది. పక్కనున్న చేతికర్ర తీసుకొని చేతికొచ్చినట్లు ఉతికేసింది సూర్యాన్ని.

"తండ్రి ఉన్నాడో చచ్చేడో అక్కర్లేని నీకు తల్లిని లంజా అని తిట్టగలిగే నీకు ఆస్తి కావాలిరా! దరిద్రుడా! మమ్మల్ని ఇంట్లో కట్టేసి ఇంటికి నిప్పుముట్టించేదాకా నిన్ను ప్రాణాలతో విడుస్తాననుకున్నావా! ఇప్పుడే నీ ప్రాణాలు తీస్తానురా! నీకు ప్రాణంమీద ఆశవుంటే పోరా! తక్షణం పో!...." సరోజ మహాకాళిలా విజృంభించింది.

ఊహించని ఈ ప్రతిఘటనకి సూర్యం తలక్రిందులయ్యేడు. సరోజ చేతిలో కర్ర చర్మం నిలువునా కాల్చినట్లు ఒంటికి అంటుకుపోతూంటే దెబ్బల్నుంచి తప్పించుకోడానికి బయటికి పరుగెత్తిపోవడంకంటె మరేం చెయ్యలేకపోయాడు.

సూర్యం పారిపోగానే చేతిలో కర్రపారేసి తల్లివైపు చూసింది సరోజ. నిశ్శబ్దంగా తల వంచుకొని కూర్చున్న కాంతం కళ్ళల్లోంచి ఏకధారగా కన్నీళ్ళు జారిపోతున్నాయి.

"....ఇది పాపిష్టి డబ్బని ఎన్నిసార్లన్నావమ్మా నువ్వు! పాపిష్టి డబ్బుతో నువ్వు బ్రతకద్దు! నేను చెమటోడ్చి కష్టపడి నీకు సంపాదించి పెడతాను!....ఇంట్లో తాళంపెట్టి వెడతాడా వీడు! ఇల్లు మనం తాళంపెట్టే వెడదామమ్మా! నువ్వూ వదినా పిల్లలూ నాతోనే వుందురుగాని...." తల్లిని ఊరడిస్తూ అంది సరోజ.

ఈ ఓదార్పు మాటలతో కాంతం హృదయంలోని అంతరాంతరాల్లో దాక్కున్న దుఃఖం అంతా ఉప్పెనలా పెల్లుబికి వచ్చింది.

సరోజ తల్లిని పసిపాపను చేర్చుకున్నట్లు అక్కున చేర్చుకుంది.

## 18

తండ్రి అంత్యక్రియలకు సంబంధించిన కర్మలన్నీ కాగానే సరోజ తల్లినీ, వదిననూ పిల్లల వెంటబెట్టుకొని హైదరాబాదు వచ్చేసింది.

ఇంటికి వచ్చేసరికి రవి బ్యాంకుకు వెళ్ళిపోయేడు.

కమలాదేవి ఆఫీసుకు బయలుదేరబోతూంది. అప్పుడే గుమ్మంలో దిగిన అందర్నీ చూసి ఆఫీసుకు వెళ్ళడం మానేసింది. ఎంతో మర్యాదగా కాంతాన్నీ,పద్మావతినీ పిల్లలనూ లోపలకు తీసుకొని వెళ్ళింది. మరోవిధంగా సంతోషంలో వున్నప్పుడు అందరూ కలుసుకోవలసింది ఇలా కలుసుకోవలసి వచ్చినందుకు చాలా బాధగా వుందంది. తరచి తరచి ఎన్నెన్నో వివరాలడిగి నిట్టూరుస్తూ ఎంతో మనస్ఫూర్తిగా పరామర్శించింది. రెండు మూడు గంటల్లోనే కాంతానికీ పద్మావతికీ కానిచోటుకు వచ్చేమన్న సంకోచం పోగొట్టి ఇబ్బంది లేకుండా చూసింది

సరోజ ఆత్రుతగా రవికోసం చూస్తూంది. ఇన్ని రోజుల ఎడబాటు తర్వాత, తనకు వ్యక్తిగతంగా కలిగిన ఈ బాధను రవితో పంచుకోవాలనిపించింది.

రవి తొందరగానే ఇంటికి వచ్చేడు. సరోజను చూసికూడా తలతిప్పుకొని తన గదిలోకి వెళ్ళిపోయేడు.

అతని వెనకాలే సరోజ వెళ్ళింది. కొంచెం సేపు రవి ఏమయినా మాట్లాడుతాడేమోనని ఎదురుచూసింది. రవి మాట్లాడలేదు.

"మా నాన్నగారు పోయేరు" అంది మెల్లగా.

"నువ్వు వ్రాసిన ఉత్తరం అందింది" రవి బట్టలు మార్చుకుంటూ ఆమెవైపు చూడకుండానే అన్నాడు.

"కొన్నాళ్ళు ఇక్కడ వుంటారని మా అమ్మనూ, వదినెనూ పిల్లల్నికూడా తీసుకొని వచ్చేను."

రవి సూటిగా సరోజ కళ్ళల్లోకి చూసేడు.

"ఇంకెవరూ లేరా తీసుకురావడానికి!" అన్నట్లుంది ఆ చూపు. ఇంకెంతసేపయినా అతనేం మాట్లాడకపోతే సరోజ అక్కడనుండి వెళ్లిపోయింది.

తన తల్లిని ఒక్కసారయినా పలకరిస్తాడేమోనని ఎంతో ఆశతో ఎదురుచూసింది. రవి అసలు ఆవిడవైపే చూడకపోయేసరికి ఎంతో బాధ కలిగింది. తన తల్లి మానసింగావున్న పరిస్థితికీ, తన సవతి అన్న ఆమెనూ వదిననూ పిల్లల్నీ పెడుతూన్న కష్టాలకు రవి కనీసం కొంత తానున్నానని ముందుకొచ్చినా తనకెంతో బలంగా వుండేది. కనీసం అదిలేకపోయినా అసలు అతను మాటే మాటాడక పోతే ఆత్మాభిమానం గల తనతల్లి ఇంకెంత బాధపడుతుందోనని బెంగగావుంది. అందుకే రాత్రి రవి భోజనం అవగానే రవితో వేరుగా సరోజ అంది.

"మీరోసారి ఆవిడను పలకరిస్తే బాగుంటుంది."

"నాకు ఈ పరామర్శలూ అవీ అలవాటు లేవు."

"ఇవి అలవాటుగా వచ్చే సంఘటనలు కూడా కాదుగా! మీరో మాట మాట్లాడితే ఆవిడ బాధ కొంత చల్లారుతుంది."

"ఆవిడ బాధకు నేను కారణం కాదుగా!"

విషయం అర్థం చేసుకోడానికి తిరస్కరిస్తున్న అతనితో ఎలా మాట్లాడాలో అర్థంకాలేదు సరోజకు.

"మీ యిష్టం" అని సరోజ వచ్చేసింది.

రవి అభిప్రాయం మార్చుకోలేదు. కాంతంతో మాట్లాడలేదు. వారం రోజుల తర్వాత ఇంటి ఖర్చుకు రవి ఇచ్చిన డబ్బు అయి పోవడంతో సరోజ మళ్ళీ అడగవలసి వచ్చింది.

"నెలకు సరిపోయే డబ్బు వారం రోజుల్లోనే అయిపోయింది" అన్నాడు రవి నిందాపూర్వకంగా.

"ఇంట్లో చుట్టాలున్నారన్న సంగతి మీకు తెలుసుగా!"

"ఇంత ఖర్చు పెరిగితే నాకు వీలుకాదు."

"అంటే మీ వుద్దేశ్యం?"

"ఇంతకంటె వివరంగా చెప్పడం అవసరం లేదను

కుంటాను."

"అర్థమయింది."

రవి జేబులోంచి రెండువంద రూపాయల కాగితాలు తీసిచ్చేడు. సరోజకు వెంటనే వద్దనాలనిపించింది. కాని తనకై తాను దూరాల్ని పెంచకూడదని చేసుకున్న నిర్ణయం గుర్తుకొచ్చింది. సిగ్గు పడుతూనే తీసుకుంది.

"ఈ నెలాఖరుదాకా పైమివ్వండి. వాళ్ళ ఖర్చు మీరు పెట్ట నక్కర్లేకుండా చూస్తాను" అంది.

రవి ఏదో మాట్లాడబోయాడు కాని మళ్ళీ ఊరుకున్నాడు.

సరోజ బయటికొస్తూ అక్కడే నిలబడివున్న తల్లిని చూసింది.

ఇద్దరూ వేరుగా వున్నప్పుడు "నేను మనయింటికి వెళ్ళిపోతా నమ్మా!" అంది కాంతం.

ఇంక వివరంగా మనసులో మాట చెప్పేకంటే మార్గాంతరం కనిపించలేదు సరోజకు.

"నువ్వు నా దగ్గరేకాని, మరోచోట వుండడానికి వీల్లేదమ్మా! ఎందుకంటే నీకు వున్నదాన్ని కన్నకూతుర్ని నేనొక్కర్తెనే కనుక."

"నాకు నీతోనే వుండాలని వుంటుందమ్మా? కాని ఇక్కడ ఎలా వీలవుతుంది!"

"వీలుకాకపోతే వీలుచేసుకుంటాను! కాని ఒక్కవిషయం ఏమిటంటే....నీమూలాన నా కాపురం ఏదో అయిపోతూందేమోననే ఆలోచన నీ మనసులోకి రాకుండా చూడాలి. నేను వుద్యోగం చేసయినా నిన్ను నాదగ్గర వుంచుకుంటాను."

"నువ్వెన్నిచెప్పినా నన్నుగురించి మీరిద్దరూ వాదులాడు కుంటూంటే నేనెలా వుండగలను?"

"ఇక ముందు మేము నిన్నుగురించి వాదులాడుకొనే సందర్భమే వుండదు. నువ్వు నా ఆస్థివి. నా కన్నీను! నాతోనే వుండాలి. నీకోసం నేను దేన్నయినా విడిచిపెడతాను."

"అంతమాటనకమ్మా! నే వినలేను."

"అంతవరకూ రావలసిన అవసరం వుండదమ్మా! రేపటి

నుంచే నేను వుద్యోగానికి ప్రయత్నిస్తాను" అంది సరోజ.

సరోజ మర్నాడు ప్రేమరాజు ద్వారా ఏమయినా వుద్యోగం దొరుకుతుందేమోననే ఆలోచనతో సాయంత్రం గీత ఇంటికి వెళ్ళింది. వెళ్ళేసరికి గీత ఇంటిదగ్గర వుంది.

ఎన్నడూ చూడనిది చీరలో గీతను చూసేటప్పటికి ఆశ్చర్యం కలిగింది. కొంచెంసేపు మాట్లాడుకున్న తర్వాత, "ఏదయినా వుద్యోగం చెయ్యాలనే ఆలోచనతో మీ ఆయనద్వారా ఏమయినా దొరుకుతుందేమో అడుగుదామని వచ్చేను. ఎన్నిగంటలకు వస్తారు?" అంది సరోజ.

"ఇప్పుడు ఆయన ఇక్కడుండటంలేదు" అని గీత అంటూంటే ముఖం కొంత చిన్నబోవడం గమనించింది సరోజ.

ఆమెకూ ప్రేమరాజుకూ మధ్యవున్న భేదాలు తెలియడంవలన ఇక వేరే ఏమీ అతన్నిగురించి అడగలేదు. తర్వాత తండ్రి పోయినట్లూ, అక్కడ జరిగిన గొడవలూ అన్నీ వివరంగా చెప్పింది.

"మీరు ఇదివరకు వర్ణించినంత మానవత్వంలేని మగవాళ్లుంటారని నేనెన్నడూ ఊహించలేదు. కాని ఇప్పుడుమాత్రం కళ్ళారా చూసేను. అతను మా అన్న సూర్యం! వాడిని సాధించడానికి మాత్రం మీ సిద్ధాంతంతప్ప నాకు వుపాయం తోచటంలేదు. మీకు చేతనైతే మైనం బొమ్మలాంటి మా వదినెకు పాషాణంలాంటి వాడికి ఎదురు నిలబడి గెలిచే శిక్షణ ఏదైనా ఇప్పించండి!" అని సరోజ సూర్యం కథంతా చెప్పింది.

"మీకు అభ్యంతరం లేకపోతే మాకు మహిళామండలి ఆఫీసులో ఒకమ్మాయి కావాలి. మీ వదినెగారు పిల్లలతో అక్కడే వుండవచ్చు. ఆవిడకు తిండీ బట్టా ఇస్తారుగాని పెద్దగా జీతం ఇయ్యలేరు. కాని ఆవిడకు ఏవయినా ఒకటి రెండు చేతిపనులు నేర్చుకోడానికీ చదువుకోడానికీ మాత్రం సౌకర్యం వుంటుంది. కొన్నాళ్ళుపోతే ఏదైనా వుద్యోగమూ దొరకచ్చు" అంది గీత.

సరోజకు వెదుకబోయిన తీగె కాలికి తగిలినట్లయింది. పద్మావతిని కొన్నాళ్ళు దూరంగా వుంచితే సూర్యానికీ బుద్ధిరావచ్చునేమో

నని పించింది. ఆమెకూ ఒకరిమీద ఆధారపడి వున్నామనే ఆలోచనా వుండదు. అందుకని మర్నాడే ఆమెను చేర్చుకోమని చెప్పింది.

సరోజకు మనసెంతో తేలికపడింది. తన తల్లెప్పుడూ తనకు సమస్యకాదు.

రెండు రోజుల తర్వాత ఓ సాయంత్రం ప్రేమరాజు బజారులో కనబడ్డాడు.

రెండురోజుల క్రితం అతనికోసం వెళ్ళినట్లు చెప్పగానే తన యిల్లు అక్కడికి దగ్గరేననీ ఒకసారి వచ్చి పొమ్మనీ అన్నాడు. సరోజ సరేనంది.

"అంత యిల్లు అక్కడుండగా వేరే యింట్లోకి యెందు కొచ్చేరు?" అంది సరోజ అతని వెనుకే యింట్లోకి వస్తూ.

"అదంతా ఓ పీడకల! పోనియ్యండి. సూక్ష్మంగా జరిగిందే మంటే ఆ యింట్లో నాకు నౌకరు కిచ్చిన విలువకూడా యియ్యరు! అదీగాక తల దాచుకోడానికి కూడా దిక్కులేని వాడినని మామగారు నన్ను యెగతాళిచేసేడు! అటువంటి కొంపలో ఉండి యెలా బ్రత గ్గలను చెప్పండి!...." అన్నాడు ప్రేమరాజు.

అతనూ గీతా యిద్దరూ యింకా సన్నిహితంగా వుండాలని ఆశించిన సరోజకు అతని మాటలు యెంతో నిరుత్సాహం కలగ జేసేయి. వెంటనే అతను అన్నాడు.

"నేను యిల్లు మారటం అలా వుంచి నేను మీతో ఒక ముఖ్యమైన విషయం చెప్పాలనుకున్నాను. అసలు మీరీవేళ కనబడక పోతే రేపో యెల్లుండో మీ యింటికి వచ్చేవాడిని.... అదిసరే! మీరు గీతను కలిసేరుకదా! మీకు ఆమెలో యే మార్పూ కనబడలేదూ?"

"కనబడింది."

"ఎటువంటి మార్పు?"

"నేను ఆమెను మొదటిసారి చీరలో చూసేను. అంతేకాక యిదివరకు కంటే యెంతో సౌమ్యంగా మాట్లాడింది.... కాని మీ రిద్దరూ ఇలా వేరుగా ఉండడం బాగులేదు...."

"దీనికేం ఫర్వాలేదు. త్వరలోనే ఆమెను ఇక్కడికి తెచ్చుకో

గలనని నేనూ ఆశిస్తున్నాను....యింతకీ చెప్పదలచుకున్నదేమంటే ఈమధ్య నేను ఆఫీసు పనిమీద బెంగుళూరు వెళ్ళినప్పుడు వారం రోజులు శలవుతీసుకొని గీత రాదని తెలిసికూడా రమ్మని వ్రాసేను. బెంగుళూరుకి గీత వచ్చేసింది. నా ఆశ్చర్యం యింతా అంతా కాదు. తర్వాత ఆమెతో ఊటీ వెళ్ళేను. నేను మీకు సిగ్గువిడిచి చెప్తున్నాను. పెళ్ళయి యిన్ని సంవత్సరాలు కావస్తూందికాని అది మా మొదటి హనీమూన్! దానికి గీతమీద మీ ప్రభావమే కారణమని నే నను కుంటున్నాను" అన్నాడు ప్రేమరాజు సంతోషంగా.

"ఎవరి ప్రభావమైనా మీరు కోరుకున్నది నెరవేరుతూంది. కంగ్రాచ్యులేషన్! త్వరలోనే మీకు పూర్తి విజయం కావాలి."

"థాంక్స్!" అన్నాడు ప్రేమరాజు.

తర్వాత తాను వుద్యోగం చేయదలచుకొన్నట్లు చెప్పి ఎక్కడైనా చూసిపెట్టమంది సరోజ.

"అదేమిటి రవిలాంటి పలుకుబడివున్న మనిషిని యింట్లో పెట్టుకొని నాతో చెపుతున్నారు!" అన్నాడు ప్రేమరాజు.

కారణం సరోజ చెప్పకపోయినా ఆమె ముఖంలో మారిన రంగులు కొంతవరకు సూచించాయి.

"మీకోసం నేను యేదయినా చేస్తాను. అదీకాక మీలాంటి బ్రిలియంట్ పోస్ట్ గ్రాడ్యుయేట్ కి ఉద్యోగం దొరకడం పెద్ద సమస్య కాదు. నాలుగైదు రోజుల్లో యే మాటా చెప్తాను" అన్నాడు ప్రేమ రాజు.

సరోజ మనసు తేలికపడింది.

## 19

చూస్తూన్న ఫైల్స్ వెనక్కు నెట్టేసి కుర్చీలో వెనక్కు జేర్ల బడ్డాడు రవికుమార్.

తల దిమ్మగా వుంది. కణతలదగ్గర కొద్దిగా పోటు వస్తూంది. కనుగుడ్లు లాగుతున్నాయి. రెప్పలు మూస్తే కళ్ళు భగ్గున మండు తున్నాయి.

ఇదంతా రాత్రి పార్టీ ప్రభావమేనని రవికి తెలుసు! తమ

బ్యాంకుతో వ్యవహారాలు నడిపే వ్యాపారస్థులు యిచ్చే పార్టీలకు వెళ్ళడం సరైన పద్ధతి కాదని తెలుసు. కాని వాళ్ళు పార్టీలకు రమ్మని తోడేస్తారు. కొత్తలో అయితే చాలా ఖచ్చితంగా రానని చెప్పేవాడు. కాని రానురాను అలా చెప్పలేకపోతున్నాడు. మార్పులేని ఆఫీసు, యింటి వాతావరణాలమధ్య ఏదో కొంత యిటువంటివి మొద్దుబారే మనస్సుకు పదునుపెడతాయి. ఒకప్పుడు అదో సరదాగా అనిపించినా యిప్పుడు నాలుగైదు రోజులకయినా యిటువంటి కార్యక్రమం లేక పోతే మనసు పరిపరివిధాల పోతూంది. ఇకపోతే ఈ పార్టీలు దృష్టిలో పెట్టుకొని వాళ్ళకి తనేం రూల్సును దాటి సాయంచెయ్యటం లేదు కదా అని సరిపెట్టుకుంటున్నాడు.

రాత్రి పార్టీలో పన్నెండు దాటిపోయింది. తను హద్దు మీర కూడదని అనుకుంటూనే రెండుసార్లు యిదే ఆఖరు అనుకుంటూ గ్లాసు పెదవులకు తగిలించేడు.

కళ్ళు తెరిచేసరికి తెల్లారి తోటి ఆఫీసరు పాండురంగారావింట్లో వున్నాడు. పాండురంగారావు బ్రహ్మచారి! బ్యాంకులో ఆఫీసర్లకు అతని యిల్లు ఎమోషనల్ ఔట్ లెట్! లేచి స్నానం అయిందనిపించి హోటల్లో కాస్త టిఫిన్, కాఫీ సేవించి ఆఫీసుకు వచ్చేశాడు.

శుభ్రంగా ఈపూట ఆఫీసు మానేసి విశ్రాంతి తీసుకోవాల నుంది. విశ్రాంతి! ఇంట్లో అంతమంది మనుషులతో అక్కడ విశ్రాంతేమిటి? అదీకాక టేబల్ మీద అర్జెంట్ కేసులు కూడా వున్నాయి.

రవి అయిష్టంగానే ఫైల్ మళ్ళీ ముందుకు లాక్కున్నాడు. టేబిల్ మీద టెలిఫోన్ మ్రోగింది.

"రవికుమార్ హియర్!" అన్నాడు బద్ధకంగా రిసీవర్లో.

అవతల మేనేజరు కంఠం విని "గుడ్ మార్నింగ్ సర్!"అని అప్రయత్నంగా సీటులో సర్దుకున్నాడు.

"అయిదు నిముషాలిటు వస్తారా?" అన్నాడు మేనేజర్.

"వస్తున్నాను" అని టెలిఫోను పెట్టేసి మేనేజరు కేబిన్ లోకి నడిచేడు రవి.

"మిస్టర్ రవికుమార్! ఓవర్ డ్యూ ఎకౌంట్స్ లేటెస్టు

పొజిషన్ ఏమిటి?"

"అన్నింటికీ రిజిష్టర్డు రిమైండర్స్ ఇచ్చి వారంరోజులయింది. వచ్చేవారం నుంచి వరుసకూ అన్నింటినీ ఇనస్పెక్షను చెయ్యాలి."

"అదిసరే! వాటి రెండు మూడు ఎకౌంట్స్‌లో ఒక్క ఇన్‌స్టాల్ మెంట్ కూడా రాలేదు. అవి బ్యాంకును మోసం చేసినట్లున్నాయి. అదీకాక ఆ మూడింటికీ లిమిట్స్ మిస్టర్ విలియమ్స్ మేనేజర్‌గా వుండగా శాంక్షన్ అయ్యేయి. ఇప్పుడతను వుంటూన్న బ్రాంచిలో గొడవ జరిగి అతను సస్పెన్షన్‌లో వున్నట్లు నీకు తెలుసను కుంటాను."

"యస్సర్."

"ఆ మూడు ఎకౌంట్సూ ఈ వేళా రేపూ నువ్వు వాళ్ళ ఫాక్టరీలు ఇన్‌స్పెక్టుచేసి అర్జెంట్‌గా రిపోర్టు ఇవ్వాలి."

"ఓకే సార్."

రవి బయటకు వచ్చేసేడు.

మధ్యాహ్నం లంచ్ తర్వాత రవి స్కూటర్‌మీద ఇండస్ట్రి యల్ ఎస్టేటుకు వెళ్ళేడు.

ఎ టు జడ్ ప్లాస్టిక్స్ ఫాక్టరీ స్థలం అంతా నిశ్శబ్దంగా వుంది. ఏవో మెషినరీకి సంబంధించిన వస్తువులు కొన్ని చెదురుమదురుగా తుప్పుపట్టి వున్నాయి.

దూరంగా ఆఫీసు బిల్డింగ్ లోపల మనుషులు వున్నట్లున్నారు. బిల్డింగ్ ముందు ఒక కారు, రెండు స్కూటర్లూ వున్నాయి. రవి తన స్కూటరు వాటి ప్రక్కనే నిలిపి లోపలకు వెళ్ళేడు. అది ఒక విశాలమయిన ఎయిర్‌కండిషన్డు రూమ్. అందులో పెద్ద ఆఫీసు టేబిల్ చుట్టూ నలుగురు కూర్చున్నారు. ఒక ఖాళీ అయిన విస్కీ సీసా, ఖాళీ సోడాసీసాలు, సోడా విస్కీ కలిపి వున్న సగం సగం తాగిన గ్లాసులు, అవికాక సీలువిప్పని మరో విస్కీసీసా, కొన్ని సోడాలు వున్నాయి. నలుగురి ముందు పేపర్ ప్లేట్స్‌లో మిక్చర్ వుంది. నలుగురి చేతుల్లోనూ పేక ముక్కలు వున్నాయి. సిగరెట్స్ సిగార్స్ పొగతో గదంతా అలుముకొని వుంది.

తలుపు తోసుకొని లోపలకు వెళ్ళిన రవిని చూసి అందరూ వులిక్కిపడి చూసేరు.

రవి ఆ ఫర్మ్ ప్రొప్రయిటర్ సురేంద్రకుమార్‌ను గుర్తు పట్టేడు.

"మిస్టర్ సురేంద్రకుమార్!"

"యస్!" అంటూ పొట్టిగా, బొద్దుగా దబ్బపండులా వున్న తను కనుబొమలు పైకెత్తి చూసేడు.

"అయామ్ రవికుమార్! ఆఫీసర్ ఫ్రమ్ బ్యాంక్ ఆఫ్...."

"ఆయియే రవికుమార్‌సాబ్!" అంటూ సురేంద్రకుమార్ ఎంతో మర్యాదగా లేచి కరచాలనం చేస్తూ చేతిలో కార్డ్సు టేబిల్ మీద పారేసేడు. గబగబా ఇంగ్లీషులో కుశలప్రశ్నల వర్షం కురిపించేడు.

అతని ముఖంలో మారుతున్న రంగులు గమనించేడు రవి. కుశల ప్రశ్నలయిన తర్వాత రవి అన్నాడు.

"మీ ఫర్మ్‌కి ఏడాదిన్నర క్రితం బ్యాంకు యాభై వేలు ఎడ్వాన్సు ఇచ్చింది. ఇప్పటివరకూ ఎకౌంట్‌లో ఒక్క పైసకూడా జమ కాలేదు. ఎన్ని లెటర్స్ వ్రాసినా జవాబులేదు. కారణం తెలుసుకోడానికి మీ ఫాక్టరీ ఇన్‌స్పెక్టు చెయ్యడానికీ వచ్చేను."

సురేంద్రకుమార్ మిగిలినవాళ్ళకు ఏదో సైగజేసేడు. మెల్లగా ఒకళ్ళ తర్వాత ఒకరు బయటకు వెళ్ళిపోయారు.

"నేను వూహించని కొన్ని ఆటంకాలు రావడంవలన ప్రొడక్షను మొదలుపెట్టలేకపోయాం రవికుమార్‌జీ!...." సురేంద్రకుమార్ చెప్తూ, "హౌ ఎబౌట్ ఎ డ్రింక్!" అన్నాడు ఖాళీ గ్లాసు ఒకటి ముందుకుతోస్తూ.

"నో. థాంక్యూ!" అని రవి అక్కడనుండి లేచేడు.

"చాలా త్వరలోనే ప్రొడక్షను మొదలుపెడుతున్నాము" అన్నాడతను.

"బయట ఏమీ మెషినరీ లేదు. మీ ప్రాజెక్టు రిపోర్టులో ఇచ్చిన ఏ వస్తువులూ ఇక్కడ లేవు. వాటికి మీరేమంటారు?"

"నా మాట వినండి రవికుమార్! ఒక్క రెండు నెలల తర్వాత మీరు వచ్చి చూడండి. అన్నీ సరిగానే వుంటాయి."

"నేను అలా అనుకోవటం లేదు" అన్నాడు రవి సీరియస్‌గా.

"ఈసారికి మీరు ఫేవర్‌బుల్ రిపోర్టు ఇవ్వండి! మీ మేలు మరచిపోను!...."

"ఇవ్వను. మీరు బ్యాంకును దగా చేసేరు."

"లేదు రవికుమార్! ఈసారికి మీరు వదిలేసి చూడండి! చెప్పేనుగా! మీకు ఎంత కావాలంటే అంత...."

"అయామ్ సారీ మిస్టర్ సురేంద్రకుమార్! మీరా మాటలు మాట్లాడవద్దు."

"ప్లీజ్ రవికుమార్!"

"నో" రవికుమార్ బయటకు వచ్చేసేడు రూమ్‌లోంచి.

"ఇప్పటికే ట్రబుల్స్‌లో వున్నాం. కొన్నాళ్ళు వేరే ఇబ్బందులు తెచ్చిపెట్టద్దని ప్రార్థిస్తున్నాను."

"ఇబ్బంది మీరే తెచ్చిపెట్టుకున్నారు."

"అది కొన్ని కారణాలవలన జరిగిపోయింది. మీరు సహాయం చెయ్యగలరు."

"చెయ్యను" రవికుమార్ స్కూటర్ స్టార్ట్ చేసేడు.

"మీకు మీరు ఇబ్బందులు తెచ్చుకుంటున్నారు."

సురేంద్రకుమార్ బెదిరింపు విని అతనివైపు చూసేడు రవి. అప్పటిదాకా మర్యాద పులుముకున్న ముఖం మారిపోయి దుష్టత్వం కొట్టొచ్చినట్లు కనబడుతూంది.

"అదీ చూద్దాం!" అన్నాడు రవి పౌరుషంగా.

"మీ ఉద్యోగాన్ని పోగొట్టుకుంటారు."

"ఐ డోంట్ కేర్!" అన్నాడు రవి. స్కూటరు ముందుకు కదిలింది.

"నిమ్మల్ని కటకటాల వెనక్కాల చూస్తాను" ఇంచుమించుగా అరిచేడు సురేంద్రకుమార్.

"కనీసం నువ్వైనా బయట నిలబడడానికి ప్రయత్నించు."

అన్నాడు రవి. స్కూటరు రోడ్డుమీద కొచ్చేసింది.

ఆసలే చికాగ్గావున్న రవి మనసు మరింత చికాకయిపోయింది. ఆ ఫర్మ్‌కి మొదట అప్పు ఇచ్చిన సందర్భం గుర్తుకు తెచ్చుకుంటూ సిటీలోకి వచ్చేడు.

పరాకుగా ఆలోచిస్తూ స్కూటరు నడుపుతూన్న రవి యాధాలాపంగా తలతిప్పి చూసిన ఒక దృశ్యం మెదడులో నిలిచిపోయి యాభై గజాలు ముందుకుపోయిన తర్వాత స్కూటరు రోడ్డు పక్కన ఆపేడు. వెనుక షాపులో ఎవరో ఒకామె సరోజలా వుంది. అవునో కాదో తెలీదు.

రవి స్కూటరు వెనక్కి తిప్పి అదే షాపుముందుకు రోడ్డుకు రెండోవైపుకు వచ్చేడు.

సరోజే! అది ఎలక్ట్రానిక్ ఎక్విప్‌మెంట్ షాపు. కౌంటరు ప్రక్కగా నిలబడి ఎవరితోనో నవ్వుతూ మాట్లాడుతూంది. సరోజతో మాట్లాడుతూన్న అతన్ని ఎక్కడో చూసినట్లుంది? రవి ఆలోచించగా గుర్తుకొచ్చింది. అతన్ని యూనివర్సిటీలో చాలాసార్లు చూసేడు. సరోజతో ఒకటి రెండుసార్లు నాటకాలుకూడా వేశాడు. ప్రేమరాజు! కొద్దిరోజుల క్రితం తన యింటికివచ్చి తనకోసం వెయిట్ చేస్తూంటే తను అతన్ని కలవలేనని విసుక్కున్నాడు.

రవి మనసులో సన్నని మంట మొదలయింది.

సరోజ కాశ్మీరు సిల్కుచీరలో ట్యూబ్‌లైటు కాంతిలో మెరుస్తూ అందంగా కనబడుతూంది. సరోజ అంత ఉత్సాహంగా ఈ మధ్య ఎప్పుడూ కనిపించలేదు రవికి. షాపులోకి వెళ్ళి సరోజతో మాట్లాడి ఇంటికి తీసుకెడదామా అనిపించింది. కాని వెళ్ళలేక పోయాడు. అక్కడే నిలబడి మరికొంతసేపు పరిశీలిద్దామనిపించింది. మాటల మధ్యలో సరోజ ఒకసారి తల ఇటుతిప్పి చూసినట్లని పించింది. రవి చటుక్కున తల పక్కకు తిప్పుకున్నాడు. తరువాత ఆమె ప్రేమరాజుతో మళ్ళీ తల ఇటు తిప్పకుండా మాట్లాడడంచూస్తే సరోజ తనను గమనించినట్లు లేదు.

నిలబడి దూరంగా సరోజ ప్రేమరాజుతో మాట్లాడడం

చూస్తూంటే రవి మనసునిండా అసూయ, రోషం అలుముకున్నాయి.

ఉన్నట్టుండి మరొకతను వాళ్ళిద్దరి దగ్గరకు వచ్చేడు. ముగ్గురూ కలిసి బయటికి వచ్చేరు. షాపు ఎదురుగా వున్న కారు తలుపు తెరిచి సరోజ వెనుకసీటులో కూర్చుంది. వాళ్ళిద్దరూ ముందుసీట్లో కూర్చున్నారు. కారులో కూర్చున్నప్పుడు మళ్ళీ సరోజ తనవైపు చూస్తూందేమోననిపించి రవి తల తిప్పుకున్నాడు.

తిరిగి అటు చూసేసరికి కారు కదిలిపోయింది. రవి స్కూటరు స్టార్టుచేసి కారును వెంబడించేడు.

కారు ఎగ్జిబిషన్ గ్రౌండ్సు దగ్గర ఆగింది. రవి దూరంగా స్కూటరు ఆపుచేసేడు.

కారులోంచి ముగ్గురూ దిగేరు. ఎగ్జిబిషనులోకి వెళ్ళడం చూసేడు రవి.

వెంటనే తనుకూడా టిక్కెట్టు తీసుకొని లోపలకు వెళ్ళేసరికి వాళ్లు కనబడలేదు. పిచ్చెక్కినట్లు రాత్రి ఎనిమిది గంటలవరకూ తిరిగేడు. దానికి తోడు కోపంతో మనసు ఉడికిపోతూంది.

సరిగ్గా అదే టైముకు ప్రేమరాజు, సరోజ ఒక రెస్టారెంటులోకి వెడుతూ కనబడ్డారు. రవి వాళ్ళను వెంబడించేడు. రెస్టారెంటులో దారికి దగ్గరగానే టేబిల్ముందు కూర్చున్నారిద్దరూ. తను లోపలకు వెడితే వాళ్ళ ముందునుండే వెళ్లాలని రవి లోపలకు వెళ్ళలేదు. రెస్టారెంటు చుట్టూ పిట్టగోడ వుండడంవలన ఇద్దరూ దగ్గరగా కనబడుతున్నారు. తానక్కడ నిలబడి వుండడానికి సాకుకోసం వెదికేడు. ప్రక్కనేవున్న ఐస్క్రీం పార్లర్లో ఒక ఐస్క్రీం తీసుకొని వాళ్ళిద్దరికీ దగ్గరగా స్తంభం వెనుక బయట నిలబడ్డాడు.

ప్రేమరాజు రెండు టీ ఆర్డరు చేసేడు.

"మీరేమైనా తీసుకుంటారా?" అన్నాడు సరోజతో.

"వద్దండీ! టీ చాలు" అంది సరోజ.

"చాలా థాంక్సండీ! నాకోసం చాలా శ్రమపడ్డారు." మరో నిముషం తర్వాత అంది సరోజ.

"దీనికేముందండి! మీకోసం నేనేం చెయ్యడానికైనా సిద్ధమే!

కాని నేనడిగిన డబ్బుకే అతను కొంచెం ముందు వెనుకాడేడు. కాని ఓ వారం రోజులు మీ పని చూసిన తర్వాత అతనే మిమ్మల్ని వదలడు. అయామ్ స్యూర్ ఎబౌటిట్!" అన్నాడు ప్రేమరాజు.

రవి ఇంక వినలేకపోయేడు. ఐస్‌క్రీం చల్లగా నాలుకకు తగిలినా మంట మండుతూన్నట్లే వుంది. పట్టలేని కోపంతో దాన్ని నేలకేసి కొట్టేసి బయటకు వెళ్ళిపోయేడు.

# 20

రవి ఇంటి కొచ్చేసరికి రాత్రి తొమ్మిది గంటలైంది.

కాంతం తలుపు తీసింది.

రవి లోపలకు వచ్చి పై కోటూ సోఫామీద విసిరేసి అలసిపోయినట్లు పడుక్కున్నాడు.

సరోజ వుదయం అనగా వెళ్ళింది. ఇంకా ఇంటికిరాలేదు. వచ్చేసరికి కొంచెం ఆలస్యం కావచ్చునని చెప్పింది. కాని అతనంత చికాగ్గా వుండి కూతురు ఇంటిదగ్గర లేకపోయేసరికి కాంతానికి యెందుకో భయంగా వుంది. బిక్కు బిక్కు మంటూ వంటింట్లోకి తప్పుకుంది.

తలుపు చప్పుడు విన్న కమలాదేవి వచ్చి తమ్ముణ్ణి చూసింది. కొట్టిన పాములా పడివున్న రవిని చూడగానే మనసు చివుక్కుమంది.

"నిన్నరాత్రి ఇంటికి రాలేదు. తెల్లారింది. మళ్ళీ చీకటి పడింది. ఇంత వేళాపాళా తెలియకపోతే యెలాగురా?"

"నిన్న ఓ ఫ్రెండు ఇంటికి వెళ్ళేను. ఆలస్యమయిపోతే రాత్రి వాళ్లు వెళ్ళనియ్యలేదు. ఉండిపోయేను. పొద్దున్న అక్కడే భోజనంచేసి అలాగే ఆఫీసుకు వెళ్ళివచ్చేను."

"నువ్వు ఆఫీసుకు వెళ్ళివచ్చేవు సరే! ఇంటిదగ్గర వాళ్ళకే మనిపిస్తుంది, ఏం ఖంగారుపడుతున్నారన్న ఆలోచన అక్కర్లేదూ!"

"నాకు మనసేం బాగాలేదు. కొంచెంసేపు నన్ను ఒంటగారి వదిలెయ్ అక్కా!"

కమలాదేవి చేసేదిలేక లోపలకు వెళ్లిపోయింది.

మరో పదినిముషాల తర్వాత సరోజ ఖంగారుగా వచ్చింది.

వస్తూంటేనే కాంతం యెదురువెళ్ళింది.

"ఇంత ఆలస్యమయిందేమమ్మా?" అని అడిగింది కాంతం.

"తర్వాత చెప్తానమ్మా!" అని లోపలకు వెడుతూ సోఫాలో వున్న రవిని చూసింది.

"ఆయనెప్పుడొచ్చేరు?" కమలాదేవిని అడిగింది సరోజ.

"వాడూ ఇప్పుడే వచ్చేడు."

"భోజనం చేశారా?"

"లేదు."

"మీరు?"

"లేదమ్మా! ఇప్పటిదాకా వాడూలేడు, నువ్వూలేవు. వస్తారేమో అందరూ ఏకంగా తినెయ్యవచ్చునని చూస్తున్నాము."

"సరేలెండి. ఇప్పుడే వస్తున్నాను" అని సరోజ కాళ్ళూ చేతులూ కడుక్కొని బట్టలు మార్చుకుంది.

"లేవండి. భోజనం చేద్దురుగాని" అని రవితో చెప్పి తల్లి సైగచేస్తే అటు వెళ్ళింది సరోజ.

"అతను వచ్చినప్పటినుంచి కోపంగా వున్నాడు. ఎందుకో తెలీదు. మేమిద్దరం వంటింట్లో తింటాం. నువ్వతని గదిలోకి తీసుకెళ్ళి ఇద్దరూ అక్కడ తినండి" అంది కాంతం.

సరోజ తిరిగి వచ్చేటప్పటికి రవి బట్టలు మార్చుకొని తన గదిలో కూర్చున్నాడు.

సరోజ కంచంలో అన్నం వడ్డించుకొని రవి వున్న గదిలోకి వెళ్ళింది.

టీపాయ్ రవి కూర్చున్న కుర్చీ ముందుకు లాగి సరోజ దానిమీద కంచం పెట్టింది.

రవి కంచం విసిరికొట్టేడు. కంచం పెద్దగా చప్పుడయింది. అన్నం గదంతా చిందిపోయింది.

సరోజ నిర్ఘాంతపోయింది. ఒక్కక్షణం ఏమీ అర్థంకాలేదు. మనసులో ఆవేశం అలుముకుంటూంది. ఎంతో నిగ్రహంతో ఆవేశాన్ని పక్కకు నెట్టింది. అణువణువునా కోపం నిండిపోయిన

రవి ముఖం చూసింది. గదంతా చెదిరిపోయిన అన్నం చూపింది. ఎప్పుడూ ఓర్పు చూపించే తనకు కోపంవస్తే యెలా వుంటుందో కొంచెం మచ్చు చూపించాల్సిన అవసరం వచ్చిందనిపించింది. తలెత్తి చూసేసరికి గుమ్మందగ్గర కమలాదేవి యెంగిలిచేత్తో నిలబడి వుంది. దూరంగా భయంతో తెలతెలబోయి చూస్తూన్న తల్లి కనబడింది.

వెంటనే కమలాదేవి కిందికివంగి అన్నం యెత్తబోయింది.

"మీరు వెళ్ళండొదినా! నేను తీస్తాను" ఎంతో మర్యాదగా చెప్పింది సరోజ గొంతులో ఏమాత్రం ఆవేశంలేకుండా.

"ఫరవాలేదులే!"

"వద్దు. నేను చెప్పినమాట వినండి. మీరు వెళ్ళండి. దయ వుంచి కొంచెం సేపు ఇటు రావద్దు."

కమలాదేవి లోపలకు వెళ్ళిపోయింది. సరోజ గుమ్మానికి తెర అడ్డుగా లాగింది.

"వదినెమీద గౌరవంకొద్దీ ఇవి తీస్తున్నాను కాని లేకపోతే మీరు ఏసుకొనేవరకూ ఇవి ఇలాగే వుండేవి" అంది కింద చెదిరిన అన్నం యెత్తుతూ.

రవి కత్తులు దూస్తూన్నట్లు చూసేడు సరోజవైపు.

"దేవుడు మనసులో మాట చెప్పడానికి నోరిచ్చేడు. దాన్ని ఇంకా స్పష్టంగా చెప్పగలిగే చదువులు చదువుకున్నారు మీరు.... ఇన్నీ నేర్చి మాటలురాని చిన్నపిల్లల చేష్టల్లా ఏమిటీపనులు!...." సరోజ అంది.

"అనవసరంగా వాగి నన్ను రెచ్చకొట్టకు!" అన్నాడు రవి.

"ఏది అవసరం? ఏది అనవసరం? కారణం చెప్పకుండా కంచం విసిరెయ్యడం అవసరమా! తిండిదొరకని రోజుల్లో ఇలా అన్నం నేలపాలు చెయ్యడం అవసరమా! అన్నం తీసుకొచ్చిన మనిషిని ఇలా అవమానించడం అవసరమా!....ఎందుకిలా చేసేరు అని నేనడిగితే అది అనవసరమా!" సరోజ సూటిగా కళ్ళల్లోకి చూసింది.

రవి కోపం పట్టలేక ఊగిపోతున్నాడు. "ఆడదానవు రాత్రి తొమ్మిది గంటలకా ఇంటికి రావడం!"

"ఇంటికి రావడానికి ఆడదానికో టైమూ మగాడికో టైమూ వుంటాయేమిటి?"

"అసలెక్కడికెళ్లావ్ నువ్వు?"

"నిన్నరాత్రి మీరెక్కడికెళ్లేరు?"

"ముందు నేనడిగిన ప్రశ్నకు జవాబు చెప్పు!"

"ముందు వెళ్ళింది మీరు. ఎక్కడికెళ్లారో చెప్పండి."

"అయితే చెప్పవన్నమాట!"

"అని నేననలేదు. ముందు మిమ్మల్ని చెప్పమన్నాను."

"చెప్పకపోతే!"

"ఐడోంట్ కేర్! కాని మీ ప్రశ్నకు జవాబురాదు."

"బట్ ఐ డు కేర్ వేర్ ది హెల్ యూ హేవ్ గాన్! డూ యూ అండర్ స్టాండ్! నువ్వు చెప్పకపోతే యెలా చెప్పించాలో నాకు బాగా తెలుసు!"

"ఐసీ! మరి ఆలస్యం యెందుకు? అయితే చెప్పించెయ్యండి."

"అయితే అన్నింటికీ తెగించేసన్నమాట! నిన్నూ...."

"పళ్లు పట పటా కొరికేస్తున్నారు. జాగ్రత్త!....కాస్సేపు రెస్టు తీసుకోండి. నేనీ కంచం అవీ అక్కడపెట్టి చేతులు కడుక్కొని వస్తాను."

సరోజ బయటకు వెళ్ళబోయింది. రవి చెయ్యి పట్టుకొని విసిరేసేడు. సరోజ బలవంతాన ఆపుకొని నిలబడింది.

"కమాన్! చెప్పు! ఎక్కడికెళ్ళావో చెప్పు!"

"చెప్పను."

"చెప్పవూ!" సరోజ చెంప ఛెళ్ళుమంది.

"ఎక్కడికెళ్ళేవ్!" రవి గర్జించేడు.

సరోజ చెక్కు చెదరలేదు. ఆత్మవిశ్వాసం చాటే చిరునవ్వుతో రవి కళ్లల్లోకి చూస్తూ అంది.

"చెప్తాను. చెవులు సరిగాపెట్టుకొని వినండి. ఈరోజు, ఈక్షణం మీరు చెంపదెబ్బ కొట్టింది నన్నుకాదు. మీ నాగరికతా, మీ చదువూ, సంస్కారం అన్నింటినీ మీరు చెంపదెబ్బ కొట్టేరు.

ఇన్నాళ్ళూ ప్రపంచంలో వస్తూన్న తీరునుబట్టి మీ శరీర బలాన్నిబట్టి మీరు ఒకటికాదు పదికొట్టినా నలుగురూ తేలికగా మరిచి పోతారు. కాని నేను తిరగబడి ఒక్కటి కొడితే మాత్రం అది విన్న వారి మనసులోకాని చూసినవారి మనసులోకాని శాశ్వతంగా నిలచి పోతుంది. మీకేమాత్రం ముందు చూపున్నా అది రానివ్వకండి.

ఇంక నేనెక్కడికెళ్లేను అనే మీ ప్రశ్నకు నేనింకా జవాబు చెప్పలేదు. 'మీ అహంకారంతో విషపూరితమైన ఈ వాతావరణంలో చెప్పను. పిచ్చి పిచ్చి వేషా లెయ్యక అడ్డులేవండి."

రవిని బలవంతంగా తప్పించి సరోజ బయటకు వెళ్ళి పోయింది. రవి నిశ్చేష్టుడై నిలబడిపోయేడు.

వంటింట్లో కమలాదేవీ, కాంతం తినాలని లేకపోయినా ఒకరి మర్యాద కోసం ఒకరు ఏదో భోజనం అయిందనిపించేరు.

కంచం కుళాయి దగ్గరపెట్టి వస్తూన్న సరోజను కమలాదేవి పరిశీలనగా చూసింది. గంభీరమైన ఆమె ముఖంలోంచి ఆమె మనసులో ఏ భావమూ గోచరించలేదు. ఆ క్షణంలో సరోజకు నచ్చ చెప్పాలన్నా జంకుగా అన్పించిందామెకు.

కాంతానికి తన కాపురంలో జరిగిన సంఘర్షణలన్నీ కళ్ళ ముందు నిలిచేయి. అ పరిణామాలు తన కూతురు కాపురంలో కూడా ఎక్కడ వస్తున్నాయోనని ఆందోళన కలుగుతూంది. అక్కడ తను వుండడం అల్లుడి దృష్టిలో ఇంకేం కోపతాపాలు పెంచుతాయోనని దిగులు పట్టుకుంది. ఇద్దరు మనుషుల మధ్య దాంపత్యబంధం సరిగా నిలవడానికి ఆడది అణగి ఉండడమో, తన అభిప్రాయాన్ని విప్పి చెప్పి అన్యాయానికి ఎదురు తిరగడమో ఎలా తెలుస్తుంది?

"అమ్మాయ్ సరోజా!" కాంతం సరోజను పిలిచింది.

సరోజ తల్లి దగ్గరకు వెళ్ళింది.

"నాకేదో భయంగా వుందమ్మా! అనవసరంగా నోరుజారకు!

నా బ్రతుకులాగా నీది కాకూడదమ్మా!" అంది ప్రేమగా తల నిమురుతూ.

"అన్ని బంధాలూ సహజంగా నిలవాలనే అందరం అనుకుంటామమ్మా! కాని ఆ బంధాలు నిలవడం కోసం చూపే సహనానికి కూడా హద్దుండాలిగా! హద్దులేని సహనం చూపించిన నీ అనుభవం ఏమిటి? స్పష్టంగా మంచిదారిని నడవడంకంటె మనం చేయగలిగిందేముంటుంది? అప్పుడు ఫలితాలెలా వున్నా మనం సరియైన దారినే నడిచేమనే సంతృప్తయినా మిగిలి వుంటుందిగా! నువ్వనవసరంగా బెంగపెట్టుకోకమ్మా! జరగవలసిన విధంగానే అన్నీ జరుగుతాయి. కాని మంచితనం గెలుస్తుందనే నా విశ్వాసం" అంది సరోజ.

రవి వున్న గదిలోకి వచ్చేసరికి పదకొండు గంటలు దాటిపోయింది. లోపల జీరోవాట్ బల్బు కాంతిలో గదంతా మసక మసకగా వుంది.

సరోజ రవి వున్న మంచంవైపు చూసింది. రవి రెండు చేతులూ తలకింద పెట్టుకొని కాలుమీద కాలువేసుకొని వెల్లకిలా పడుకొని ఇంటి కప్పువేపు రెప్పవాల్చకుండా చూస్తున్నాడు.

ముఖంమీద తీవ్రత ఏమాత్రం చెరగలేదు.

ఒక్క నిముషం సరోజ అలాగే నిలబడింది.

"నేను మీతో ఓ అరగంట మాట్లాడాలి!" అంది సరోజ ఏదో నిశ్చయానికి వచ్చినదానిలా.

"నాకు మాట్లాడాలని లేదు" రవి మళ్ళీ చూపులు పైకప్పువైపు మరల్చేడు.

"మీరు మాట్లాడనక్కరలేదు. వింటే చాలు."

"వినాలని కూడా లేదు."

"లేకపోయినా ఓపిక చేసుకునైనా వింటే మీకు ఎప్పుడూ కృతజ్ఞురాలిగా ఉంటాను. వింటే మీకూ నాకూ కూడా మంచిది" కొంచెం ఆగి అంది సరోజ.

ఏమనుకున్నాడో ఏమో, "కానీ!" అన్నాడు రవి.

రవి మంచం పక్కగా వున్న ఎత్తుపీట ఒకటి లాక్కొని కూర్చొంది సరోజ.

"మన పెళ్ళయిన తర్వాత మీకు చాలా బాధ కలిగించే పని నేనేమయినా చేసేనా? లేదా మనిద్దరి మధ్యా ఒకప్పుడున్న అన్యోన్య తలో వచ్చిన మార్పుకు మీ వుద్దేశం ప్రకారం నేను కారణమా?...."

"నాకు మాట్లాడాలని లేదని ముందే చెప్పేను." రవి చూపు మరల్చకుండానే పుల్ల విరిచినట్లు చెప్పేడు.

"....సరే! నేనే మాట్లాడుతాను" అని సరోజ గొంతు సర్దుకుంది.

"చూడండి! ఇద్దరం ఒకరి నౌకరు కావాలని కోరుకొని ఎన్నెన్నో కలలు కని ప్రేమించుకొని పెళ్ళిచేసుకున్నాం. నావరకు నేను మావాళ్ళ నెదిరించి వాళ్ళకంటె వివేకమైన నిర్ణయం నేను తీసుకుంటున్నాననే విశ్వాసంతో కొన్ని సౌకర్యాలను, ఆస్తిపాస్తు లను, సహజ బంధాలను తెంచుకొని మిమ్మల్ని చేపట్టేను.

తరువాత మీరు ఉదయం ఆఫీసుకు వెళ్ళినప్పటినుంచి సాయంత్రం తిరిగి వచ్చేవరకూ వేయి కళ్ళతో ఎదురు చూసేదాన్ని. మీరు—జైలులోంచి విడిపించుకొని వచ్చినట్లుగా పరిగెత్తుకు వచ్చే వారు. మాటల్లేకుండా అలా ఒకరి కళ్ళల్లోకి ఒకరు చూసుకుంటూ ఒకళ్ళ చేతుల్లో ఒకరు వాలిపోయి గంటలతరబడి గడిపేసేవాళ్ళం. మీరు నా అభిప్రాయాలకెంతో విలువ నిచ్చేవారు. నేను మీ అభి ప్రాయాలకెంతో విలువ నిచ్చేదాన్ని. మూడు సంవత్సరాలు ఎంతో ముచ్చటగా గడచిపోయేయి. తరువాత ఎప్పుడో యెక్కడో గుర్తు పట్టలేనంత చిన్నమార్పు మొదలై అది రోజు రోజు పెరుగుతూ వచ్చింది. అది నాకు గుర్తు దొరికిన ఆరోజు—మూడేళ్ళ తరువాత మన పెళ్ళిరోజు. ఆరోజు సాయంత్రం నేను ముస్తాబై మీకోసం క్షణమొక యుగంగా యెదురు చూసేను. నిరుత్సాహంతోనే నిద్ర లోకి జారాను. మీరు వచ్చేసరికి రాత్రి పన్నెండయింది. నేను లేచి వడ్డించబోతే ఎక్కడో అనుకోకుండా పార్టీకి వెళ్ళవలసి వచ్చిందనీ, నన్ను తినెయ్యమనీ అన్నారు. నాలో ఉత్సాహం చచ్చిపోయి దుఃఖం

కలిగింది. మీరు కూడా ఎంతో నొచ్చుకున్నారు. ఏదో సరిపెట్టుకు న్నాను. ఆనాటినుంచీ చూస్తున్నాను. ఆ మార్పు పెరుగుతూనే వచ్చింది. ఎందుకు? అని యెన్నోసార్లు నన్ను నేను ప్రశ్నించు కున్నాను. నాలో మీకుండే ఆకర్షణ నిలబెట్టుకోడానికి నేను వూహించ గలిగినన్ని ప్రయత్నాలు చేసేను. కొన్ని రోజులు మామూలుగా వున్నట్లే వుండేవారు. కాని యెందుకో మళ్ళీ దూరం పెరిగిపోతూనే వచ్చింది. క్రమంగా ఇంటికి సాయంత్రం ఆలస్యంగా వస్తూండేవారు! మొదట్లో ఆఫీసు పని అన్నారు కొన్ని రోజులు! తరువాత క్లబ్బుకు వెళ్ళేననీ అక్కడ ఆలస్యమయిందనీ అనేవారు. ఆలస్యం అలవా టయిపోయింది. మీకు చీటికీ మాటికి చికాకు ఎక్కువయింది. అయిన దానికీ కానిదానికీ అలకలు మొదలయ్యేయి. అన్యోన్యత కరగి పోయి ఇద్దరిమధ్య వ్యక్తిత్వాలు విడిపోయి అహంకారాలు పెరిగి పోయేయి. నా నోట్లోంచి వచ్చిన హితవాక్యం మీకు పరుషవాక్యంగా వినబడింది. నా ఆందోళన మీకు అల్లరిగా కనబడింది!

సరదాగా అంటూ మొదలుపెట్టి తరువాత తరుచుగానే తాగి వస్తూండేవారు. అసలే అదుపులో లేని మనసుకు యింకా నిషా ఎక్కించేవారు. అదే పని నేను చేస్తే....మీరు స్నేహితులతో కేబ రేకు వెళ్ళి పరాయి ఆడది నగ్నంగా గంతులు వేస్తూంటే కేరింతాలు కొడుతూ ఆనందించేవారు. చివరకు ఆ ఆనందాలు మీరు నాకు చెప్పి నన్నో మనసులేని యంత్రంగా భావించి మీరు అవి చూడడమే నాకు కూడా ఆనందం అన్నట్లు ప్రవర్తించేవారు. పరాయి మగాడు గుడ్డలు విప్పుకు గంతులు వేస్తుంటే నేను అతని శరీరాన్ని అంగాంగ పర్ణనం చేస్తూంటే మీకెలా వుంటుంది ఎప్పుడైనా ఆలోచించేరా?

నాపట్ల మీరు చూపిస్తున్న వైఖరికి మీరే తప్పుచేసినట్లుగా ఫీలయి ఆ తప్పు నాలో చూడడానికి ప్రయత్నించేరు. దానికి ఏ మాత్రం సానుకూలమైన సాకు కనబడినా నిజమని భ్రమపడి క్రమంగా నమ్మి నేనుకూడా మిమ్మల్ని అన్యాయం చేస్తున్నానని పగ బూనడం మొదలుపెట్టేరు.

పరాయి మనిషికికూడా చిన్న కష్టం వచ్చినప్పుడు సాను

భూతి చూపించే మనం అది యెంతో క్లిష్టసమయంలో కూడా ఒకరి మీద ఒకరు చూపించుకోలేకపోతే మనిద్దరిమధ్య వున్న బంధం ఎంత హాస్యాస్పదంగా తయారైందో ఆలోచించండి. మా నాన్నగారికి సీరియస్‌గా ఉందన్న సంగతి తెలిసి నా ఆందోళనను కొంత మీరు పంచుకోడానికి ప్రయత్నించవలసిందిపోయి ఒకసారి వెళ్ళొద్దాం అని నేనంటే మీరు రాననడమే కాకుండా నేను వెళ్ళడంకూడా యిష్టంలేదన్నారు. ఆయన మన పెళ్ళి విషయంలో మొండిపట్టుపట్టి ఉండవచ్చు! ఆయన చావు బ్రతుకుల విషయంలోకూడా మీరు అలాగే నడుచుకుంటే ఆయనకంటే మీరేం మెరుగయినట్లు! ఆయన పోయిన తర్వాత అక్కడ రోజు గడవడానికి వీల్లేని పరిస్థితుల్లో అమ్మనూ వదిననూ కొన్నిరోజులు నాతో ఉండమని తీసుకొచ్చేను. నాన్నగారు పోయినందుకు మా అమ్మతో పరామర్శకయినా ఒక్కమాట మాట్లాడడానికి మీకు మనస్కరించలేదు. సరికదా రోజు రోజుకూ ఖర్చు లెక్కువయిపోతున్నాయని పిల్లిమీద ఎలుకమీదా పెట్టి సాధించడం మొదలెట్టేరు.

చివరకు నామీద విశ్వాసం లేకపోవడం యెంతవరకు వచ్చిందంటే యీరోజు సాయంత్రం ఎలక్ట్రానిక్ కార్పొరేషన్‌దగ్గర నన్ను చూసినప్పటినుంచి అనుమానంతో నన్ను వెంటాడి, ఎగ్జిబిషన్‌లో నేను ప్రేమరాజుతో టీ తాగుతూంటే స్తంభం వెనుక కూర్చొని పరిశోధనలు చెయ్యడానికి ప్రయత్నించి నేను అతనితో అక్రమంగా తిరుగుతున్నా ననే నమ్మకంతో చెంప పగల గొట్టడం దాకా వచ్చింది.

నేను మీతో పరిచయం అయిన మొదటిరోజే హోటల్లో టీ త్రాగేనే! అంటే ఆ రోజే నాకు శీలం లేనట్లా? పరిచయం వున్న మనిషితో ఓ కప్పు టీ తాగితే అది అవినీతి అయిపోతుందా?

మామూలు పరిజ్ఞానంతో అంగీకరించే యిటువంటి విషయాలు కూడా నా పట్ల వ్యతిరేకంగా ఆలోచించేటంత అయిష్టత నామీద మీకెందుకు కలుగుతూంది! మీరూ ఆలోచించండి. నా ఆలోచనకు తోచింది నేను చెప్తాను.

దీనికంతకూ ముఖ్య కారణం మీరు మగవారు కావడం నేను ఆడదాన్ని కావడమూనూ. ఎందుకో ప్రపంచంలో అన్ని సమాజాల్లోనూ ఆడది ఎప్పుడూ అణచివేయబడింది. ఒకవిధమైన ఔన్నత్యం మగదానికంటే తనలో ఉందనే నమ్మకం, సుపీరియారిటీ కాంప్లెక్సు మగవాడిలో జీర్ణించుకుపోయింది.

అనాదిగా వస్తూన్న ఈ కాంప్లెక్స్ మీ వ్యక్తిత్వంలో కూడా జీర్ణించుకుపోయింది.

మిమ్మల్నే నమ్ముకొని మీకోసమే యెదురుచూసిన నామీదే మీకు ప్రేమ తగ్గిపోయిందే! అటువంటిది నన్ను అడుగడుగునా అవమానించి శారీరకంగా మానసికంగా హింసిస్తే మీమీద నాకు ప్రేమ ఎలా నిలుస్తుంది? నిలిచినా ఎన్నాళ్ళు నిలుస్తుంది? ప్రేమ అనురాగం అనేవి వన్‌వేట్రాఫిక్కు కావు! నేను మిమ్మల్ని ప్రార్థించేదేమంటే దయవుంచి ఆ కాంప్లెక్సెస్ విడిచిపెట్టి నా స్నేహితుడిగా, నా ప్రియుడిగా నా యిష్టాయిష్టాలను గురించీ కష్టసుఖాల గురించీ ఆలోచించమంటున్నాను.

మీరూ నేను కలిసి సుఖంగా కాపురం చేస్తామాలేదా అన్నది పెద్ద విషయం కాదు. ఇంత విశాలమయిన ప్రపంచంలో యిద్దరు మనుషులు ఏమయినా లెక్కలోకి రాదు. కాని చదువుకొని వివేకవంతులం అనుకొనే ప్రజాబాహుళ్యానికి ప్రతినిధులం మనం. మనమే పరిస్థితులను పరిసరాలను అర్థం చేసుకొని అదుపులోకి తెచ్చుకోకపోతే యీ చదువుకూ సంసారానికీ అర్థం ఏమిటి?

చివరకు నేను చెప్పదలచుకున్నది మీ జీవితానికి ఎంత ప్రయోజనం ఉందని మీరనుకుంటున్నారో నా జీవితానికి కూడా అంత ప్రయోజనం ఉందని నా నమ్మకం. అది మీరుకూడా నమ్మగలిగితేనే మన దాంపత్యానికో అర్థం, అందం ఉంటుంది.

ఇక మీ ప్రశ్నకు జవాబు. దిక్కులేని నా తల్లి నన్ను విడచి ఉండడానికి వీల్లేదుకనుకా ఆవిడ నాతోకూడా వుంటే ఖర్చులు ఎక్కువయి మీకుకూడా యిబ్బంది కలుగుతూంది కనుకా నేనుకూడా ఉద్యోగంలో చేరదలిచేను.

ప్రేమరాజు రికమెండేషన్‌తో యీరోజు మీరు చూసిన ఎలక్ట్రానిక్ కార్పొరేషనులో ఆరువందలయాభై రూపాయల జీతంమీద చేరేను. ఈ రోజు ఎగ్జిబిషన్‌లో వాళ్ళ స్టాల్‌లో వుండవలసి వచ్చింది. అంతకుమించి మరే నేరమూ చెయ్యలేదు. మన పెళ్ళిముందు మీరో మాటన్నారు. వంటింట్లో వంట చెయ్యడానికే అయితే స్పెషలైజ్డ్ స్టడీస్ అన్నీ అనవసరం అని. ఆ మాట గుర్తుకొచ్చే ఈరోజు ఉద్యోగంలో చేరాను.

మన మధ్య పెరిగిన దూరాల మూలాన ఈ ప్రయత్నం ఎప్పటికప్పుడు మీతో చర్చించలేకపోయాను.

మొదట చెప్పాల్సినది, ఆఖరున చెప్తున్నాను. ఇందాక మీతో ప్రవర్తించినప్పుడు మిమ్మల్ని గాయపరచడం నా ఉద్దేశం కాదు. నా బాధ యెలా వుంటుందో మీకు తెలియాలని అలా నటించేను.

మీరు కూడా ఆలోచించండి. ఇంతే నేను చెప్పదలచుకున్నది. అరగంటసేపు ఓపిగ్గా విన్నందుకు థాంక్స్!"

సరోజ ఆపి రవివైపు చూసింది. అతని ముఖంలో తీవ్రత తగ్గినట్లుంది. సరోజ లేచి తన మంచంమీదకు వచ్చి పడుకుంది.

సరోజకు యిప్పుడు మనస్సెంతో తేలికగా వుంది. యెన్నాళ్ళ నుంచో మనసులో దాక్కున్న కలతలు కరిగిపోయాయి.

పది నిముషాలకు మెల్లగా నిద్ర పట్టేసింది.

నిద్రలో ఏదో కమ్మని కల.

మనసంతా హాయిగా వుంది.

సరోజకు హఠాత్తుగా మెలకువ వచ్చింది.

చేతికేదో తగిలినట్లయి ఉలిక్కిపడి తల తిప్పి చూసింది.

రవి! సరోజ మంచంమీద కూర్చుని ఉన్నాడు.

"మీరా?" లేవబోయింది సరోజ. రవి ఆమెను లేవనియ్యలేదు. కొంచెం మీదికి ఒరిగేడు. ఆమె రెండుచేతులూ తన చేతుల్లోకి తీసుకున్నాడు.

"రాత్రంతా నువ్వు చెప్పిందే ఆలోచించేను. నువ్వు ఎంత చక్కగా ఆలోచించేవు! నువ్వు చెప్పింది నూటికి నూరుపాళ్ళు నిజం!

తప్పంతా నాదే. నువ్వు నాకు భార్యగా దొరకడం నిజంగా నా అదృష్టం!"

సరోజకు రవి మాటలు మధురమైన సంగీతంలా వినబడు తున్నాయి. రెండు చేతులూ రవికి చుట్టి యింకా దగ్గరగా తీసు కొంది....

"రెండు సంవత్సరాలు నిన్నెంతో బాధించేను సరోజా! కాని యిక ముందెన్నడూ యిలా జరగనివ్వను. నన్ను మన్నించ...."

రవి మాటలు పూర్తిచెయ్యకుండా సరోజ అతని పెదవులు తన పెద వులతో మూసివేసింది. తర్వాత అంది.

"మీరెంత మంచివారో నాకు తెలుసు. నా వరకు మనిద్దరం ఒకటై ఉండడమే కావలసింది. తప్పెవరిది అన్న ప్రశ్నేలేదు."

సంకోచాలు లేని మనసులతో, యినుమడించిన అనురాగంతో కోరికతో వేడెక్కుతూన్న శరీరాలతో యిద్దరూ పెనవేసుకు పోయారు.

## 21

అది గీతకు నిద్ర పట్టని రాత్రి.

సాయంత్రం జరిగిన సంఘటన పదే పదే కళ్ళముందు వచ్చి నిలబడుతూంది.

స్త్రీ పురుష సంబంధాల లాలిత్యాన్ని గ్రహించలేక, మొండి తనంతో, మగవాడంటే శత్రుభావమే బలపడిన తాను అర్థంలేని జీవితాన్ని గడిపింది యిన్నాళ్లూ. సరోజ పరిచయంతో మారిన మనసు పరిస్థితుల వాస్తవాన్ని తెలిపింది. తన మనసు సమాధానపడి అన్నీ సక్రమంగా జరుగుతున్నాయనగా—తండ్రి చెప్పిన వార్త తనను తల్లడిల్ల జేసింది.

సరోజ ప్రేమరాజులకు అక్రమ సంబంధమున్నదనీ, హోట ల్స్‌కి వెళ్ళడమూ, ఎగ్జిబిషన్‌లో కలసి షికారు చేయడమూ జరుగు తోందనీ చాలా నమ్మకంగా తండ్రి చెప్పడంతో షాక్ తిన్నది తాను. ఆవేశంలో విచక్షణ నశించిపోయింది తనకు.

ఆ సాయంత్రం ప్రేమరాజు వచ్చాడు. రావడంతోనే తనను

దగ్గరకు తీసుకొన్నాడు "నిన్ను విడిచి వుండలేకపోతున్నాను గీతా. ఎన్నాళ్ళు మనకీ వేరు కాపరం" అన్నాడు ఆర్తిగా.

"ఇలా ఎంతమందిని చేతుల్లో పట్టుకొని ఎంతమందితో ఈ ప్రేమమాటలు మాట్లాడావు?" అంది తను అతన్ని నిరసనగా చూస్తూ.

"ఏమిటి? యెందుకలా అనుకొంటున్నావు?" తెల్లబోయి అన్నాడు ప్రేమరాజు.

"ఇంకా ఎందుకండీ నాటకం.... కాలేజి రోజుల్నించీ మీరూ సరోజా ఆడుతున్న...."

ఆ మాటలు పూర్తికాలేదు. ఏ క్షణంలోనూ ఆవేశం చూపించని ప్రేమరాజు, ఆ మాట వింటూనే ఫెళ్ళున చెంపపెట్టు పెట్టాడు తనకు.

"రాక్షసీ! ఏం మాట్లాడుతున్నావో తెలుస్తోందా? నీ బ్రతుకూ, నా బ్రతుకూ బాగుపడాలని మన మేలుకోరి నీలో స్త్రీత్వాన్ని మేలు కొలిపిన ఇల్లాలిని, సాటి స్త్రీని అంతమాటని మహా పాపం చేశావు. ఇన్నాళ్ళూ నేను యెంతో ప్రయత్నంతో నిలపెట్టుకొన్న ప్రేమ ఇప్పుడే ఈ క్షణంలోనే పూర్తిగా చచ్చిపోయింది. ఐ హేట్ యూ నౌ...."

గర్జించినట్లే మాట్లాడాడు ప్రేమరాజు. ఆ మాటలు వింటూనే వణికిపోయింది తను. మగతకమ్మినట్లయి తూలిపడిపోయింది.

కళ్ళు తెరిచి చూసేసరికి డాక్టరు వుంది తన ప్రక్కన. తనను చూసి నవ్వి, "కంగారుపడకమ్మా-తల్లివి కాబోతున్నావు" అంది.

డాక్టరు వెళ్లాక ప్రేమరాజు తన దగ్గరకొచ్చి తన చేతికో కాగితం ఇచ్చాడు "సారీ గీతా.... స్త్రీని యెంతగానో గౌరవిస్తాను నేను. అటువంటిది నా భార్యను, గర్భవతిని చెంపదెబ్బ కొట్టవలసి రావడం చాలా దురదృష్టం....అయిందేదో అయిపోయింది. నీమీద నాకే ఆశా లేదు. ఒకప్పుడు విడాకులపత్రం రాసిచ్చి వెళ్ళమన్నావు. ఇదిగో ఇప్పుడు రాసిస్తున్నాను."

అతని మాటలు ములుకుల్లా బాధించాయి తనను. ఏదో నేరం చేసినదానిలా వణికిపోయింది. బలవంతాన మాట పెగుల్చుకొని "డాక్టర్.... నేను తల్లిని కాబోతున్నానని చెప్పింది" అంది తను.

తనవంక నిరసనగా ఓసారి చూసి....నెమ్మదిగా కదిలి వెళ్ళిపోయాడు ప్రేమరాజు.

తనలోని ఒక భాగం వెళ్ళిపోయినట్లనిపించింది తనకు.

మొదటినుంచి జరిగిన విషయాలను సింహావలోకనం చేసుకుంది గీత.

ప్రేమరాజుతో పరిచయమైనది మొదలు ఒక్కసారి కూడా అతను తన మనసు నొచ్చుకొనేటట్లు ప్రవర్తించలేదు. తనకు అడుగులకు మడుగులొత్తుతూ అతి జాగ్రత్తగా అతి మర్యాదగా ఎప్పుడూ ఏ మగవాడూ నడచుకోని పద్ధతిలో నడచుకున్నాడు. తండ్రి చెప్పిన మాటలకంటె తనకు అతన్ని అనుమానించడానికి ఆధారమే లేదు.

సరోజ తనకు యూనివర్సిటీలో తెలిసినప్పటినుంచీ అందరూ యెంతో గౌరవంతో చూసేవారు.

తనతో పరిచయమైన తర్వాత ఆమెలో యెంతో వివేకం అవగాహన చూసింది తాను. ఏమాత్రం ఆవేశం చూపించకుండా అనేక విషయాలపై ఆమెకున్న బలమైన అభిప్రాయాలు చెప్తున్నప్పుడు తనే ముగ్ధురాలయి పోయింది. తనను ప్రేమరాజు ఏవగించుకొని వెళ్ళిపోయిన తర్వాత తాను నేరుగా సరోజ దగ్గరకు వెళ్ళింది. ఎంతో స్నేహంగా తనను ఆదరించి, ప్రేమరాజు ఆమెకు ఉద్యోగం సంపాదించడంలో యెంతో సాయం చేసేడని అంత మంచిభర్తను పొందగలిగినందుకు తనను యెంతో అభినందించింది. పూర్తిగా తొలగని సంశయాలతో వెళ్ళిన తాను ఆమె నిర్మలమైన ముఖం చూస్తూ ఆమె మనసులో యెటువంటి నీచమైన భావాన్ని కనీసం వూహించలేకపోయింది.

ఇక తన తండ్రి! చిన్నప్పటినుంచీ జరిగిన సంఘటనలన్నీ ఆలోచిస్తూంటే అసలు ఇన్నాళ్ళెలా ఆయనతో ఉండగలిగిందో అర్థం కావటం లేదు. ఏదో తగవులాడి బంధువులందర్నీ దూరం చేసుకున్నాడు. తల్లి ఆయన బాధలు పడలేక, తన పసితనంలోనే ఆత్మహత్య చేసుకుందన్నారు. తన ఆటపాటల్లో ఎప్పుడూ తానాలోచించలేదుగాని ఇప్పుడాలోచిస్తూంటే అది సంభవమనే అనిపిస్తూంది.

ఎప్పుడూ స్వాతిశయాన్ని చాటుకుంటూ ఎదుటివారిని సంపద తోనే తూచే ఆయన పద్ధతు లెప్పుడూ చిరాకు అయినా తన కార్య క్రమాల కెప్పుడూ అవి అడ్డురాకపోవడంచేత తను పట్టించుకోలేదు.

ప్రేమరాజును చూసినప్పటినుంచీ ఆయన కించపరుస్తూనే వున్నాడు. ఒక్కసారి పొరపాటునయినా మెచ్చుకున్న పాపాన పోలేదు. ఆ దృష్టితోనే ఆయన సరోజనూ ప్రేమరాజునూ చూసి వుండాలి.

అదీకాక వాళ్ళిద్దరూ అవినీతిగా వుండదలచుకుంటే ఎగ్జి బిషనుకంటే వాళ్ళకు వేరే ప్రదేశమే దొరకదా? వినీ వినగానే తండ్రి మాటలు తల కెక్కించుకొని యెంత పొరపాటు చేసింది తను!

ఆ దృష్టితో చూస్తే మొదటిసారి తను ప్రేమరాజును స్కూటరెక్కించుకోవడం అవినీతి కాదూ? ఎన్నోసార్లు ఒంటరిగా అతనితో రాత్రులు హోటళ్ళకూ సినిమాలకూ వెళ్ళడం అవినీతి కాదూ! ఛీ!ఛీ! తానెంత తెలివితక్కువగా ప్రవర్తించింది!

గీత అప్రయత్నంగా ప్రేమరాజు కొట్టిన చెంప తడిమి చూసుకుంది! ఇప్పుడేమాత్రం బాధ కలగటం లేదు సరికదా మన సంతా యెందుకో సంతృప్తితో నిండిపోతూంది. అవును! తనకీ చెంపదెబ్బ అవసరమే!

గీత మనసులో ప్రేమరాజుపట్ల ప్రేమ వరదలై పొంగు తూంది. వెంటనే వెళ్ళి ఆ దేవతా మూర్తిని క్షమాపణ కోరుకోవాలి. అతని మనసు వెన్నవంటిది! తప్పు ఒప్పుకొన్న తనను చూసి తప కుండా కరిగిపోతాడు!

మర్నాడు గీత తన బట్టలన్నీ ఒక పెట్టెలో సర్దుకుంది. తండ్రిపేర ఒక వుత్తరం రాసి పెట్టింది.

సాయంత్రమయ్యేదాకా క్షణమొక యుగంగా గడిపింది.

* * *

తలుపుతీసి యెదురుగా పెట్టెతో నిలబడ్డ గీతను చూసి ఆశ్చర్యపోయింది సరోజ.

"ఏమిటిది?"

"వచ్చేసేను సరోజా! మా నాన్నను వదిలి నా భర్తతో వుండాలని వచ్చేసేను. కాని ఆయన ముఖం చూసేముందు మీ క్షమాపణ కోరుకోవాలని ఇక్కడకు వచ్చేను."

"ఏమిటి గీతా! నాకు క్షమాపణ ఏమిటి?"

"అవును సరోజా! రాతిలా వున్న నా మనసును విప్పి నన్నో మనిషిని చేశారు మీరు. దానికి నేను కృతజ్ఞత చెప్పవలసింది పోయి దురహంకారంతో చెప్పుడు మాటల్ని విని మిమ్మల్నీ నా భర్తనూ అనుమానించి అనరాని మాటలన్నాను! ఎన్నడూ కోపం యెరుగని ఆయనకు కోపం తెప్పించేను! ఎంతో హింసించేను! మీవరకూ నన్ను మన్నించండి!"

"ఛ! డోంట్ బి సిల్లీ! రండి! లోపలకు రండి!"

"లేదు. ప్రేమరాజును వెంటనే కలవాలి! వస్తాను" అంటూ గీత యెలా వచ్చిందో అలాగే వెళ్ళిపోయింది.

సరోజ గీత వెళ్ళినవైపు చూస్తూ గుమ్మంలో అలాగే నిలబడిపోయింది.

"విష్యూ గుడ్ లక్!" అనుకుంది మనసులో గీతనూ ప్రేమరాజునూ తలచుకుంటూ.

ఏమీ తోచక ప్రేమరాజు మొదటాట సినిమా చూసి రాత్రి పది గంటలకు ఇంటికి వచ్చేడు.

తాళం తీద్దామనుకొనేసరికి గుమ్మం పక్కనే పెట్టెమీద తల పెట్టుకొని నిద్రపోతూన్న గీత కనబడింది.

తన కళ్ళను తానే నమ్మలేకపోయాడు.

ఆమెపట్ల విపరీతమయిన జాలి కలిగింది. వెంటనే చేతులతో యెత్తుకొని తీసుకెళ్ళి మంచంమీద పడుకోబెట్టాలనిపించింది. మరు క్షణంలో ఆమె ముందురోజు అన్న మాటలకు కోపం వచ్చింది. ఏమయినా తను ఊరికే వెనుక వెనుక పడడం కూడా అనవసరం అనిపించింది. తాళంతీసి తలుపు తీసేడు.

చప్పుడుకు గీత లేచింది.

ప్రేమరాజు ఆమెను గమనించనట్లే లోపలకు వెళ్ళిపోయేడు.

పెట్టె తీసుకొని గీత అతని వెనుకనే లోపలకు వెళ్ళింది.

ప్రేమరాజు వెనుదిరిగి చూడలేదు.

పెట్టె క్రిందపెట్టి గీత అతని ముందుకు వెళ్ళి నిలబడింది.

"నేను మీతో వుండడానికి వచ్చేసేను" అంది తలవంచుకొని.

ప్రేమరాజు మాట్లాడలేదు.

"మా నాన్ననూ, ఆస్తినీ, అహంకారాన్నీ విడిచివచ్చేను."

ప్రేమరాజు మాట్లాడలేదు.

"నేను చేసిన నిందకు సరోజ దగ్గరకు వెళ్లి ఆమె క్షమాపణ కోరుకొని వచ్చేను" తలెత్తి అతని కళ్లల్లోకి చూసింది.

అతను కళ్ళు కలిపేడు. ఆమె చూపు మరల్చకుండా అంది

"పెళ్లిముందు నాలో ఏంచూసి ప్రేమించేరండీ మీరు! ప్రాణంలేని బొమ్మను నేను—వాసనలేని పువ్వును నేను—భావం లేని గీతాన్ని నేను. ఇప్పుడు అన్నీ కూర్చుకొని మిమ్మల్ని హృదయంనిండా నింపుకొని నన్ను నేను సమర్పించడానికి వచ్చేను! దయతో స్వీకరించండి!" గీత కాళ్ళమీద పడిపోయింది.

"గీతా! మై డియర్ డియర్ గీతా!" ప్రేమరాజు హృదయంలో ప్రేమసముద్రం పొంగింది. గీతను లేవనెత్తి గాఢంగా కౌగలించుకున్నాడు.

గీత కళ్లల్లోంచి ఆనందబాష్పాలు జల జలా రాలిపోయేయి.

## 22

ఆ రోజు శనివారం.

బ్యాంకు అయిపోగానే రవి మూడుగంటలకు యింటి కొచ్చేసేడు.

కాంతం టీ తీసుకొచ్చి యిచ్చింది రవికి.

రవి టీ తీసుకుంటూ రేడియోలో పాటలు వింటూ సోఫాలో కూర్చున్నాడు.

కాలింగ్‌బెల్ చప్పుడు విని తలుపు తెరిచేడు.

"నేను ఎ టు జడ్ ఎంటర్ప్రైసెస్‌లో మేనేజర్‌నండి. ఇది మా ప్రొప్రయిటరుగారు మీకిమ్మన్నారు" అంటూ ఒకతను చేప్

రికార్డర్ పాకెట్ ఒకటి ఇచ్చేడు.

"అరె! నేను తరవాత తీసుకుంటానని చెప్పేనే!" అన్నాడు రవి.

అంతకు ముందురోజే రవి తనతోటి ఆఫీసరు మూర్తి టేప్ రికార్డరు కొనాలని తోడుగా రమ్మంటే ఎ టు జడ్ ఎంటర్‌ప్రైసెస్‌కు వెళ్ళేడు. మూర్తి తీసుకున్న రికార్డర్ ఎంతో ముచ్చటగా ఉంది. వచ్చే పెళ్ళిరోజునాడు సరోజకు కానుకగా కొనివ్వాలనిపించింది. చాలా బాగుందనీ త్వరలోనే తనూ తీసుకుంటాననీ అన్నాడు. ఆ షాపు ప్రొప్రయిటర్ కావలిస్తే అప్పుడే తీసుకెళ్ళమనీ డబ్బు కావాలంటే కొద్ది రోజుల్లో యియ్యవచ్చునీ చెప్పేడు. ఎంతో బలవంతం చేసేడు. అయినా రవి తీసుకోలేదు. కాని చేతిలో డబ్బుంటే తీసుకోవాలనే అనిపించింది.

"పోనీ యిప్పుడైతే మాత్రం యేం పోయింది?" అనిపించి అతన్ని లోపలకు పిలిచి "చూడండి! నా దగ్గర అంత కేష్ లేదు. చెక్ యిస్తాను తీసుకెళ్ళండి" అని చెక్ బుక్ తీసేడు.

"నేనిప్పుడు షాపు కెళ్ళటంలేదు సార్! సోమవారం తమరు మా ప్రొప్రయిటరుగారి కిచ్చెయ్యండి." అంటూ రవి కిక మాట్లాడే అవకాశం యివ్వకుండా వెళ్ళిపోయేడు అతను.

కాలక్షేపానికి యిది బాగాకే ఉందనుకుంటూ కూర్చొని పాకెట్ విప్పేడు రవి.

ఇంతలో మళ్ళీ మ్రోగింది బెల్.

ఈసారి యిద్దరు మనుషులు మంచి దుస్తుల్లో బయట నిలబడి ఉన్నారు.

"ఎస్ ప్లీజ్!" అన్నాడు రవి.

అందులో ఒకతను జేబులోంచి ఒక ఫోల్డరుతీసి చూపించాడు.

"మేము సి.బి.ఐ. నుంచి వచ్చిన ఆఫీసర్స్! ఎ టు జడ్ ప్లాస్టిక్స్ లిమిటెడ్‌ను మీరు ఇన్‌స్పెక్ట్ చేసి ఆ ఫర్మ్‌మీద అనుకూల మైన రిపోర్టు యివ్వడంకోసం లంచం అడిగినట్లు మాకు కంప్లైయింట్ వచ్చింది.

నిన్న అందులో పార్ట్నర్ సురేంద్రకుమార్ తమ్ముడి షాపుకు వెళ్ళి మళ్ళీ యీ ప్రస్తావన తెచ్చి యీ కేసెట్ టేప్‌రికార్డరు మీకు కానుకగా యియ్యమని అడిగేరని కూడా కంప్లెయింటు వచ్చింది. అది ఋజువుచేసుకోడానికి మేము వచ్చేము...."

రవికి ముచ్చెమటలు పోసేయి. నోట మాట రాలేదు. తన కళ్ళను చెవులను తానే నమ్మలేకపోయాడు.

"ఈ రికార్డర్‌కు మీరు పే చేసినట్లుగా ఏమయినా రశీదు చూపించగలరా?" అని అడిగేడు అతను.

"నో! నేనింకా పేచెయ్యలేదే అసలు జరిగిందేమిటంటే...." అని రవి జరిగిందంతా చెప్పేడు.

"అది మీరు తరువాత అవసరం వచ్చినప్పుడు చెప్పవలసి ఉంటుంది. ప్రస్తుతానికి దీన్ని మేము మీకు రశీదు యిచ్చి తీసుకొని వెడుతున్నాం..." అని రికార్డర్ తీసుకున్నట్లుగా ఒక రశీదు వ్రాసి యిచ్చి తీసికెళ్ళిపోయారు వాళ్ళు.

రవికి పిచ్చెక్కినట్లయింది. అది కలో నిజమో అర్థంకాలేదు. ఆ రోజు ఇన్‌స్పెక్షన్‌కు వెళ్ళినప్పుడు సురేంద్రకుమార్ అన్న మాటలు గుర్తుకొచ్చేయి. తను విషవలయంలో చిక్కుకున్నట్లు గుర్తించేడు.

సాయంత్రం ఇంటికివచ్చిన సరోజ రవిలో వచ్చిన మార్పు చూపి ఆశ్చర్యపోయింది. ఎప్పుడూ తను రవిని అంత దిగులుగా పరాకుగా చూడలేదు. ఎంత అడిగినా జవాబు తెలుసుకో... ఇద్దరి మధ్యా అపార్థాలు తొలిగిపోయి యెంతో సుఖంగా వున్నామనుకుంటూంటే మళ్లీ యిదేమిటోనని భయం వేసింది. రవి గ్రహణం పట్టిన సూర్యుడిలా చిన్నబోయివుంటే చూడలేకపోతోంది.

సోమవారం మధ్యాహ్నం లంచ్ తర్వాత బ్యాంకులో రవిని మేనేజరు పిలిచేడు.

లోపలకు వెళ్ళగానే ఓ కాగితం చేతిలో పెట్టేడు. రవి ...ల్లబోయేడు.

"ఈరోజు ఉదయమే యిక్కడికి సి.బి.ఐ.ఆఫీసర్ను వచ్చేరు.

ఆ విషయాలేవో తేలేవరకూ నిన్ను సస్పెన్షన్‌లో ఉంచడంకంటె నాకు గత్యంతరం లేకపోయింది" అన్నాడు మేనేజర్.

"కాని నావైపునుంచి యేమీ వినకుండా మీ రిటువంటి చర్య ఎలా తీసుకుంటారు సార్!" ఆందోళనతో అడిగేడు రవి.

"ఇది అందుకే!" అని కాగితం చూపిస్తూ, "ఇందులో చార్జెస్‌కు నువ్వుజవాబు చెప్పు! నీకేంతెలీదని నువ్వు చెప్పగలిగితే.... అప్పుడివేమీ లేనట్లే! కాని అప్పటివరకూ....అయామ్ సారీ! నా కింకో దారిలేదు."

రవి అవమానంతో కృంగిపోయాడు. తిరిగి డిపార్టుమెంటు లోకి వెళ్ళి స్కూటర్ తాళాలు తీసుకొని ఎవరితోనూ మాట్లాడకుండా ఇంటికొచ్చేసేడు.

సాయంత్రం రవిని చూసిన సరోజ మనసు యింకా కలగిపోయింది. టీ యిస్తూ ఎంతో గుచ్చి గుచ్చి అడిగింది.

రవి ఏం మాట్లాడకుండా లేచి బయటకు వెళ్ళిపోయాడు.

రవి అటు వెళ్ళగానే బ్యాంకునుంచి మూర్తి వచ్చి రవికోసం అడిగేడు. ఇప్పుడే బయటికి వెళ్లేరని చెప్పి యేమైనా చెప్పాలా అని అడిగింది. అతను యేదో సంశయిస్తున్నట్లు కనబడి రవిలో వచ్చిన మార్పుకు దానికీ ఏమయినా సంబంధముందేమోననిపించి బ్యాంకులో ఏమయినా అయిందా అని అడిగేసింది.

మూర్తిద్వారా విషయమంతా తెలుసుకుని నిర్ఘాంతపోయింది. తనకు చెప్పకుండా తనలో తానే కుమిలిపోతూన్న రవిని తలచుకుంటూంటే అంతులేని బాధ కలిగింది. రవి ఎప్పుడొస్తాడా అని కాళ్ళు కాలిన పల్లిలా తిరిగింది.

సాయంత్రం రావడంతోనే రవి తన గదిలోకి వెళ్ళిపోయాడు. రెండు నిముషాలాగి సరోజ వెళ్ళింది గదిలోకి.

లోపల లైటు లేదు. రవి కిటికీ దగ్గర కుర్చీలో కూర్చుని చీకట్లోకి చూస్తున్నాడు.

సరోజ లైటువేసి రవి పక్కకు వెళ్ళి నిలబడింది.

రవిలో చలనం లేదు.

ఆమె ప్రేమతో జాలితో అతని వైపు చూసింది. ఒంటరిగా కూర్చున్న అతన్ని చూస్తూంటే మనసు నీరైపోయింది. మెల్లగా అతని తలమీద చెయ్యివేసింది. అతన్ని దగ్గరగా తీసుకుంది. కొంత నిశ్శబ్దం తర్వాత సరోజ అంది.

"మనం ఎంత నిజాయితీగా వున్నా పరీక్షా సమయాలు కొన్ని వస్తాయి. మీరీ తప్పు చెయ్యలేదని నాకు నమ్మకం వుంది. విధి ఎదురైనప్పుడు ఇటువంటి నిందలు పడవలసి వస్తుంది. కాని.... ఈరోజు మీరుచేసిన పనికి బాధ పడినంతగా నేను వారంరోజుల క్రితం చెంపదెబ్బ కొట్టినప్పుడు కూడా బాధపడలేదండీ! మీరు నన్ను మీ హృదయంలోంచి తీసేసేరు! మీచేత నా మెడలో తాళి కట్టించు కున్నది ఇటువంటి అనుభవాలు పంచుకోడానికేనండీ! నన్ను వదిలేసి మీరిలా వంటరిగా బాధపడకండీ! నన్నింత క్రూరంగా దూరం చెయ్యకండీ!" సరోజ రవి తలను హృదయానికి హత్తుకుంది. ఆమె కళ్ళల్లోంచి దూకిన నీళ్ళు అతని చెక్కిళ్ళమీద పడ్డాయి.

రవి హృదయం స్పందించింది. సరోజపట్ల ప్రేమ వరదలై పొంగింది.

"సరోజా!" అని పిచ్చిగా ఆమెను కౌగలించుకున్నాడు.

## 23

మేనేజరు చేతిలో వున్న కాగితాలు చదివి పెదవి విరిచేడు.

"ఏమంటారు సార్?" అన్నాడు ఎదురుగా కూర్చున్న రవి ఆత్రుతతో.

"అనేందుకేముంది? నువ్వు చెప్పదలచుకున్నది చెప్పేవ్! లెటజ్ సీ!"

"అది కాదు సార్! దీనిమీద మీ అభిప్రాయం ఏమిటి? నేను చేసేనని బ్యాంకు ఆరోపించిన నేరం చెయ్యలేదని ఋజువుచేసేనా?"

"నిర్దుష్టంగా ఎలా చెప్పేది?"

"నేను నేరం చేసేనని మీరు అనుకోగానే నిర్దుష్టంగా నన్ను సస్పెండ్ చెయ్యలేదా సార్? మీకా అధికారం వుంది. అలాగే నేను చెప్పిన విషయం మీకు నచ్చితే మీ అభిప్రాయంమీదే

బ్యాంకు నిర్ణయం కూడా ఆధారపడి వుంటుంది."

"ఆల్ రైట్! నీ పొజిషన్‌ని నేను సింపతైజ్ చేస్తున్నాను. నన్నేం చెయ్యమంటావు?"

"నేనేం నేరం చెయ్యలేదని నాకు తెలుసు! ఆ విషయంలో మిమ్మల్ని నమ్మించాలని నా ప్రయత్నం. నేను వ్రాసిచ్చిన సంజాయిషీద్వారా మీకు నేను నేరం చెయ్యలేదని నమ్మకం కలిగిందా లేదా? అది నా ప్రశ్న."

"లేదు."

"ఎందుచేత?"

"నువ్వు చెయ్యలేదనే చెప్పేవు కాని, వాటికి కొన్ని ఋజువులు కావాలి."

"వేటికి ఋజువులు కావాలి?"

"ఎ టు జడ్ ప్లాస్టిక్స్‌ను ముందు నువ్వు ఎడ్వాన్సు రికమెండ్ చెయ్యలేదనీ, విలియమ్స్‌దానికి బాధ్యుడనీ అన్నావు."

"అవును."

"కాని సాంక్షను నీ ఇనస్పెక్షను రిపోర్టుమీద ఆధారపడి ఉంది."

"ఆ రిపోర్టు నాది కాదు!"

"ఎవరిది?"

"విలియమ్స్‌ది."

"ఎలా చెప్పగలవు?"

"దానిమీద ఆయన సంతకం వుంది."

"దానిమీద నీ సంతకం కూడా వుంది."

"అఫ్‌కోర్స్! అది నా పొరపాటే. ఒప్పుకుంటాను. కాని నేను ఇనస్పెక్షనుకు వెళ్ళకుండా అక్కడ సంతకం పెట్టేనన్న విషయాన్ని ఋజువు చేస్తే అది ఆయన కావాలని చేసిన మోసం అని తెలుస్తుందిగా!"

"సరే! నువ్వు వెళ్ళలేదని ఎలా ఋజువు చేస్తావు?"

"మీ పొజిషన్‌లో నేనుంటే ఇన్‌స్పెక్షను రోజు ఇనస్పెక్ష

నుకు వెళ్ళేందుకు దారి ఖర్చుల వోచర్ చూసేవాడిని. అందులో విలియమ్స్ వోచర్ వుంటుంది. నాది వుండదు.''

"దటీజ్ గుడ్!" మేనేజరు బెల్ నొక్కేడు. ప్యూన్ వచ్చేడు. కాగితం మీద ఒక తేదీవ్రాసి "అర్జెంటుగా ఈ తేదీ కన్వేయన్స్ వోచర్స్ అన్నీ కావాలని తీసుకురా!" అన్నాడు.

"తరువాత మీరు నన్ను పెర్మిట్ చేస్తే ఓసారి నా డ్రాయర్లో కాగితాలన్నీ వెతుకుతాను. నాకు వ్రాసి తీసేసిన కాగితాలు డ్రాయర్లో పెట్టడం అలవాటు" అన్నాడు రవి.

"దానికేం! తప్పకుండా!" అన్నాడు మేనేజరు.

వెంటనే రవి తన టేబిల్ దగ్గరకు వెళ్ళేడు. తను రెండు రోజుల ముందుదాకా అక్కడ ఆఫీసరు అయినా అందరూ ఇప్పుడు నేరస్థుడుగా చూస్తున్నట్లనిపించి సిగ్గుపడ్డాడు రవి.

అరగంట వెదకిన తర్వాత అనుకున్న కాగితం దొరికింది. రవి మనసు కుదుటబడింది. తిరిగి ఆ కాగితం తీసుకొని మేనేజరు దగ్గర కెళ్లేడు.

"ఇదిగోసార్ నా మొదటి ప్రపోజల్! పార్ట్నర్‌షిప్ డీడ్ సరిగాలేదనీ, వాళ్ళ స్కీమ్ ఫీజిబుల్‌గా లేదనీ యెడ్వాన్సు ఇవ్వడానికి వీల్లేదనీ వ్రాసేను! దానిమీద "ప్లీజ్ స్పీక్" అని విలియమ్స్ రాసేడు! తర్వాత చూడండి. 'ప్రపోజల్ నేను వేరే నోటితో చెప్పిన విధంగా వ్రాయి' అని విలియమ్స్ వ్రాసి సంతకం చేసేడు కూడాను!"

రవి వుత్సాహంగా చూపించేడు.

మేనేజరు చూసేడు. ఇంతలో ప్యూను వోచర్స్ తీసుకొచ్చేడు. అందులో విలియమ్స్ ఎటుజడ్ ప్లాస్టిక్స్ ఇనస్పెక్షను వెళ్ళినందుకు ఇరవై రూపాయలు దారి ఖర్చులుగా తీసుకున్న వోచరు దొరికింది.

మేనేజరు రవిని మెచ్చుకుంటూ చూసేడు.

"యస్! ఇదంతా విలియమ్స్ పనే అని నమ్ముతున్నాను."

"అయితే మీరు నామీద ఆరోపించిన నేరాన్ని పూర్తిగా వెనక్కు తీసుకోగలరా?"

"బ్యాంకుకు సంబంధించినంతవరకూ తీసుకోగలను. కానీ నువ్వు డబ్బు చెల్లించకుండా ఎటుజడ్ ఎంటర్‌ప్రైసెస్ నుంచి టేప్ రికార్డర్ తీసుకున్నట్లున్న సిబిఐ రిపోర్టును నేను కాదనలేను. నువ్వు నిర్దోషివని నమ్మినా నేనేం చెయ్యలేను. అయామ్ ఎఫ్రైడ్ దేర్ యు ఆర్ ట్రాప్డ్! నా పొజిషన్ నువ్వు అర్థం చేసుకుంటా వనుకుంటాను" అన్నాడు మేనేజరు.

"యస్సర్!" అని గొణిగేడు రవి.

"ఏమైనా నా చేతనయినంత సహాయం చెయ్యడానికి ప్రయత్నిస్తాను. విష్యూ గుడ్‌లక్!"

రవి మేనేజరుతో కరచాలనంచేసి నిరుత్సాహంగా బయటకు వచ్చేడు.

*            *            *

ఒక స్థానిక పోలీసు స్టేషన్.

పోలీసు కాన్‌స్టేబుల్ ఒక ముప్ఫైఏళ్ళ యువకుడిని తీసుకొని సర్కిల్ ఇనస్పెక్టరు రూమ్‌లోకి వెళ్ళేడు.

సర్కిల్ ఇనస్పెక్టరుకు యెదురుగా ఓ కుర్చీలో ప్రేమరాజు కూర్చొని వున్నాడు.

సర్కిల్ ఇనస్పెక్టరు తీక్షణంగా వచ్చిన యువకుడి కళ్ళల్లోకి చూసేడు.

అతను తలదించుకున్నాడు. అతను చూడటానికి సన్నగా పొట్టిగా పిట్టలా వున్నాడు.

"ఏమయ్యా! ఏమిటి నీపేరు?" అన్నాడు సి.ఐ.

"శంకర్రావండి."

"ఏమిటలా భయపడిపోతున్నావ్! ఎప్పుడూ పోలీస్ స్టేషనుకి రాలేదా?" వేళాకోళంగా అన్నాడు సి.ఐ.

అతను వెర్రినవ్వు నవ్వబోయి ఏడుపు ముఖం పెట్టేడు.

"ఏంచేస్తూంటావ్ నువ్వు?" ఈసారి సీరియస్‌గా అడిగేడు సి.ఐ.

"కొలువు చేస్తున్నానండి" అతని కంఠం కొంచెం వణుకుతూంది.

"అదేనయ్యా? ఎక్కడ?"

"ఎటుజడ్ ఎంటర్‌ప్రైసెస్‌లో నండి."

"ఏంపని నీది."

"మేనేజరండి."

"అంటే...."

"షాపు బాధ్యతలన్నీ నావేనండి?"

"శుక్రవారం మీ షాపుల్లో బ్యాంకు ఆఫీసరు మిస్టర్ మూర్తి టేప్ రికార్డర్ కొన్నారా?"

"సరిగా గుర్తులేదండి!"

"గుర్తుతెచ్చుకో!" గద్దించేడు సి.ఐ.

"నాకేం హానికలగదని మీరు హామీయిస్తే నిజం చెప్పేస్తానండి" అన్నాడు అతను భయం భయంగా చూస్తూ.

"నీకేం ఫరవాలేదు. చెప్పు" అన్నాడు ప్రేమరాజు.

"శుక్రవారం ఆయన ఫ్రెండుతో మా షాపుకొచ్చినప్పుడు మూర్తిగారు కొన్న టేప్ రికార్డరు బాగుందనీ త్వరలో కొంటాననీ అన్నారండి. దానికి మా ప్రొప్రయిటరు ఆయనకు కావలిస్తే తీసుకోమనీ డబ్బు కొద్దిరోజులు పోయాక ఇచ్చినా ఫరవాలేదనీ బలవంతం చేసేరు. కాని ఆయన తీసికెళ్ళలేదు. అప్పుడు నరేంద్రకుమార్ అన్నగారు సురేంద్రకుమార్ లోపల కేబిన్‌లో వున్నారండి. వాళ్ళు వెళ్ళిపోయిన తర్వాత రవికుమార్ చాలా గర్విష్టి అనీ ఆయనకు పాఠం చెప్పాలనీ ఆలోచించి ఆలోచించి టేపు రికార్డరు ఆయనకు నాచేత పంపించి పోలీసు స్టేషనుకో యెక్కడికో టెలిఫోన్ చేసేరండి...."

"వెరీగుడ్! అవసరమైతే ఇది నువ్వు కోర్టులో కూడా చెప్పాల్సి వుంటుంది."

మళ్ళీ అతని ముఖంలో భయం ఆవరించింది.

"భయపడకు! నేనున్నాలే" అని ప్రేమరాజు అతని వీపుతట్టి,

"సి.బి.ఐ ఆఫీసరు శ్రీనివాసన్ దగ్గరకు ఇతన్ని తీసుకెళ్ళి ఈ వివరాలన్నీ అందించండి! తరువాత నేను ఆయనతో మాట్లాడుతా"నని ప్రేమరాజు లేచేడు. ప్రేమరాజు వెళ్ళేసరికి రవి ఇంటిదగ్గరే వున్నాడు. సరోజ ఇంకా ఆఫీసునుంచి రాలేదు. రవి విష్‌చేసి లోపలకు తీసుకెళ్ళేడు. ప్రేమరాజు పోలీసు స్టేషనులో జరిగిందంతా చెప్పేడు. రవి ఆనందానికి హద్దులేదు.

"అసలు మీకీ విషయాలన్నీ యెలాస్తే తెలిసేయి?" అన్నాడు రవి ఆశ్చర్యపోతూ.

"రెండు రోజుల క్రితం సరోజ జరిగిందంతా చెప్పేరు. నేను మిగిలింది కొంత ఆచూకీ తీసేను."

"మీరు నాకు చాలా సహాయం చేసేరు. ఇప్పుడు నామీద నేరం తొలగిపోవడం పూర్తిగా దీనిమీదే ఆధారపడి వుంది."

"డోంట్ వర్రీ! రేపు ఉదయానికే సిబిఐ ద్వారా మీ బ్యాంకుకు నిజం తెలుస్తుంది."

"థాంక్యూ వెరీమచ్! మీకు ఎలా కృతజ్ఞత చెప్పుకోవాలో తెలీటంలేదు" అన్నాడు రవి ప్రేమరాజు కళ్ళల్లోకి చూస్తూ.

"మీకు స్నేహితుడుగా సాయంచెయ్యడం ఎలా వున్నా అది నా డ్యూటీ కదా!" అన్నాడు ప్రేమరాజు సంతృప్తితో.

## 24

ఆదివారంకదా అని రవి ఆలస్యంగా లేచేడు.

సరోజకోసం పిలవగానే బయటికెళ్ళిందని చెప్పింది కమలాదేవి. అంత ఉదయమే బయట కెక్కడికి వెళ్ళిందా అనుకుంటూ రవి మంచంమీదనుంచి లేచి అన్నీ ముగించుకొని కూర్చునేసరికి సరోజ వచ్చింది.

"ఏమిటింత పొద్దునే ఎక్కడికెళ్ళేవ్!" అన్నాడు ప్రక్కనే కాఫీ కప్పులతో నిలబడ్డ సరోజ నడుంచుట్టూ చేయిచుడుతూ.

"మీరు చేసిన నేరాన్ని ఋజువు చేసుకోడాని కెళ్ళేను" అంది సరోజ కాఫీ కప్పు ఇచ్చి రవి కళ్ళల్లోకి తియ్యగా చూస్తూ.

రవికి అర్థంకాలేదు. అయినా దొరికిపోవడం ఇష్టంలేక, "ఋజువయిందా?" అని అడిగేడు.

"ఆహా! అయింది."

"అయితే సాక్ష్యం ఏదీ?"

"దానికి ఏడెనిమిది నెలలాగాలి."

హఠాత్తుగా రవి మెదడులో మెరిపింది.

"నిజంగా!" అన్నాడు కాఫీ కప్పు టీపాయ్‌మీద పెట్టి సరోజను రెండు చేతుల్లో దగ్గరకు తీసుకుంటూ.

"నిజంగా" సరోజ చూపులు సిగ్గుతో వాలిపోయేయి.

"అయితే డాక్టరు దగ్గర కెళ్ళావా?"

"అవును."

"థాంక్యూ వెరీమచ్!" అని గొణుగుతూ రవి పెదవులతో సరోజను మృదువుగా చీరకట్టుపైన చుంబించేడు.

ఎన్నో కఠినమైన అనుభవాలమధ్య నా అన్న వాళ్ళు కరువైన ఈ కుటుంబవృక్షం కలతలు దాటి ప్రశాంతమయిన వాతావరణంలో చిగురు తొడుగుతూందని సంబరపడింది కమలాదేవి.

ఏ ఆంక్షలూ లేని స్వేచ్ఛా వాతావరణంలో మనుమల్ని ఎత్తుకోడానికి తహతహలాడుతూంది కాంతం మనసు.

ఆ సాయంత్రం....

కాంతం మొక్కలకు నీళ్ళుపోస్తూంది.

కమలాదేవి టీ కలుపుతూంది.

మబ్బులేని నీలాకాశంలో పడమటి దిక్కు సూర్యుడు బంగారు కాంతికిరణాలు విరజిమ్ముతున్నాడు.

సరోజను నీరెండ కెదురు నిలబెట్టి రవి ఫోటో తీసేందుకు కెమెరాలోంచి చూస్తూ లెన్స్ సవరిస్తున్నాడు.

సూర్యకిరణాలు కళ్ళల్లో పడుతూంటే సరోజ కళ్ళు చికిలించింది.

"కళ్ళు మూయ్యకు!" అన్నాడు రవి కెమెరాలోంచి చూస్తూనే.

"సూర్యుడు కళ్ళల్లో పొడుస్తున్నాడండీ!" అంది సరోజ.

"స్టాప్!" అని మరో గొంతు వినబడేసరికి అందరూ ఉలిక్కి
అటు చూసేరు.

ప్రేమరాజు గీతతో అప్పుడే కాంపౌండులో అడుగుపెట్టేడు.

గీతకు పురిటి రోజులు. ఆయాసంగా నడుస్తూ మెల్లగా
ంది.

"కమాన్! కెమేరా ఇటివ్వండి. మీరు వెళ్ళి సరోజపక్క
డండి!" ప్రేమరాజు రవి చేతిలో కెమేరా అందుకున్నాడు.
రాలోంచి చూసి "ప్లీజ్ స్మైల్!" అన్నాడు.

రవీ సరోజా కళ్ళల్లో కళ్ళు కలిపి నవ్వుకున్నారు.

కెమేరా క్లిక్‌మంది.

రవీ సరోజల మధ్య సూర్యుడివైపు తిరిగి చిరుగాలికి వయ్యా
ఊగుతూన్న పొద్దుతిరుగుడు పువ్వును చూపిన కాంతం
లమీద అప్రయత్నంగా సంతృప్తితో చిరునవ్వు వెలిగింది.



వచ్చే సంచికలో

నవలల పోటీలో

రెండవ బహుమతి పొందిన

నవల

రచన :

'వసుంధర'

ప్రొద్దు తిరుగుడుపు
రచయిత్రి
గురించి—



1960 లో నా 14 వ ఏట నేను వ్రాసిన వ్యాసం మొ
సారిగా ఆంధ్రపత్రిక వారపత్రికలో అచ్చయింది.

అప్పటినుంచీ నేనూ మావారూ 'యామిని' కలం పే
వేరు వేరుగా కథలు వ్రాసేము. ఇంచుమించుగా అన్ని పత్రికలలో
అచ్చయ్యేయి. నేను స్వంతంగా వ్రాసిన కథలు సుమారు పది
దాకా వుంటాయి. మావారు నవలలు ఇదివరలో వ్రాసినా,
స్వంతంగా వ్రాసిన మొదటి నవల ఇదే. నా చివరికథ ఆంధ్రభ
వారపత్రిక (5-1-79) లో అచ్చయింది.

నా వయస్సు 32 సంవత్సరాలు. సంతానం ముగ్గురు.
రమ్మాయిలు - ఒక అబ్బాయి. మావారు బ్యాంకులో ఆఫీసరు.
నా గురించిన వివరాలు. బహుమతికి కృతజ్ఞతలు.

—ఎ. నాగలక్ష్మి (ర



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA133M115 |
| పుస్తకం పేరు | జ్యోతి |
| తారీఖు | 31/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 129 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Aswini |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Ali. Ramya |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |